# శ్రీవిద్యాసర్వస్వము

(పుణ్యానంద మునీంద్రుల కామకళా విలాసమునకు తెలుగు వ్యాఖ్య)



సువర్ణ ఘంటాకంకణ
శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యావిశారద
క్రోవి పార్థసారథి



ఓం నమో వెంకటేశాయ

THIS BOOK

"SRIVIDYA SARVASVAM"

IS PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATHI DEVA STHANAMS
UNDER THEIR SCHEMS AID TO PUBLISH
RELIGIOUS BOOKS"


ప్రథమ ముద్రణము : డిసెంబర్ 1998

ప్రతులు : 1,000





మూల్యము : రూ. 75/-

ప్రతులకు:

శివకామేశ్వరి గ్రంథమాల
41-22/4-36, భ్రమరాంబాపురం
విజయవాడ. ✆ 522824



3-1-99 న 'శ్రీ విద్యా సర్వస్వము' గ్రంథావిష్కరణ చేయుచున్న శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చితానంద స్వామి వారితో గ్రంథకర్త దంపతులు



Phone : 2707 (Tenkasi)

HIS HOLINESS JAGADGURU

**SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI**

Sri Siddheswari Peetadhipati

Courtallam - 627 802

(Via) Tenkasi - Tirunelveli Dist. ---- South India

With Narayanasmritis

---

# అభినందన

5-5-1997

దేవీ పూజలో కౌళ, సమయమతములు, శ్రీ చక్రాంతర్గత రహస్యములు.
భిన్న సంప్రదాయములలో పంచదశీమహామంత్రము, షట్చక్రభేదన-
దేవి సాక్షాత్కారము మొదలైన విషయములు పామరులకు కూడా
అర్థమయ్యేరీతిలో
శ్రీ క్రోవి పార్థ సారథిగారు వ్రాసిన

**"శ్రీ విద్యాదర్పణము"**

గ్రంథావిష్కరణ సమయమున వారిని అభినందిస్తూ
కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠ మహా సంస్థానామోదమున గ్రంథకర్తను

**"శ్రీ విద్యారత్నాకర"**

అను బిరుదరాజముతో సన్మానించడమయినది.

ఇతి నారాయణస్మృతిః

श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम्
दक्षिणाम्नाय श्री शारदापीठम् शृङ्गेरी

*PRIVATE SECRETARY*
To His Holiness
Sri Jagadguru Shankarachraya
Dakshinamnaya
Sri Sharada Peetham,
SRINGERI-577139(Karnataka)



Ref : D-1\ 5843
Camp : శృంగేరి ,
Date : 19.11.1998.

శ్రీయుతులు క్రోవి పార్థసారథి గారికి నమస్కారములు .

మీరు పంపిన " శ్రీవిద్యా సర్వస్వము " అను గ్రంథమును శ్రీచరణులు అవలోకించినారు .

శ్రీ పుణ్యానంద మునీంద్రుల వారు రచించిన " కామకలావిలాసము " శ్రీవిద్యోపాసకులకు అత్యంత ప్రామాణికమగు గ్రంథము . ఆ గ్రంథమునకు మీరు తెలుగులో " శ్రీవిద్యా సర్వస్వము " అను పేరుతో విస్తృతమైన వివరణను వ్రాసి ప్రకటించుచుండుట ముదావహము . అనేక విషయములు ఈ గ్రంథమునందు కానవచ్చుచున్నవి. ఉపాసకులు ఈ గ్రంథమునాదరింతురు - గాకయని శ్రీచరణులు ఆశీర్వదించినారు .

ఇట్లు ,
[signature]

Sree Krovi Partha Sarathi Garu,
23-11\1-10\2 , Sree Devi Temple ,
Ogiralavari Street ,
Satyanarayana Puram ,
**VIJAYAWADA** – 520 011. ***(A.P.)***

दूरभाष : (एस.टि.डि. 04112-22115)

श्री चन्द्रमौलीश्वराय नमः

श्री शंकर भगवत्पाद परंपरागत:

मूल श्री कांची कामकोटि पीठाधिपति

# जगद्गुरु श्री शंकराचार्य स्वामि पादानां

श्रीमठ संस्थानम्

नं० 1, सालै मार्ग, काञ्चीपुरम् - 631 502


पत्रान्वयं :

तिथि 26.12.98

[illegible]

[illegible]

[illegible]

[illegible]

[illegible]

తెలుగు అనువాదము 14-12-1998

శ్రీ కామకలా విలాసమును గ్రంథము నందు బహుకాలమున కూడ అనుష్ఠింప జాలని ఉపాసనలలో ఒకటైన శ్రీ విద్యోపాసనా పద్ధతి సంపూర్ణముగ ప్రకాశించుచున్నది. ఈ గ్రంథమునకు తెలుగు భాషలో విజయవాడ వాస్తవ్యులైన శ్రీ క్రోవి పార్థసారథి మహాశయులచే లలితమైన వ్యాఖ్యానము చేయబడినది.

శక్త్యుపాసనయందు సంసక్తై మానసులై సంస్కృత భాష తెలియని పాఠకులకు ఈ గ్రంథము వలన మహోపకారము కాగలదు.

ఆపరా శక్తి యొక్క పరమకృపచే గ్రంథకర్తకు సర్వాభీష్ట సిద్ధులు కలుగుగాక అని ఆశాసించుచున్నాము.

- నారాయణ స్మృతులతో

శ్రీ విద్యా శంకర గురుభ్యో నమః

SRI SRI SRI

# Jagadguru Pushpagiri Sankaracharya Mahasamsthanam

PUSHPAGIRI PIN - 516 166

1-10-176/6, Begumpet
Hyderabad. ☎ 843790

Office ☎ 26201, Cuddapah
Pushpagiri Chennur Exchange

Station ..............
Date ..............

శ్రీ శ్రీ శ్రీ జగద్గురు

[illegible]

శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు

[illegible]


శ్రీ... ప్రో.వి... పా.ర్థ.సా.ర.థి.. గా.రి.కి, .................................................. గారికి

[illegible]

తాము పంపిన కామకళావిలానము నకు తెలుగు వ్యాఖ్య చూచితిమి. కామకళావిలాసము 'పుణ్యానందమునీంద్ర' విరచితము. ఉపాసనా ప్రపంచమున ప్రసిద్ధికెక్కిన పవిత్రపారాయణా గ్రంథములలో నిదియొకటి. ఇది యుపాసకులకు అవశ్యము అధ్యయనము చేయదగిన గ్రంథము. ఇందు శ్రీవిద్యారహస్యము - సర్వస్వము శాస్త్రీయంగా సంప్రదాయానుగుణంగా వివరింపబడినది. ఇందు ప్రధానము కామకళాస్వరూప నిరూపణమని గ్రంథనామమే తెలియజేయుచున్నది. ఇందు 'అ,హ'యనెడి అక్షరద్వయము యొక్క ప్రాముఖ్యము, ప్రభావము ఉపాసకులందఱు దర్శింపదగినది. ఇందు తురియపాదమున బిందుస్వరూప కామకళాస్వరూపములు, అవిద్యాపాదమున పంచభూత, అహంకార, పంచకోశాది వివరణము, విద్యాపాదమున ప్రధానముగ విద్యాకూటత్రయ పంచదశీఆవిర్భావ నిత్యాతత్త్వ, దేవతాతత్త్వ షడమ్నాయాదులు, ఆనందపాదమున షట్చక్రనిరూపణము, శ్రీచక్ర యోనిచక్ర పరాపశ్యంతి ముఖ్యవాక్స్వరూపములు. ఇంతేకాక వివిధ చక్రస్వరూపములు, గురుపరంపరాదులు, తుదకు ఆత్మస్వరూప నిరూపణము. తత్సాధనములైన పరాపరావిద్యాస్వరూపాదులు చక్కగ వివరింపబడినవి.

శ్రీపార్థసారథిగారు ఈగ్రంథమును శాస్త్రీయంగా మూలానుగుణముగా తేటతెనుగు భాషలో వివరించుట ముదావహము. వీరు ఆయనువాదమున శ్రీవిద్యావిషయమున తనకుగల అనుభవమును గూడ పొందుపరచి వివరించినారు. ఈగ్రంథము ఉపాసక లోకమున దేవీసంప్రదాయ విజ్ఞానజ్యోతులు వెలిగించి దేవీ సంప్రదాయక విషయములైన సంశయములను విచ్ఛిత్తిచేసి ఉపకరింపగలదని ఆశించుచున్నాము.

ఇతి
నారాయణ స్మృతయః
శ్రీవిద్యానృసింహభారతీస్వామి




Phone : 2707 (Tenkasi)

HIS HOLINESS JAGADGURU

SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI

Sri Siddheswari Peetadhipati

Courtallam - 627 802

(Via) Tenkasi - Tirunelveli Dist. ----- South India

With Narayanasmritis

---

## శ్రీముఖము

చిరంజీవులు శ్రీక్రోవిపార్థసారథి రచించిన "శ్రీవిద్యాసర్వస్వము" అనే గ్రంథమును స్థాలీపులాకంగా పరిశీలించి చూడటమైనది.

ఇది శ్రీపుణ్యానందమునీంద్రుల "కామకళావిలాసము' అనే సుప్రసిద్ధ శ్రీవిద్యాగ్రంథానికి తేటతెలుగులో రచించిన మనోహరవ్యాఖ్య.

లోగడ ఈతడు రచించిన శ్రీవిద్యాసంబంధిత గ్రంథాలను జూచిన మీదట, ఇతని మనస్సు మరింత భావశుద్ధమై యీ ఉత్తమ గ్రంథవ్యాఖ్యారచనతో వరాశక్తి సంపూర్ణానుగ్రహపాత్రమైనదని భావిస్తున్నాను.

శ్రీవిద్యాసంబంధమైన విషయాలను పరిచయం చేసికొని లోతుగా అధ్యయనం చేయగోరే సాధకులకు, కూలంకషంగా విషయ విమర్శనం చేయగోరు పరిశోధకులకు కూడా ఈగ్రంథం సర్వవిశేష విషయాలను ఒకేచోట జేర్చి బోధపరుస్తున్నది. కనుక దీనికిపేరు సర్వవిధాల సార్థకమైనది.

వాదప్రతివాదాలు, మతభేదాలు, విమర్శలు మొదలగు వాటితో విషయాన్ని జటిలంచేసి అగమ్యగోచరం చేయకుండా కేవలం శ్రీవిద్యాసత్సంప్రదాయాన్ననుసరించి విషయాలన్నింటినీ సాకల్యంగాను అనుశాస్త్రీయంగాను వింగడించిన చివరంజీవి పార్థసారథి రచనావిధానం ఘంటాపథంగా సాగి సాధకులను గమ్యాన్ని చేర్చగలదనటం నిర్వివాదము.

తన మనఃపరిపాకానికి అద్దం పట్టుచున్నదై, శ్రీవిద్యోపాసకులకు పరమపూజ్యమైన "కామకళావిలాస"గ్రంథానికి శ్రమసాధ్యమైన మధురవ్యాఖ్యానమొనర్చి ఆంధ్రులకు కరతలామలకం చేసిన శ్రీ క్రోవి పార్థసారథిని అభినందిస్తూ, మాపీఠాధిదేవత శ్రీరాజరాజేశ్వరీమాత సర్వదా యితనికి సకలాయురారోగ్యజ్ఞానైశ్వర్యాలను ఇతోధికంగా అనుగ్రహించి యిలాంటి ఉత్తమోత్తమ రచనలెన్నింటినో చేయించుచు సకుటుంబముగా పరిరక్షించుచుండాలని ఆశీర్వదిస్తూ

మకాం
శ్రీదత్తాత్రేయాశ్రమము.
విజయవాడ 8-11-98

నారాయణస్మృతులతో
శ్రీశివచిదానంద భారతీస్వామి.

# అవధూత దత్త పీఠము

శ్రీ గణపతి సచ్చిదానంద ఆశ్రమము

మైసూరు

---

అవధూత దత్త పీఠాధిపతి - జగద్గురు - పరమపూజ్య

## శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ వారి

## ఆశీస్సందేశము

పరతత్త్వం కాసు అయితే, శ్రీవిద్య దాని బొమ్మ. ఆత్మవిద్య దాని బొరుసు. కాసు బొమ్మవైపు మరింత ఆకర్షకంగా వుంటుంది. అందుచేత అందరూ అది కావాలని కోరుకొంటూ వుంటారు. ఆ బొమ్మ దూరంనుంచీ చూస్తున్నంతసేపూ, ఏదో కొత్త బొమ్మలాగా వుంటుంది. మనం దాని దగ్గరకు వస్తున్నగొద్దీ అది మన బొమ్మే అనిపిస్తూ వుంటుంది. బాగా దగ్గరకు వచ్చేసరికి, అది మన బొమ్మే అని ఖాయమవుతుంది. అపుడు ఆ బొమ్మకూ బొరుసుకూ పెద్దగా తేడా వుండదు. శ్రీవిద్యయే ఆత్మవిద్య అయ్యే పవిత్ర తరుణమది.

ఆ స్థితిలో ఆ బొమ్మ పేరు కామకళ. నీలో గల కళ నేనే అని దర్శన మిచ్చే దివ్యకళ. ఆత్మకాముకులకు ఆలంబనమైన ఆత్మకళ.

ఈ కామకళా విలాసాన్ని తాను దర్శించి లోకానికి అందించిన పుణ్యాత్ముడు పుణ్యానంద మునీంద్రుడు. ఆ పుణ్యాన్ని ఆంధ్రలోకానికి అందించి పుణ్యం కట్టుకొంటున్నవాడు క్రోవి పార్థసారథి. ఆయన ఇప్పటికే శ్రీవిద్యా దర్శనము, శ్రీవిద్యా దర్పణము, అనే గ్రంథాలను ఆంధ్రలోకానికి అర్పించిన లబ్ధ ప్రతిష్ఠుడు. ఇపుడు శ్రీవిద్యా సర్వస్వము అనే పేరుతో కామ కళావిలాసానికి విపుల వ్యాఖ్య వ్రాసి సమర్పిస్తున్నాడు.

మూల గ్రంథం శ్రీవిద్యకు, యోగ సాధనకు, ఆత్మవిద్యకూ, సామరస్యాన్ని సాధించిన ప్రౌఢ గ్రంథం. దీనికి క్రోవి వారి వ్యాఖ్యానం నిజంగానే శ్రీవిద్యా సర్వస్వంగా మారి, సార్థక నామధేయమైనదిగా వుండటం ఆ తల్లి దయకు ప్రత్యక్ష నిదర్శనం.

శ్రీవిద్యా గురుపరంపరలోని ఆద్యులలో దత్తాత్రేయస్వామివారి సంప్రదాయం అద్వైత ఆత్మవిద్యకు ఆలవాలం. ఆ స్వామి కృపవల్ల యీ గ్రంథం రచయితకూ, గ్రంథ పఠితలకూ గూడా గ్రంథస్థ విషయాలు అనుభవదఘ్నంగా అందివచ్చుగాక!

జయగురుదత్త.

# ముందుమాట

పరబ్రహ్మ నిరాకారుడు నిర్గుణస్వరూపుడు. సృష్టికి ముందు బిందుస్వరూపుడైన పరమాత్మ అనుత్తరానందం కోసం ఈజగత్తును సృష్టించదలచినవాడై తనను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు. ఆ భాగాలే 1.ప్రకాశాంశ. 2. విమర్శాంశ. ఇక్కడ ప్రకాశాంశయే పరాత్పరుడు కాగా విమర్శాంశ పరమేశ్వరి. వీరే శివశక్తులుగా పిలవబడుతున్నారు.

విమర్శాంశనుండే అవ్యక్తము, మహత్తత్వము, అహంకారము ఉద్భవించినాయి. అహంకారమునుంచే పంచభూతాలు, తన్మాత్రలు, ఇంద్రియాలు వచ్చినాయి. ఈరకంగా నామరూపాత్మకమైన జగత్తు సృష్టించబడింది. ఈజగత్తుకు కర్త పరమేశ్వరుడు. అతని ప్రతిరూపమే పరమేశ్వరి. అందుచేతనే శివశక్తులు ఇద్దరూ ఒకటేనని, వారిద్దరికి భేదంలేదని చెప్పబడింది.

మానవుడు తను జన్మించక ముందు ఎక్కడ ఉన్నాడు? ఏరకంగా ఇక్కడికి వచ్చాడు? మరణించిన తరువాత ఎక్కడికి పోతున్నాడు? ఈజగత్తంతా ఎవరివల్ల సృష్టించబడుతోంది? అనే విసయాలను గురించి ఆలోచించటమే అధ్యాత్మికచింతన.

సకల మునిగణము చేత ప్రార్థించబడుతున్నది. కాబట్టి కామకళ అనీ, కామకళ వలన పిండాండ బ్రహ్మాండములు ఉత్పన్నమౌతున్నాయి కాబట్టి దానిని విలాసమని, మొత్తంమీద కామకళావిలాసము అని ఈగ్రంథానికి పేరుపెట్టబడింది. దీనిని సంస్కృతంలో పుణ్యానంద మునీంద్రుడు రచించాడు.

ఒకరోజు పుణ్యానందముని ఆశ్రమప్రాంగంణంలో కూర్చుని ఉండగా ఆకాశంలో రెండు హంసలు ఎగురుతూ కనిపించాయి. అందులో ఆడహంస తనభర్తతో "నాథా ఏవిషయం తెలుసు కోవటంవల్ల మనకు అన్నివిషయాలు తెలుస్తాయో, దాన్ని నాకు వివరించండి" అని అడిగింది. అప్పుడు మగహంస "దేవీ! కుమ్మరివాడు మట్టితో అనేక రకాల కుండలు,బానలు తయారుచేస్తాడు. కుండల ఆకారం వేరయినా వాటిని తయారు చేసేందుకు ఉపయోగంచే మట్టి ఒకటే" అని చెప్పింది. ఆమాటలలోని సంకేతార్థాన్ని గ్రహించి ఆహంస స్వరూపజ్ఞానం పొంది శాశ్వతమైన సుఖాన్ని అనుభవించింది.

ఈవిషయాన్ని గ్రహించిన పుణ్యానందముని ఆహంసలు కామేశ్వరీ కామేశ్వరులుగానూ, వారి ప్రశ్నోత్తరములు కామకళా, తద్విలాసములు గానూ తెలుసుకుని ఈ గ్రంథాన్ని వ్రాశారు.

ఈగ్రంథం మొత్తం 55 సూత్రాలతో నాలుగు భాగాలుగా ఉంటుంది. ఆత్మ వస్తువే కామకళ.చంద్రుడు షోడశకళాయుక్తుడు. కాబట్టి ఆపదహారు కళలనూ నాలుగుపాదాలుగా

ఏర్పాటుచేసి, ఒక్కొక్క పాదమందు నాలుగు కళలున్నట్లుగా భావించారు. అవి

1.అవిద్యాపాదము 3.విద్యాపాదము

2.ఆనందపాదము 4.తురీయపాదము

ఆత్మవిద్యా, మహావిద్యా అని చెప్పబడే శ్రీవిద్యను ఈగ్రంథంలో కూలంకుషంగా వివరించటం జరిగింది. శ్రీవిద్యోపాసకులకు అత్యంత ప్రామాణికమైన కామకళావిలాసానికి తెలుగువ్యాఖ్యానమే శ్రీవిద్యాసర్వస్వము.

ఉపాసకులకు శ్రీవిద్యను గురించి క్షుణ్ణంగా అవగాహనకల్పించాలనే ఉద్దేశ్యంతోనే గతంలో 1. శ్రీవిద్యా దర్శనము 2. శ్రీవిద్యా దర్పణము 3. శ్రీవిద్యా రహస్యము అనే గ్రంథాలు నేను వ్రాసియున్నాను. వాటిలో రెండవది గౌడపాదుల వారి సుభగోదయ స్తుతికి తెలుగు వ్యాఖ్య. ఈగ్రంథాలను కొనుగోలు చేయమని దేవాదాయశాఖ కమీషనురువారు రాష్ట్రంలోని దేవాలయాలకు అర్డరు కూడా జారీ చేశారు. వీటన్నింటికీ దక్షిణామ్నాయ శారదాపీఠాధిపతులు, శృంగేరీపట్టణ నివాసులు అయిన శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థస్వామివారు ఆశీశ్శులుకూడా పంపటంజరిగింది. వాటిముద్రణకు తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్థికసహాయం కూడా అందజేశారు.

పైగ్రంథాలే కాకుండా దేవీభాగవతం ఆధారంగా దేవీకథాసుధ అనే పుస్తకం కూడా వ్రాయటం జరిగింది.

శ్రీవిద్యాసర్వస్వమనే ఈగ్రంథానికి తమ ఆశీశ్శులు పంపిన శృంగేరీపీఠాధిపతులకు నమస్సుమాంజులులు. అలాగే తమ శ్రీముఖము పంపి నన్ను ఆశీర్వదించిన కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతులకు, పుష్పగిరి పీఠాధిపతులకు కృతజ్ఞతలు.

ఈగ్రంథ ముద్రణకు ఆర్థికసహాయం చేసిన తిరుమలగిరివాసి శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్యచరణారవిందాలకు శతసహస్ర వందనాలు. తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి గారికీ ఇతర సిబ్బందికీ నాకృతజ్ఞతలు.

ఈగ్రంథరచనకు నన్ను అన్ని విధాలా ప్రోత్సహించిన నాధర్మపత్ని రమాదేవికి అభివందనలు.శాతవాహన కళాశాల అధ్యాపకులు శ్రీపింగళి వేంకట కృష్ణారావుగారికి నా కృతజ్ఞతలు.

శ్రీవిద్యమీద పూర్తిఅవగాహన కోసం అనేక విషయాలను ఇక్కడ అత్యంత సులభశైలిలో చర్చించటం జరిగింది. కాబట్టి దేవీభక్తులందరూ ఈగ్రంథాన్ని ఆదరిస్తారని ఆకాంక్షిస్తూ..

విజయవాడ బుధజన విధేయుడు

1.1.1999 భైరి పార్థసారథి.

# విషయసూచిక

| సూత్రము | విషయము | పేజినంబరు |
| --- | --- | --- |

# 1. తురీయపాదము
## ప్రకాశబిందు నిరూపణము

1. సకల భువనోదయస్థితిలయమయ లీలావినోదనోద్యుక్త :
అంతర్లీన విమర్శః పాతు మహేశః ప్రకాశమాత్రతనుః

సమస్త లోకములయొక్క సృష్టి స్థితి సంహారము లనబడే పంచకృత్యముల రూపమయిన ఆటయందు జాగరూకుడైనవాడు, లోపల విమర్శశక్తి కలిగి పైకి ప్రకాశశక్తి మాత్రమే శరీరముగా గలవాడు, సర్వ శక్తులు కలవాడు అయిన పరమేశ్వరుడు పుణ్యపురుషులను, సాధుపుంగవులను రక్షించుగాక. అని ప్రార్థిస్తూ హరితస గోత్రీకుడనైన క్రోవిపార్థసారథి అనునేను పుణ్యానందమునీంద్రుల కామకలావిలాసము అను గ్రంథానికి తెలుగులో సర్వజనామోదము పొందునట్లుగా సులభశైలిలో వ్యాఖ్యానము వ్రాయటానికి ఉపక్రమిస్తున్నాను. పండితులు ఈ నా సాహసాన్ని మన్నింతురుగాక.

వేదపండితుడు, మంత్రశాస్త్రవేత్త అయిన పుణ్యానందమునీంద్రులు స్వస్వరూపజ్ఞాన సాధనాలయిన శ్రీవిద్యా, శ్రీచక్రాల గురించి వివరించతలచిన వాడై, వాటికి అధిష్ఠాన దేవత అయిన కామకలాస్వరూపాన్ని ఇక్కడనుండి ఎనిమిది సూత్రాలవరకు వివరిస్తున్నారు. దీన్ని తురీయపాదము అని అంటారు.

సృష్ట్యాదిన నామరూపాలు లేవు కాబట్టి ఈ భాగంలో నాలుగు బిందువులను నిరూపిస్తున్నారు. వాటిలో మొదటిది ప్రకాశ బిందువు. సుఖము అనేది రెండు విధాలుగా ఉన్నది.

1. ఐహికమైనది. 2. శాశ్వతమైనది. ఐహిక సుఖము ప్రాపంచిక విషయాలకు సంబంధించినది. ఇది శాశ్వతంకాదు. క్షణికమైనది. శాశ్వతమైన ఆనందం సాయుజ్యంలోనేవున్నది. సాధకుడి జీవాత్మ పరమాత్మలో ఏకమైపోవాలంటే స్వస్వరూపజ్ఞానంకావాలి. అంటే తనను గురించి తాను తెలుసుకోవాలి. తన నిజరూపము తెలుసుకోవటానికి రెండు సాధనాలున్నాయి.

1. బాహ్యబ్రహ్మాండస్వరూపము 2.అంతర్యము. అదే తన శరీరమందు గలపదార్థ పరిశోధన.
1.బ్రహ్మాండపరిశోధనము స్థూలము 2.అంతర్యము సూక్ష్మము

ఆరెండింటికీ తేడాలేదు. స్థూల సూక్ష్మాలు రెండూ ఒకటే. స్వరూపజ్ఞానము వలన నిత్యసుఖము ప్రాప్తిస్తుంది. అంతర్ముఖుడికి మాత్రమే స్వరూపజ్ఞానంకలుగుతుంది. అంతర్ముఖుడు ఏవిధంగాకావాలి అనేది ఈగ్రంథంలో వివరించబడింది. లోకంలోని జనులు అజ్ఞానంవల్ల కష్టాలు పొందుతున్నారు. వారికి జ్ఞానము ఎప్పుడైతే కలుగుతుందో అప్పుడు శాశ్వతమైన సుఖం కలుగుతుంది.

వేదారంభములోను సమాప్తిలోను ఓమ్ అనే ప్రణవము ఉచ్చరింపబడుతుంది. అది ప్రకృతి రూపమైన పరాశక్తిలో లీనమవుతుంది. అప్రకృతి కన్నా పైన ఇంకొక తత్త్వమున్నది. అదే పురుషుడు అతడే మహేశ్వరుడు, పరమాత్మ పరాత్పరుడికి ఆరు అవయవాలున్నాయి.

1. సర్వ.జ్ఞత్వశక్తి
2. అనాదిబోధ
3. స్వతంత్రము
4. నిత్యత్వము
5. సంపూర్ణశక్తి
6. అనంతత్వము

సాధకునియొక్క జీవాత్మయే పరమాత్మ. అయితే పరబ్రహ్మస్వరూపము ఈరకంగా ఉంటుంది అని చెప్పటానికి గాని,గ్రహించటానికి గాని వీలు లేదు. అది అవాఙ్మానస గోచరమైనది.

అనంతశాస్త్రం బహూవేదితవ్య
మల్పశ్చకాలో బహవశ్చవిఘ్నాః
హంసో యథా క్షీరమివాంబుమధ్యా
ద్యత్సారభూతం తదుపాసితవ్యమ్॥

ఈ సకల చరాచరజగత్తునందు సారభూతముగా ఉన్న వస్తువే ఉపాసింపతగినది. జగత్తులోని ప్రతి వస్తువు సత్యము, అసత్యము అనే రెండు పదార్థాలతో కలిసి ఉంటుంది. అసత్యానికి నామరూపాలుంటాయి. సత్యము ఆ నామరూపాలకు చైతన్యము, వృద్ధి క్షయాలు కలుగచేస్తుంది. అది కంటికి కనిపించనిది. దానినే జీవాత్మ అంటారు. సత్యాసత్యాలు రెండూ కలిసి జగత్తు సృష్టింపబడింది. ఈ రెండింటిలో సత్యభాగాన్ని సారము అంటారు. నువ్వులలోని నూనె సత్యము, పిండి అసత్యము అలాగే మానవుడిలోని ఆత్మసత్యము దేహము అసత్యము. సారము అంటే రసము. చరాచరజగత్తులో ఏవస్తువైతే సారభూతంగా ఉన్నదో అది రసము అదే బ్రహ్మ పదార్థము. కాబట్టి సత్యము నిత్యము అయిన ఆత్మను గురించి తెలుసుకొన్నవారు బ్రహ్మానందం పొందుతారు.

ఈ సృష్టిని గురించి అనేక మంది అనేక రకాలుగా ఊహించి వ్రాశారు. గౌడపాదుల వారు కూడా మాండూక్యకారికలలో దీన్ని వివరించారు. ఐహిక బంధాలమీద అపేక్ష ఉన్న వారు మాత్రమే ఈ సృష్టిని గురించి పట్టించుకుంటారు అంతేకాని జ్ఞానులు సృష్టిని గురించి ఆలోచించరు. ఈ సృష్టి జరగటానికి పూర్వము బ్రహ్మ స్వరూపుడైన పరాత్పరుడు ఒక్కడే ఉండేవాడు. అతడికి రూపంలేదు. లింగ భేదంలేదు. ఇప్పటికి కుడా కొన్ని చిత్రాలలో క్షీరసాగరముమధ్యన వటపత్రశాయిఅయిన చిన్న పాపడు కుడికాలు బ్రొటనవ్రేలు నోట్లో పెట్టుకుని అమాయకంగా చూస్తున్నట్లుగా ఉంటుంది. సృష్టికి ముందుగా ఉన్న పరబ్రహ్మ ః స్వరూపం అదే. తరువాత కొంత కాలానికి అతని వల్లనే ఈ సృష్టి జరిగింది. ఈపరబ్రహ్మ

స్వరూపాన్నే పూర్ణ బిందువుగా చెప్పటం జరిగింది. పూర్ణ బిందు స్వరూపుడైన పరమేశ్వరుడు అనుత్తరానందం కోసం సృష్టినిచేయదలచి, తనను తాను రెండు భాగాలుగా చేసుకొన్నాడని, ఆ భాగాలే ప్రకాశాంశ, విమర్శాంశ అని, అవే శివశక్తులు అని చివరి శ్లోకాలలో వివరించటం జరిగింధి. స్వస్వరూపజ్ఞానం అంటే సాధకుడుతనయొక్క నిజమైన రూపాన్ని గురించి తెలుసు కోవటము. సాధకుడి శరీరం నాలుగు భాగాలుగా విభజించబడింది, వీటిని గురించి లలితా సహస్రం లో కుడా చెప్పబడింది.

శ్రీమద్వాగ్భవకూటైకస్వరూపముఖపంకజా
కంఠాది: కటి పర్యంతం మధ్యకూట స్వరూపిణీ
శక్తికూటైకతాపన్న కట్యధోభాగ ధారిణీ.

| | |
|---|---|
| 1. కటిప్రదేశానికి క్రింది భాగం అంతా | శక్తి కూటమి |
| 2.కంఠమునుంచి కటి ప్రదేశమువరకు మధ్య కూటమి.ఇది | కామరాజ కూటమి. |
| 3.భ్రూమధ్యమునుండి అంటే ఆజ్ఞాచక్రంనుంచి కంఠము వరకు | వాగ్భవకూటమి. |
| 4.బ్రహ్మరంధ్రంనుంచి భ్రూమధ్యమువరకు | తురీయాకూటమి. |

తురీయ కూటమినందున్నది ఆత్మ. దానికే బ్రహ్మకల, ధృవకల అని కూడా పేర్లు. కాళిదాసు చిద్గగనచంద్రికలో వ్రాసినట్లుగా

ద్వాదశాంతం లలాటోర్ధ్వం కపాలోర్ధ్వావసానకమ్
ద్వ్యంగుళోర్ధ్వం శిరోదేశాత్పరం వ్యోమ ప్రకీర్తితమ్।
హృత్త్రికయాత్మశశి భాను విగ్రహః ఖేచరత్వనలదృష్టిధామ యః
యత్తదూర్ధ్వ శిఖరం పరం నభ స్తత్ర దర్శయ శివం తమంబికే ॥

బ్రహ్మరంధ్రానికి కొంచెము క్రిందిగా ఉన్న ప్రదేశాన్ని 'ద్వాదశాంతం' అంటారు. ఇదే పరాకాశము. ఇక్కడ ఉన్న చంద్రమండలమే ప్రకాశ బిందువు.



# విమర్శబిందు నిరూపణ

**2. సా జయతి శక్తి రాద్యా నిజసుఖమయనిత్యనిరుపమాకారా**

**భావిచరాచరబీజం శివరూప విమర్శ నిర్మలాదర్శః**

భావికాలంలో పుట్టవలసిన చరాచర జగత్తుకు, సకల తత్వాలకు, సకల వర్ణాలకు, బీజము వంటిది, కార్య కారణరూపమైనది, అయిన శివ స్వరూపమైన జ్ఞానానికి, నిర్మలము, ఆనంద స్వరూపము, నిత్యము, నిరుపమానము అయిన పరాభట్టారిక సర్వోపనిషత్ప్రతిపాదికమై సర్వోత్కర్షగా ఉన్నది.

విమర్శశక్తి ప్రకాశ బిందువులో అంతర్లీనంగా ఉన్నది. అటువంటి విమర్శ శక్తిని విమర్శ బిందువుగా విభజించి నిరూపిస్తున్నారు. ప్రకాశ బిందువు సృష్టికి ఆది వస్తువు. అందుకనే దానిని సర్వ కారణంగా చెప్పటం జరిగింది. విమర్శ బిందువు సృష్టికి కారణంగా ఉన్నది. ఈ ప్రకాశ విమర్శ బిందువులే శివశక్తులు, వీరే కామేశ్వరీ కామేశ్వరులు.

ఈ సృష్టి కారణము ఎవరు? అనే ప్రశ్న వచ్చి నప్పుడు కొందరు శివుడు కారణమని, మరి కొందరు శక్తి కారణమని అంటారు. ఇది నిజం కాదు. ఈ సృష్టికి ఇద్దరూ కారణమే. అసలు పరాత్పరుడు ఒక్కడే. తానే రెండు భాగాలుగా మారి శివుడు గాను, శక్తి గాను చెప్పబడు తున్నాడు. అటువంటప్పుడు ఈ సృష్టికి కారణము ఇద్దరూ అని చెప్ప వలసినదే. అక్కడ రెండు రూపాలు లేవు ఉన్నది ఒక్కటే రూపం.

విత్తనంలో పెద్ద వృక్షం సూక్ష్మ రూపంలో దాగి ఉన్నది. అలాగే విమర్శ శక్తిలో భావిజగత్తు కూడా దాగి ఉన్నది. ఇక్కడ బీజము కారణము వృక్షము కార్యము . అలాగే పరాశక్తి కార్యకారణ రూపంగా ఉన్నది.

**అలేఖ్యవిశేష ఇవ గజవృషభయోర్ద్వయోః ప్రతిభాసమ్**

**ఏకస్మి న్నేవార్థే శివశక్తి విభాగకల్పనాం కుర్మః ॥**

ఒకే బొమ్మను చూసి కొందరు ఎద్దు అనీ, కొందరు ఏనుగు అనీ భావించినట్లే, ఒకే బ్రహ్మను చూసి కొందరు శివుడని, కొందరు శక్తి అని భావిస్తున్నారు.

**న శివేన వినా దేవీ దేవ్యా చ న వినా శివః**

**నైతయో రంతరం నాస్తి చంద్రచంద్రిక యోరివ॥**

శివుడు లేకుండా శక్తిలేదు. శక్తి లేకుండా శివుడు లేదు ఇద్దరూ కలిసే ఉంటారు. ఇద్దరికీ భేదం లేదు.

శివుడు, శక్తి ఇద్దరూ కలిస్తేనే ఈ జగత్తును సృష్టించే శక్తి వారికి ఉంటుంది. లేకపోతే వీరిద్దరిలో విడిగా ఏ ఒక్కరికీ ఆశక్తి ఉండదు.

ప్రకాశబిందువు బ్రహ్మస్వరూపం. అందుచేతనే అది అకారస్వరూపము, చంద్రమండలము అని చెప్పబడుతున్నది. విమర్శబిందువు శక్తిస్వరూపం. అగ్నిమండలం. దీని బీజం హకారము. వీరిద్దరి సామరస్యమే 'అహం' అనే శబ్దము. ఇదే పరబ్రహ్మస్వరూపం.

అహం అనే జ్ఞానానికి నిర్మలమైనశక్తి అద్దంలాటిది. అద్దంలో మన ప్రతిబింబాన్ని చూసినప్పుడుది మనమే అని ఎలా తెలుసుకుంటామో, అలాగే పరమేశ్వరుడు తన ఆత్మ స్వరూపిణిని చూసి నేను సర్వపరిపూర్ణుణ్ణి అనుకుంటున్నాడు. శక్తికి శివసంబంధములేనిదే ఆమె ఈజగత్తును సృష్టించలేదు. అలాగే శివునికి పరాశక్తి సంయోగము లేదే స్వరూపజ్ఞానం కలగదు. కాబట్టి శివశక్తులు అని చెప్పబడే కామేశ్వరీ కామేశ్వరులవలననే ఈ జగత్తు సృష్టించబడుతోంది.

ఈ పరబ్రహ్మస్వరూపం నిజసుఖమయమైనది. సుఖాలు రెండురకాలు. 1. క్షణికమైన ఆనందము 2. శాశ్వతమైన ఆనందము. క్షణికమైన ఆనందము వస్తువులవలన, ప్రాణులవలన పొందేది. ఈ ఆనందము కొద్దిక్షణాలు లేదా కొంతకాలముమాత్ర మే ఉంట ుంది. కేవలం ధనార్జన లేదా స్త్రీ సంభోగముల వల్లనే సుఖము ఉన్నది అనుకొంటే, అది తప్పు. మనం సంపాదించిన ధనము, భోగభాగ్యాలు మనవెంటరావు. కాబట్టి ఇవి శాశ్వతములు. శాశ్వతమైనది బ్రహ్మానందం. అదే నిత్యము, అదే సత్యము. దీనినే నిజసుఖము అంటారు. ఆశక్తిని ఆరాధించటం వల్లనే ఈ సుఖం వస్తుంది. శక్తికి ఆద్యంతాలు లేవు. సృష్ట్యాదిన ఉంటుంది. అంతంలోనూ ఉంటుంది. ఆమె అవ్యయ. అందుకే ఆమెత్యో అనిప్పు టం జరిగింది. ఆమెతో పోల్చటానికి వేరే రూపం లేదు. వస్తువులేదు. శక్తిలేదు. శకిత్తో సమానమైన వస్తువు కాని, ఆమెకన్నా ఎక్కువదైనశక్తి కాని లేదు. అందుచేతనే ఆపరాశక్తి నిరుపమాకార. అని చెప్పబడింది. పోల్చటానికి వేరే ఎవరూ లేక ఒంటరిగా ఉంటుంది కట్టి ఏకాకి. సృష్టికి ప్రారంభవస్తువు ఇదే. ప్రకాస్తు వునుండి విడివడి సృష్టికి ప్రారంభము అవుతున్నది. అందుకే ఇది మూలశక్తి. ఈ పరాశక్తి రూపము తేజోమయము.

పరబ్రహ్మస్వరూపం సర్వశక్తిమయమైనది. బ్రహ్మపదార్థంనుంచివిమర్శ బిందువు ఉత్పన్నమైంది. దీనిలో అన్ని శక్తులు కలిసి ఉన్నాయి. తాడును చూసి పాము అనుకున్నట్లుగా ఆత్మలో స్పందన శక్తిని కలిగిస్తుంది. అదీ క్షణకాలము. ఆస్పందనశక్తినే ఇచ్ఛాశక్తి అంటారు. ఈస్పందన కలగగానే జ్ఞానశక్తి ఆవిర్భవిస్తుంది. అదే విమర్శబిందువు. మొదట బిందువు ఒక్కటే ఉన్నది. అదే పరబ్రహ్మ. దానిలోనుంచి సృష్టిప్రారంభ సమయంలోవివ బి ందుబైట కు వచ్చింది. ప్రకాశబిందువుయొక్క ప్రతిబింబమే విమర్శబిందువు. ప్రకాంద వు బింబము,

విమర్శబిందువు ప్రతిబింబము. ఇదే మాయ. ఇదే ఈ సృష్టికి కార్యకారణ రూపమవుతున్నది.

కామకళ ఆత్మరూపమైనది. నామరూపాలనే రెండింటిలోను రూపమునసుసరించి షోడశీకళ ఉన్నది. అది నాశనము లేనిది. నిత్యమైనది. మిగిలిన కళలుపదిహేను షోడశీకళనుంచి పుట్టి మళ్ళీ దానిలోనే కలిసిపోతాయి. షోడశీకళ యోగులకు మాత్రమే దర్శనమిస్తుంది. బ్రహ్మవేత్తలకు జ్ఞానదృష్టికి కనిపిస్తుంది. ఈరకంగా రూపాత్మకమైన ఈ కళ సాధకులకు పరాకాశంలో దర్శనమిస్తుంది.

ఇక నామాన్ని గనక చూసినట్లైతే అకారము పరబ్రహ్మస్వరూపము. చంద్రమండలము. అదే ప్రకాశబిందువు. అగ్ని బీజమైన హకారము విమర్శబిందువు. ఈరెండు వర్ణముల వలన షోడశీకళ 'అహం' అయి శివశక్తుల స్వరూపాంగా ఏర్పడింది.

---

## మిశ్రమబిందువు

3. స్ఫుటశివశక్తిసమాగమబీజాంకురరూపిణీ పరాశక్తిః
అణుతరరూపానుత్తరవిమర్శలిపిలక్ష్యవిగ్రహా భాతి॥

స్పష్టమైన ఇచ్ఛాజ్ఞానశక్తులయొక్క సమ్మేళనముచేత, బీజాంకుర రూపమయినటువంటి సూక్ష్మమైన స్వరూపము కలిగిన 'అ' కార 'హ' కారములచేత చూడతగిన శరీరముకలిగి ఆ పరాశక్తి ప్రకాశించుచున్నది. అంటే ఆ పరావక్తి శివశక్తుల స్వరూపమయిన 'అహం' అనే బీజద్వయముతో ప్రకాశించుచున్నది.

ఈ శ్లోకంలో మిశ్రమబిందువును వివరిస్తున్నారు. ఈ బిందువు ప్రకాశాంశ, విమర్శాంశల, ఇచ్ఛాజ్ఞాన శక్తుల స్వరూపము. శివశక్తుల మేళనము లేకుండా సృష్టిజరగదు. అందుచేత ఈ మిశ్రమబిందువు సృష్టికి బీజాంకురముగా ఉన్నది. బీజంలోనే అంకురము ఉంటుంది. బీజము ఎప్పుడైతే వికసిస్తుందో అప్పుడు అది అంకురరూపం దాలుస్తుంది. కాబట్టి బీజాంకురాలు రెండూ పరస్పరాపేక్ష, అన్యోన్య సమ్మేళనము కలిగి ఉంటాయి.

అనుత్తర లిపి అంటే యాభైఅక్షరాలలోను ఇంతకు ముందు ఏ అక్షరము లేనందున 'అ' కారము అని తెలుస్తోంది. విమర్శలిపి అగ్ని తత్త్వాత్మకము ' హ' కారము ఈ రెండు అక్షరముల సంయోగమే'అహం'. ఈ రెండు అక్షరముల మధ్య మిగిలిన అక్షరాలన్నీ యిమిడి ఉన్నాయి. 'అహం' అనే ఈ పదంలో సకల శబ్దజాలము, సకల తత్త్వములు, వస్తువులు ఇమిడి ఉన్నాయి. కాబట్టి నామరూపాత్మకమైన జగత్తుకు కార్యకారణరూపము అవుతున్నది. ఇదే ఆత్మ. ఇదే

బ్రహ్మ పదార్థము. బ్రహ్మోపనిషత్ లో

ఏషు సర్వేషు భూతేషు గూఢాత్మా న ప్రకాశతే
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥

పరమాత్మ అన్ని ప్రాణులయందు 'అహం' అనే రూపంలో అతి రహస్యంగా ఉన్నాడు. అయితే జ్ఞాన దృష్టిగల మహనీయులే దీనిని తెలుసుకోగలుగుతున్నారు.

---

## మహాబిందువు ఆవిర్భావము

4. పరశివరవికరనికరే ప్రతిఫలతి విమర్శదర్పణే విశదే
ప్రతిరుచిరుచిరే కుడ్యే చిత్తమయే నివిశతే మహాబిందుః

ప్రకాశరూపుడైన పరమశివుడనబడే సూర్యునియొక్క కిరణ సముదాయము, నిర్మలమైన స్ఫురణ శక్తి అనే అద్దమందు ప్రతిఫలించుచుండగా, జ్ఞానైక స్వరూపమై ప్రకాశిస్తున్న గోడయందు శివశక్తుల రూపమైన అహమనే బిందువు ప్రవేశించుచున్నది.

ఈ శ్లోకమందు కామకలా అక్షరద్వయాన్ని వివరిస్తున్నారు గతంలో చెప్పినట్లుగా ప్రకాశబిందువు శివస్వరూపము, చంద్రమండలము ఇది అకార రూపము. అలాగే విమర్శబిందువు శక్తి స్వరూపము అగ్నిమండలము. ఇది హకార రూపము. ప్రకాశ విమర్శ శక్తులు రెండూ మొదట ఒకటిగానే ఉండేవి. కాని తరువాత చంద్ర, అగ్నిరూపాలుగా విడిపోయినాయి. ఈ రెండు బిందువుల సంయోగంచేత మూడవదయిన సూర్య బిందువు ఉద్భవిస్తున్నది. అది ఎలా అంటే అకారస్వరూపుడైన శివుడు, హకారరూప అయిన శక్తిని చూస్తున్నాడు. శక్తి అద్దము వంటిదని గతంలోనే చెప్పబడింది. కాబట్టి శివుడు శక్తిని చూసినప్పుడు, శివుని తేజస్సు వలన ఆశక్తిలో ఈశ్వర ప్రతిబింబమే ప్రకాశిస్తోంది. అపుడు శివ, శక్తులు రెండూ, ఈ రెంటి సమ్మేళనమువల్ల ఏర్పడ్డ మూడోబింబము అంటే 'అ' 'హం' 'అహం'. ఈ మూడవ బిందువైన అహమనేది ఉత్పత్తికి లోక దృష్టాంతము.

పగటిపూట సూర్యుడికి ఎదురుగా అద్దంఉంచినట్లైతే, సూర్యబింబము అద్దంగుండా పరావర్తనము చెంది దగ్గరలోఉన్న గోడమీద పడుతుంది. ఇప్పుడు 1. సూర్యబింబము 2.

అద్దంలో ప్రతిబింబము 3. గోడమీద ఉన్న కాంతిబింబము. అని మూడు బింబాలున్నాయి. మూడవ బింబము రావటానికి సూర్యుడు, అద్దము రెండూ సమానమైన కారణాలే. ఏది లేకపోయినా మూడవది రాదు. ఇలాగే ఈ సృష్టికి శివశక్తులిద్దరూ కారణమవుతున్నారు. మానవశరీరములో

| | |
|---|---|
| 1.చిత్కల | 6. చిత్తము |
| 2. జీవము | 7. చైతన్యము |
| 3. సాక్షి | 8. మనస్సు |
| 4. కూటస్థుడు | 9 బుద్ధి |
| 5. సూత్రాత్మ | |

అనేవి ఉన్నాయి. ప్రాణి తాను చేసిన కర్మననుసరించి ఇతర లోకాలకు వెళతాడు. పుణ్యలోకాలు ,సాయుజ్యము పొందుతాడు. ప్రకాశబిందువే సర్వకారణ వస్తువు. అదే పరమాత్మ. ఇది సాధకుల శిరోభాగంలో బ్రహ్మరంధ్రం దగ్గర ఉంటుంది. ఈ ప్రకాశబిందువే సాక్షి రూపము. ప్రకాశము అంటే 'చిత్కళ', సాక్షి కూటస్థుడు అని చెప్పబడుతోంది.

సాక్షి అనబడే ఈ కళ విమర్శశక్తిలో బ్రహ్మవస్తువుకు ప్రతిబింబంగా ఉన్నది. ఈశక్తి బ్రహ్మ ప్రతిబింబానికి అద్దంవంటిది. ఇందుచేత ఆత్మ బింబము అని శక్తి, ఉపాధి అని, అందులోని ప్రతిబింబము సాక్షి అని చెప్పబడుతున్నాయి. ఈ సాక్షియే కూటస్థుడని, చిత్కళ అని, అంతర్యామి అని పిలవబడుతున్నాడు.

సూర్యబింబము అద్దంలో కనిపించినప్పుడు దానికి తేజస్సు ఉన్నట్లుగానే సాక్షికి కూడా ప్రకాశత ఉన్నది. దీనివలన మనసులో ఇంకొక బింబము కనిపిస్తోంది. ఈరకంగా ఒకే సూర్యుడు ఆకాశంలోను, అద్దంలోను, గోడమీదా మూడురకాలుగా కనిపిస్తున్నాడు. అలాగే సర్వవ్యాపి అయిన పరమాత్మ, అతని ప్రతిబింబమయిన సాక్షి, దాని ప్రతిబింబము జీవుడు. సాక్షికి ప్రతిబింబమైన జీవుడు 'అహం' అని ప్రతి శరీరంలోనూ ఉంటున్నాడు. అయితే 'అహం' అంటే జీవుడు కాదని, సాక్షి అనీ ఇక్కడ చెప్పబడుతోంది.

దీనివల్ల శుద్ధసత్వమనే మాయోపాధియందు ఉన్న బ్రహ్మ ప్రతిబింబము, సాక్షికూటస్థుడు అని చెప్పబడింది. ఆత్మరూప ప్రకాశ వస్తువు సాక్షికి కారణము. ఆ సాక్షి జీవుడనే ప్రతిబింబానికి కారణము.

# కామకలా నిరూపణము

5. చిత్తమయో హంకార స్స్వవ్యక్తాహార్ధ సమరసాకారః
శివశక్తిమిథునపిండః కబళీకృతభువనమండలో జయతి॥

జ్ఞానస్వరూపముగల స్వప్రకాశస్వాత్మ విశ్రాంతి రూపమయిన అహంకారము, అత్యంత స్పష్టము, అకార హకారములయొక్క లో లీ భావము అనే స్వరూపము ( సభారస వము) గలిగిన ప్రకాశ విమర్శాత్మక దివ్యదంపతీ సంపుటము, అంతస్థాపితమైనషట్త్రింశత్తత్త్వ కదంబము, సకలశబ్దజాలము కలదై సర్వోత్కర్షగా ప్రకాశిస్తున్నది.

ఈశ్లోకంలో అహం అనే వస్తువును వివరిస్తున్నారు. అహమనేది చిత్తస్వరూపము. చిత్తము జ్ఞానరూపము. ఆ జ్ఞానము విమర్శ యుక్తము. ఈరకంగా విచారించటంవలన అహమనేది ఆత్మస్వరూపము, శివశక్త్యాత్మకము. అహమనేదే చిత్తము.

చతుర్దశ భువనాలు నామము, రూపము అని రెండు వస్తువులను కలిగి ఉన్నాయి. ఇందులో నామము శబ్దమయము. ఆ శబ్దము యాభై అక్షరాల సమూహము ఆ అక్షరాలకు మొదటిది అకారము చివరిది హకారము అక్షరాలలో చివరిది క్షకారమైనప్పటికీ, అది క,షలయొక్క మిశ్రమమవటంచేత, దానిముందుగల హకారమే చివరి అక్షరంగా తీసుకోవటం జరిగింది. అందుచేత అకార హకారముల మధ్యనున్న అక్షరాలన్నీ దీనిలో కలసి ఉన్నాయి.సకలలోకాలలోను గల శబ్దజాలమంతా దీనిలో ఇమిడి ఉన్నది.

ఇక రూపాన్ని చూసినట్లైతే దీనికి చంద్ర సూర్యాగ్నులు కారణ వస్తువులు. అకారము చంద్రమండలము అంటే అ నుంచి 16 అక్షరాలు (అః)వల చంద్రకళలు. హ కారము అగ్నిమండలము. యకారము నుండి క్షకారము వరకు పది అక్షరాలు అగ్నికళలు. ఈ చంద్ర, అగ్నుల సమ్మేళనమే 'అహం'. ఈరెండు అక్షరాలకు మధ్యలో ఉన్నది.సూర్య మండలంగాను సౌరకళలుగా గ్రహించాలి.

సూర్యని కళలు పన్నెండు. అవి:

| | |
|---|---|
| 1. తపినీ | 7. సుషుమ్నా |
| 2. తాపినీ | 8. భోగదా |
| 3. ధూమ్రా | 9. విశ్వా |
| 4. మరీచీ | 10. బోధినీ |
| 5. జ్వాలినీ | 11. ధారిణీ |
| 6. రుచి | 12. క్షమా |

ఈ పన్నెండు కళలూ కకారమునుండి ఠకారము వరకు పైనుంచి క్రిందికీ, డ నుంచి భ వరకు క్రింది నుంచి పైకి రెండు ఆవృత్తులుగా ఉంటాయి. వీటిలో 12 చంద్రకళలకు 12 అగ్నికళలకు సంబంధించినవి. కాగా 25వ అక్షరమైన మకారము షోడశికళ అని చెప్పబడుతోంది.

ఈ ఇరవైనాలుగు కళలు మిశ్రమ మండలముగా ఉన్నందున ఇది అహమనిపించుకుంటుంది. చంద్ర, అగ్నికళలు ఈ దిగువ ఇవ్వటం జరిగింది.

| చంద్ర కళలు (16) | అగ్నికళలు (10) |
|---|---|
| 1. అం అమృతా | యం ధూమ్రా |
| 2. ఆం మానదా | రం ఊష్మ |
| 3. ఇం పూషా | లం జ్వలినీ |
| 4. ఈం తుష్టి | వం జ్వాలినీ |
| 5. ఉం పుష్టి | శం విస్ఫులింగా |
| 6. ఊం రతి | షం సుశ్రీ |
| 7. ఋం ధృతి | వం సురూపాక్షీ |
| 8. ౠం శశి | హం కపిలా |
| 9. ఌం -చంద్రిక | ళంహవ్యవాహినీ |
| 10. ౡం - కాంతి | క్షం కవ్యవాహినీ |
| 11. ఏం జ్యోత్స్న | |
| 12. ఐం శ్రీ | |
| 13. ఓం ప్రీతి | |
| 14. ఔం అంగదా | |
| 15. అం పూర్ణా | |
| 16. అః పూర్ణామృతా | |

అ,కార హకారాల మధ్యనున్న అక్షరాలు సూర్య మండలము కాబట్టి ఇది మిశ్రమ మండలము. ఈ మూడు మండలాలలోను 36 తత్త్వాలువ్నాయి. ఈ తత్త్వాల వివరాలు

| | |
|---|---|
| పంచభూతాలు | - 5 |
| తన్మాత్రలు | - 5 |
| జ్ఞానేంద్రియాలు | - 5 |
| కర్మేంద్రియాలు | - 5 |

| | |
|---|---|
| త్వగాది ధాతువులు (చర్మము రక్తము, మాంసము, మెదడు, ఎముకలు, మజ్జ, శుక్లము) | - 7 |
| ప్రాక్ పశ్చిమ దక్షిణ ఉత్తర వాయువులు | - 4 |
| మనస్సు | - 1 |
| మాయ, శుద్ధవిద్య మహేశ్వరుడు, సదాశివుడు. | - 4 |
| | ------ |
| మొత్తం తత్త్వాలు | 36 |
| | ------ |

ఈరకంగా ఈ మూడు మండలాలలోను ముప్పైఆరు తత్త్వాలు, అహమనే రెండు అక్షరాలు, సకల వేదశాస్త్ర మంత్ర భాషారూపమైన శబ్దాలు అన్నీ కలసి ఉండటంచేత ఇది కబళీకృత భువన మండలము అని చెప్పబడింది. ఈ అహంకారస్వరూపమైన శివశక్తుల కలయికవల్లనే నామరూపాత్మకమైన జగత్తు సృష్టింపబడుతున్నది.

## బిందుత్రయము

6\. సితశోణబిందుయుగళం వివిక్త శివశక్తి సంకుచ ప్రసరమ్
వాగర్థసృష్టిహేతుః పరస్పరానుప్రవిష్టవిస్పృష్టః॥

అన్యోన్యమైన విహార స్వభావంకల కామేశ్వరీకామేశ్వర స్వరూపమయినదీ, ముకుళీభూతమైన అంకురము కలది, నామరూపముల సృష్టికి హేతువైనది, అన్యోన్య సమ్మేళనముచే పృథగ్భూతమైన రక్త శుక్ల సమ్మేళన సంపుటము సర్వోత్కర్షగా వర్తించుచున్నది.

పరమేశ్వరుడు వేదాది శబ్దజాలానికి మూలమైన అక్షరములలో మొదటిదైన అ కార రూపుడై, తనవలన సృష్టించబడిన సకల ప్రపంచానికి స్థానమైన ఆత్మశక్తియందు ప్రవేశించి శుక్ల బిందువు రూపం పొందాడు. అదే విధంగా విమర్శశక్తి శుక్ల బిందువులో ప్రవేశించి రక్త బిందుభావము పొందుతున్నది. ఆమిశ్రమ బిందువు వలన నాదము పుడుతోంది. నాదమునుంచి కళలు పుడుతున్నాయి. ఆ కళలే, కళాతత్త్వ భువనాత్మకాలు. అవే అక్షరాలు, వివిధంగా పదజాలమై మంత్రాలయినాయి. అందుకనే ముకుళీభూతమైన అంకురము కలది అని చెప్పబడింది. ఈబిందుద్వయము అహమన్న రెండు అక్షరాలకు శరీరంగా ఉన్నాయి.

# కామ కలాంగనా స్వరూపము

7. బిందు రహంకారాత్మా రవి రేతన్మిథునసమరసాకారః
కామః కమనీయతయా కలా చ దహనేందు విగ్రహౌభాతి

మిశ్రమబిందువు అహం అనబడే వర్ణ ద్వయముకలది. అకార హకారములు అనబడే ప్రకాశ విమర్శాంశలయిన, శివశక్తి రూపమయిన రక్త శుక్ల బిందువులయొక్క అన్యోన్య మేళన స్వరూపము సూర్యబింబము. ఇది మనోహరమైనందున, మహాయోగులచే కోరబడునది, చంద్రాగ్నులే శరీరములుగా కలది, ప్రకాశాత్మకమైన విమర్శశక్తి స్వరూపము అగుచున్నది.

ఇంతవరకు చెప్పిన ప్రకాశ, విమర్శ, మిశ్రమ రూపబిందువులను ఇక్కడ కామకళా స్వరూపమైన మహా త్రిపురసుందరీ స్వరూపముగా చెప్పబడుతున్నది. ప్రకాశ విమర్శాంశలయిన కామేశ్వరీ కామేశ్వరులు అహమనే అక్షరముల సంయోగరూపమైనటువంటి మిశ్రమ బిందువైన రవి మండలముగా ఉన్నారు. రక్త బిందువు అగ్ని, శుక్ల బిందువు చంద్రుడు. ఈ రెండింటి రూపమయిన సూర్య బింబము మిశ్రమబిందువు. యోని చక్రము మధ్యలో ఉన్నది సంవిద్బిందువు. యోని చక్రానికి మూడు వైపులా మూడు బిందువులున్నాయి. సంవిద్బిందువే పరాశక్తి. ఈ నాలుగు బిందువులు దేవి అవయవాలు. మాతృకావివేచనలో చెప్పినట్లుగా

మిహిరబిందుముఖీం తదధోల సచ్ఛశిహుతాశన బిందుయుగస్తనీం
సహపరార్ధ కలారశనాస్పదాం భజత సత్య మిమాం పరదేవతాం॥

మిశ్రమబిందువైన రవిబింబము ముఖంగాను, చంద్రాగ్నులు అనబడే శుక్ల రక్త బిందువులు స్తనయుగ్మంగాను గల వరదేవతను పుణ్యాత్ములు భజింతురుగాక. కల్పసూత్రములందు కూడా ఇదే విషయం చెప్పబడింది.

అగ్రబిందుపరికల్పితాననా మన్యబిందురచితస్తనద్వయాం
నాదబిందురశనాగుణాస్పదాం నౌమి తే పరశివాం పరాం కళాం॥

నిత్యసుఖము కావాలంటే స్వరూప విచారణ చెయ్యాలి. తన నిజస్వరూపము తాను తెలుసుకోవటాన్నే స్వరూప విచారణంటారు. స్వరూపము అనేది ప్రతిమనిషిలో నేను, నాది, అని అంతర్గతంగా దాగి ఉండే వస్తువు.

కర్మకాండవల్ల పరోక్షమైన జ్ఞానము, స్వర్గము, నరకము మొదలగు విషయాలు తెలుస్తాయి. దీనివల్ల సూక్ష్మ శరీరాభిమాని అయిన జీవుని యందు ఈ అహమనేది ఉన్నట్లు తెలుస్తోంది. బ్రహ్మ కాండవల్ల పరమాత్మ బ్రహ్మ వస్తువుగా ఉన్నాడనీ, సాక్షి చిత్ప్రకాశరూపంగా ఉన్నట్లు, అది సత్య వస్తువైనందున అహమనేది ఈ సాక్షియందు ఉంటుందని చెప్తుతోంది.

తురీయాపాదంలో సృష్టికి మొదట ఉన్నస్థితిని వివరిస్తున్నారు. ఆకాలంలో నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు అయిన పరమాత్మను గురించి చెప్పటానికి

1. ప్రకాశబిందువు     3. మిశ్రమ బిందువు

2. విమర్శ బిందువు     4. సంవిద్బిందువు

అనబడే నాలుగింటినీ గుర్తుగా చెప్పారు. ఆపరమాత్మకు ఇచ్ఛాశక్తి, స్ఫురణశక్తి కలిగినందున, అతని అంతర్గతశక్తి అద్దంవలె పురోభాగాన ఆవిర్భవించింది. అప్పుడు ఆత్మ, శక్తి, ప్రతిబింబము అనేమూడు వస్తువులు సిద్ధమైనాయి. వీటిలో

ఆత్మ - సత్యము. ప్రతిబింబమమూ దానికి ఆధారమైన దర్పణదృశ్యశక్తీ రెండూ మిధ్యలు. అందుచేత ఈ మూడు బిందువుల సమిష్టియే సత్యాసత్య మేళనవస్తువు. ఇదే సృష్టికి ఆరంభ వస్తువు. సృష్టిలో బ్రహ్మవస్తువు సత్యాసత్యమేళనముగా ఉన్నది.

ప్రకాశ బిందువువల్ల విమర్శ బిందువు వస్తుంది. రెండూ బింబ ప్రతిబింబాలు. కాబట్టి ఆరెండింటిలోను కార్య కారణాలకు బేధము లేదు. ఈ రెండు బిందువులే శివశక్తులు కాబట్టి వీరికి కూడా బేధములేదు. పరమాత్మకు లింగ బేధము లేదు. పరమాత్మ సకల తత్త్వాలను, సర్వవర్ణాలను తన ఉదరంలో (గర్భలో) దాచుకున్నాడు. ఈ రకంగా గర్భం ధరించటమనేది స్త్రీల వ్యక్తిత్వం. అందుకనే పరమాత్మకు స్త్రీరూపం చెప్పబడింది.

'అహం' అనేదే ఆత్మ మంత్రము. ఇది ఆగమ రహస్యం. ఆత్మమంత్రము, హంస మంత్రము రెండూ సమానమైన ధర్మాలు, సమానమైన అర్థము కలిగి ఉన్నాయి. హంసమంత్రమనేది శివశక్తుల సామరస్యమును తెలుపుతున్నది. మాతృకా వివేచనములో చెప్పినట్లుగా

శ్లో॥ శాంతాంతం శక్తి రస్యోక్తా తదంతం బీజ ముచ్యతే
విద్యాశక్తి ర్భవే ద్బీజం శివ ఏవ న చాన్యథా॥
తేనాయం పరమో మంత్ర శ్శివశక్త్యాత్మక స్మృతః

శ ష స హ అనేవర్ణులోని సకారము శక్తి స్వరూపము. హకారము శివస్వరూపముఅందుచేత హంస మంత్రము శివశక్తుల స్వరూపముగా ఉన్నది.ఇదే అర్థము ఈ క్రింది శ్లోకంలో కూడా చెప్పబడుతోంది.

**త్రికోణ రూపిణీశక్తి ర్బిందురూప శ్శివస్మృతః**

ఈరకంగా 'అహం' అనే ఆత్మ మంత్రము, కామకళా స్వరూపంలో ఉన్న మూడు బిందువులు, 'కామకళకు అవయవాలుగా ఉన్నాయి. ఈరకంగా కామకళ శివశక్తి సంపుటంగాను, సకలతత్త్వాత్మకంగాను, సకల వర్ణాత్మకంగాను, సకల శబ్దాలకు జన్మస్థానంగాను, సర్వకారణంగాను ఉన్నది. కళ అనే శబ్దము చంద్రకళలోను, అ నుండి హ వరకు ఉన్న అక్షరాలలోను ఉన్నది. చంద్రకలలన్నీ తత్త్వమయములు. యాభై అక్షరాలు శబ్దమయాలు. ఇవి కామకళ, నామరూపాలకు కారణంగా ఉన్నాయి. అకళనిత్యము, సత్యము. అందుచేతనే దానిని ధృవకళ అని కూడా అంటారు.

ఆజ్ఞా చక్రంనుంచి బ్రహ్మరంధ్రం వరకు తురీయాకూటమి అంటారు. ఇది చంద్రలోకము. ఇక్కడ చంద్రుడు నిత్యకళాయుక్తుడు. ఇతనికి వృద్ధిక్షయాలుండవు. అజ్ఞాచక్రం వరకే సూర్య చంద్రులగతులు (పగలు, రాత్రి) ఉంటాయి. ఆ తరువాతది జ్యోత్స్నాలోకము. అదే చంద్రలోకము. ఇదే సాక్షిస్థానము. ఇది ఆగము రహస్యము. శివశక్త్యాత్మకమైన ఈ కళ ఆత్మరూపమైనది. ఆత్మ కాములైనవారు ఈ కళను కోరుతుంటారు కాబట్టి కామకళ అనబడుతోంది.

తురీయకూటమిలో నామరూపాలు లేవు. మరి ఆత్మకు పేరు ఏవిధంగా వచ్చింది? అన్నప్పుడు గుణబేధాలను బట్టి ఆత్మ ఎనిమిది రకాలుగా విభజించబడింది.

శ్లో॥ గుణబేధా దాత్మమూర్తి రష్టథా పరికీర్తితః॥
జీవాత్మా చాంతరాత్మా చ పరమాత్మా చ నిర్మలః॥
శబ్దాత్మా జ్ఞానరూపాత్మా మహాత్మా సప్తమస్స్మృతః॥
అష్టమస్తేషు భూతాత్మే త్యష్టాత్మానః ప్రకీర్తితా

ఆత్మ అనేది ఎనిమిది రకాలుగా ఉన్నది. అవి

1. జీవాత్మా
2. అంతరాత్మా
3. పరమాత్మా
4. శబ్దాత్మా
5. జ్ఞానాత్మా
6. రూపాత్మా
7. మహాత్మా
8. భూతాత్మా

వీటిలో 'మహాత్మ'కు ఋతము, ఆత్మ, బ్రహ్మ, సత్యము అని పేరు.పరమాత్మకు ఋతము, సత్యము, బ్రహ్మ, ఈశ్వరుడు, సాక్షి, కూటస్థుడు, ఆత్మ, చైతన్యము, చిదాభాసుడు, జీవుడు, మాయ అని కూడా పేర్లు.

ఈరకంగా బ్రహ్మాది శబ్దాలకు అర్థము, వివరణ తెలుసుకొని కామకళాస్వరూపాన్ని తన సహస్రారంలో ప్రకాశించే సాక్షి అని భావించి, అదేతన నిజమైన రూపము అని తెలుసుకున్నవారే జీవన్ముక్తులు, స్వరూపవేత్తలు అని చెప్పబడింది.

---

## కామకళా జ్ఞాన ఫలము

8. ఇతి కామకలా విద్యా దేవీచక్ర క్రమాత్మికాసేయం
విదితా యేన స ముక్తో భవతి మహాత్రిపురసుందరీ రూపః

గాయత్రి, పంచదశి, షోడశి,కామకళా, మొదలైన మంత్రాలు, ఆమంత్రాలకు అధిదేవత అయిన త్రిపురసుందరీదేవి, శ్రీచక్రము, గురుమండలము, ఆత్మయందుగల సాదాఖ్యకళా మొదలైనవి ఎవరిచేత తెలుసుకోబడుతున్నాయో, వారు ఆ పరమేశ్వరి సాయుజ్యం పొందుతారు.

ఇంతవరకూ ప్రకాశ విమర్శ మిశ్రమబిందు నిరూపణ చేసి అవే బింబప్రతిబింబాలనీ, అవే అహం అనే వర్ణాలనీ, సాక్షిరూపమైన ఆత్మ అని సృష్టిలో బ్రహ్మాండ పిండాండాలు, శ్రీచక్రముల ఉత్పత్తికి అవే కారణమనీ, కార్యకారణాలకు బేధంలేదనీ ఈ విషయం తెలిసినవారు సాయుజ్యం పొందుతారని చ్పెటం జరిగింది. పరబ్రహ్మరూపాన్ని తెలుసుకున్నవాడు తానుకూడా బ్రహ్మస్వరూపం పొందుతాడు. స్వరూపజ్ఞానం కలిగినవాడు ఈ శరీరము, జీవమే తాను, అనే భావం వదిలి జీవన్ముక్తుడౌతాడు.

ప్రతిమానవుడు శరీరంమీద నేను, నాది అనే భావం కలిగి ఉంటాడు. ఎవరైతే ఈ శరీరము మిథ్య అని తలచి, సాక్షిరూపాన్నే తన స్వరూపంగా తెలుసుకుంటాడో, అతడు ముక్తి పొందుతాడు. మానవునకు జననము, మరణము అనే ధర్మాలున్నాయి. ఈ జననమరణాలు లేకుండా ఉండాలంటే తానుచేసే కర్మలు, దానాహోమాలు, ధనధాన్యాలు భోగభాగ్యాలు ఏవీ ఉపయోగించవు. కేవలము త్యాగమే ఉపయోగిస్తుంది. శరీరము, బ్రహ్మాండములందు సత్యత్వ బుద్ధిని విడిచిపెట్టటమే త్యాగము. ఈరకంగా త్యాగం చేసినప్పుడు అంతా మిథ్య అనే భావం కలిగి సాక్షియే తాననే జ్ఞానం కలుగుతుంది. సాక్షికి చావు పుట్టుకలు లేవు. కాబట్టి అవి జ్ఞానికీ

ఉండవు. అవిద్యా త్యాగమే ఇక్కడ త్యాగమని చెప్పబడింది.

పంచరూపపరిత్యాగా దస్వరూప ప్రహాణత:
అధిష్ఠానం పరం తత్త్వ మేకం స చ్ఛిష్యతే మహత్॥

పృధి వ్యాప్తేజ్వ వాయు రాకాశాలనే పంచభూతాలు, వాటివల్ల కలిగిన శరీరమూ అంతామిధ్య. కాబట్టి వాటిని వదలివేసి, వాటిలో గల సచ్చిదానంద స్వరూపమే గ్రహించాలి. సత్యమూ, నిత్యమూ కాని, అత్మ వస్తువు కాని ఈదేహము, జీవము లందు తాను, తనది అనే భ్రమ పెంచుకోకూడదు. ఈరకంగా చేసిన వారికి సర్వము పరబ్రహ్మస్వరూపంగా కనిపిస్తుంది. ఆసాధకుడు కూడా బ్రహ్మస్వరూపుడౌతాడు.

---

# 2. అవిద్యా పాదము

## పంచభూతోత్పత్తి

9. స్ఫుటితాదరుణాద్బిందోర్నాద బ్రహ్మాంకురో రవో వ్యక్త:
తస్మా ద్గగనసమీరణదహనోదకభూమివర్ణసంభూతి:

వికసనము పొందిన రక్త బిందువువలన నాదబ్రహ్మమే అంకురముగా గల శబ్ద బ్రహ్మము ఆవిర్భవించింది. ఆ నాదమువలన ఆకాశము, వాయువు అగ్ని, జలము, భూమి అనబడే పంచభూతాలతో కూడిన ప్రకృతి, అకారాది హకారాంతము గల యాభై అక్షరాలు ఉత్పన్నమైనాయి. ఈ శ్లోకంలో పంచభూతాలు, పంచాశద్వర్ణముల ఆవిర్భావాన్ని గురించి వివరించటం జరిగింది.

| | | |
|---|---|---|
| రక్త బిందువు వలన | - | నాదము |
| నాదము నుంచి | - | శబ్దము |
| శబ్దమునుండి | - | ఆకాశము |
| ఆకాశమునుండి | - | వాయువు |
| వాయువు నుండి | - | అగ్ని |
| అగ్ని నుండి | - | జలము |
| జలము నుండి | - | భూమి |

ఈరకంగా పంచభూతాలతో కూడిన ప్రకృతి, అ నుండి క్ష వరకు గల యాభై అక్షరాలు ఆవిర్భవించినాయి.

**10. అథ విశదాదపి బిందోర్గగనానిలవహ్నీ వారిభూమిజనిః**
**ఏతత్పంచక వికృతిర్జగదిద మణ్వాద్యజాండ పర్యంతమ్॥**

శబ్దము ఉత్పన్నమైన తరువాత, శుక్లబిందు వికసనము వలన ఆకాశము మొదలైన పంచభూతాలు ఉత్పన్నమైనాయి. అణువు మొదలు బ్రహ్మాండం వరకు కలజగత్తు పంచభూతాత్మకమైనదిగా కలిగింది.

ఈ శ్లోకంలో నాదబిందు వికసనము వలన నామ రూపాత్మక జగదుత్పత్తి, శ్రీచక్రము గురించి చెప్పబడుతోంది. తొమ్మిదవ సూత్రంలో శబ్దముయొక్క ఉత్పత్తి, పదవ సూత్రంలో పంచభూతాత్మకమైన కళాతత్త్వ భువనాత్మకరూపశాఖా వివరించబడుతోంది.

శిశువు జన్మించేటప్పుడు రక్తబిందువులు ఎక్కువగా ఉంటే ఆడశివువు, శుక్లబిందువులు ఎక్కువగా ఉంటే మగశిశువు కలుగుతారు. అలాగే రక్త, శుక్ల బిందు భాగముల హెచ్చు తగ్గుల వలన బిందు, నాద, కళలు గల నామాత్మక శాఖా, కలాతత్త్వ భువనాత్మకమైన రూపాత్మక శాఖ ఉత్పన్నమౌతున్నాయి.

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థంపాహురవ్యయం

అశ్వద్ధవృక్షము మొదలుపైకి, దాని కొమ్మలు క్రిందకు ఉంటాయి. ఇది పరబ్రహ్మస్వరూపము. దీనిలో సకలలోకాలు ఇమిడి ఉన్నాయి. దీనితోసంబంధించని వస్తువేదీ లేదు. ఇది నామరూత్మకమైన ప్రపంచసృష్టి క్రమాన్ని బోధిస్తున్నది.

ఈ జగత్తు నామరూపాత్మకమయినది. కాబట్టి ఈవృక్షానికి రెండు కొమ్మలు ఉన్నాయి. ఈ వృక్షానికి మూలము ప్రత్యగాత్మ. అదే పరమాత్మ సహస్రారమందుంటాడు. ఇది సృష్టికి మొదటి స్థానము. దీనినుండి శుక్ల, రక్త, మిశ్రమ బిందువులతో కలసిన త్రికోణము ఏర్పడుతోంది. ఇది అవ్యక్తము, మూలప్రకృతి అని చెప్పబడుతోంది. మానవ శకీరంలో ఇది ఆజ్ఞాచక్రము. ఈ బిందువులవలన నామ,రూపాలనబడే రెండు శాఖలు ఉత్పన్నమైనాయి. త్రికోణము నుంచి నామశాఖ ఏర్పడింది. దానివలన అకారాది స్వరాలు, వాటినుండి హల్లులు, తరువాత పదములు, మంత్రములు, వేదములు ఉత్పన్నమైనాయి. అలాగే త్రికోణం నుంచి రెండవది అయిన రూపాత్మక శాఖ ఏర్పడింది. పరబ్రహ్మకు ఈజగత్తును సృష్టి చెయ్యాలనే తలంపు కలిగింది. అప్పుడు ఇచ్ఛా శక్తి ఆవిర్భవించింది. అది అవ్యక్తము, త్రిగుణాత్మకము.

| | | |
|---|---|---|
| బిందువు నుండి శివశక్తుల సామరస్యమువలన | - | మహత్తత్త్వముఉత్పన్నమైంది |
| మహత్తత్వమునుండి | - | అహంకారము |
| అహంకారమునుండి | - | మనస్తత్వము |

| | | |
|---|---|---|
| మనస్తత్వమునుండి | - | అకాశము |
| అకాశమునుండి | - | వాయువు |
| వాయువునుండి | - | అగ్ని |
| అగ్నినుండి | - | జలము |
| జలమునుండి | - | భూమి ఏర్పడినాయి |
| పంచభూతముల ధర్మాలే | - | శబ్ద, స్పర్శ,రూప, రస, ఘ్రాణం |
| పంచభూతముల వల్లనే | - | జ్ఞానేంద్రియాలు,కర్మేంద్రియాల కలిగినాయి. |

మొత్తంమీద ఈ తత్వాలు ఇరవైనాలుగు ఉన్నాయి.

| | | |
|---|---|---|
| జ్ఞానేంద్రియాలు | - | 5 |
| కర్మేంద్రియాలు | - | 5 |
| తన్మాత్రలు | - | 5 |
| పంచభూతాలు | - | 5 |
| (మనోహంకార మహదవ్యక్త తత్వములు) | - | 4 |
| మొత్తం తత్వాలు | | 24 |

బిందువు శివశక్తి సమ్మేళనము. సర్వతత్వాతీతము. ఈ ఇరవైనాలుగు తత్వాలే క్రమంగా వ్యాపించి కళా, తత్వ, భువనాకారములు పొందినాయి. ఇది అశ్వర్థవృక్ష రూపాత్మక శాఖ. ఈబిందువులలో పై బిందువు (అవ్యక్తము) కారణము. చివరి బిందువు (భూమి) కార్యము. పైది బింబము చివరది ప్రతిబింబము. అందుకనే పైబిందువు కన్న చివరి బిందువుకు శక్తి తగ్గుతుంది.

మానవ శరీరమేఅశ్వర్థ వృక్షము. శరీరంలోని షట్చక్రాలకు ఆధారము సహస్రారము.

| | | |
|---|---|---|
| సహస్రారము నుంచి | - | అజ్ఞాచక్రము |
| అజ్ఞాచక్రమునుంచి | - | విశుద్ధి చక్రము |
| విశుధిచక్రమునుంచి | - | అనాహతము |
| అనాహతము నుంచి | - | మణిపూరము |
| మణిపూరము నుంచి | - | స్వాధిష్ఠానము |
| స్వాధిష్ఠానమునుంచి | - | మూలాధారము |

ఉత్పన్నమైనాయి. ఈషట్చక్రాలలోను నామరూపాలయిన రెండు శాఖలున్నా యి. విశుద్ధినుంచి ఆధారచక్రము వరకు ఐదు చక్రాలు ఆకాశము మొదలైన పంచభూతాలకు కారణము. ఈ రకంగా రూపాత్మకశాఖ ఇక్కడ ఉన్నదని చెప్పబడుతోంది. షట్చక్రాలలోని యాభైదళాలలో యాభై అక్షరాలు ఉన్నాయి.

| | | |
|---|---|---|
| విశుద్ధి చక్రము | - | అ నుంచి అః వరకు పదహారు అచ్చులు |
| అనాహతము | - | క నుంచి ఠ వరకు పన్నెండు అక్షరాలు |
| మణిపూరము | - | డ నుంచి ఫ వరకు పది అక్షరాలు |
| స్వాధిష్ఠానము | - | బ నుంచి ల వరకు ఆరు అక్షరాలు |
| మూలాధారము | - | వ శ స ష నాలుగు అక్షరాలు |
| అజ్ఞాచక్రము | - | హ, క్ష రెండు అక్షరాలు |

ఈరకంగా ఆధారచక్రం నుంచి అజ్ఞాచక్రం వరకు యాభై దళాలలోను యాభై అక్షరాలు ఉన్నాయి. ఇక్కడ ఈ అక్షరాలు శక్తుల రూపంలో ఉన్నాయి. ఈ రకంగా నామాత్మకశాఖ ఇక్కడ ఉన్నది. సహస్రారంనుంచి ఆధారచక్రందాకా వ్యాపించి ఉండే నాడిని సుషుమ్నానాడి అంటారు. దీనినే బ్రహ్మనాడి అని కూడా అంటారు. ఆనాడియందే షట్కమలాలు ప్రకాశిస్తున్నాయి. ఈనాడికి రెండు వైపులా ఇడా, పింగళా నాడులున్నాయి. ఈరకంగా ఈవృక్షంలో సత్వరజస్తమోగుణాలనబడే గుణత్రయము, చంద్రసూర్యాగ్నులనబడే మండలత్రయము, బ్రహ్మాండము, పిండాండము, శ్రీచక్రము, శ్రీవిద్యా, మాతృకలు, సకల నిగమాగమములు కలిసి ఉన్నాయి.

పూర్వకాలంలో పైలవుడు అనే మహర్షి పన్నెండు సంవత్సరాలు యాజ్ఞవల్క్యుని శుశ్రూష చేసి పరమరహస్యమైన కైవల్యాన్ని ఉపదేశించమని అడిగాడు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు ఈ విధంగా చెప్పాడు.

సృష్టికి పూర్వము ఏ వస్తువుకూ సంబంధము లేనిది, ఆకారమనిదో , సత్యము, ప్రకాశమనంత దము స్వరూపములుగా గల ఒకే వస్తువు ఉండేది. అదే పరబ్రహ్మ ఆత్మ అని పిలువబడింది. ఆరకంగా ప్రథమ బిందువైన పరమాత్మ రెండవ బిందువైన శక్తి రూపాన్ని ధరించి పరమేశ్వరుని దగ్గర అద్దంలాగా ఉన్నది. ఆ అద్దంలో కనిపించిత్మ ప్రతిబింబమే సాక్షి అనబడుతోంది.

ప్రకృతి రూపాంతరం చెంది అవ్యక్తమనే ఆవరణశక్తి అయింది. దీనిలో ప్రతిబింబం ప్రతిబింబము ఈశ్వరచైతన్యము. ఈ ప్రతిబింబోపాధియే మాయ. మాయేదిఃఃఈశ్వరుడిని స్వాధీనమున ఉంటుంది. ఇతడే సృష్టిస్థితి లయాలకు కర్త. సృష్టిస్థితి లయాలు, ఇతడి స్వాధీనంలోనే ఉంటాయి.

**1.మహత్తత్వ రహస్యము:-** ఈశ్వర ప్రతిబింబకారణ శక్తి రజోద్రిక్తమయి, మహదాఖ్యగల విక్షేపశక్తి ఆవిర్భవించింది. దాని యందుగల ప్రతిబింబము హిరణ్యగర్భుడు. ఇతడు దృశ్యాదృశ్యమయిన రూపముకలిగి మహత్తత్వాభిమానిగా ఉన్నాడు.

**2. అహంకార స్వరూపము:-** హిరణ్యగర్భునితో కూడిన విక్షేపశక్తి తమోగుణ సహితమై అహంకారమ స్పంద శక్తిగా ఆవిర్భవించింది. అ ందల ప్రతిబింబము సర్వ జగత్పాలకుడయిన విష్ణువను ప్రధాన పురుషుడయినాడు.

**3. భూతపంచికీకరణ:-** అ విష్ణువే ప్రధాన పురుషుడైన అత్మ. దాని వలన ఆకాశము మొదలైన పంచభూతాలు ఒకదాని వలన ఒకటి అవిర్భవించినాయి. సృష్టికి కారణమైన అతడు పంచభూతాలలో ఒక్కొక్క దానిని రెండు భాగాలు చేసి, లొటిక భాగాన్ని మళ్ళీ నాలుగు భాగాలుగా చేశాఇప్పుడు మొదటి భాగంలో ఆ భూతముయొక్క అంశఉంచి మిగిలిన నాలుగు భాగాలలోను మిగిలిన నాలుగు భూతాలను ప్రవేశపెట్టాడు. అంటే ఉదాహరణకు భూమిని రెండు భాగాలు చేశాడు అనుకుందాం. అందులోని ఒకభాగంలో భూ తత్వాన్ని ఉంచి, రెండవభాగ మళ్ళీ నాలుగు భాగాలుగా చేసి వాటిలో మిగిలిన నాలుగు భూతాలు అంటే నీరు, నిప్పు, గాలి, ఆకాశములయొక్క తత్వాలను ప్రవేశపెట్టాడు. ఈరకంగా ప్రతి భూతంలోను సగం స్వాంశము, మిగిలిన నాలుగు భాగాలు నాలుగు భూతాల అంశలు ఉంటాయి. ఈరకంగా పంచీకృత భూతములచేత అనంతకోటి బ్రహ్మాండము, చతుర్దశ భువనాలు, స్థూలశరీరము సృష్టించబడినాయి.

**4. పంచకోశములు :-**

మానవ శరీరంలో పంచకోశములు అని చెప్పబడే ఐదు పదార్థాలున్నాయి. అవి

1. అన్నమయ
2. ప్రాణమయ
3. మనోమయ
4. విజ్ఞానమయ
5. ఆనందమయ కోశములు

ఈ ఐదింటి మధ్యన ఆనందమయకోశముతో అపరమేశ్వరి చేరి ఉంటుంది.

**5. తత్త్వములు:-**

సకల జీవరాసులకు వారివారి పాపపుణ్యాలననుసరించి ఫలమును ఇచ్చేటటువంటి ఈశ్వరశక్తినే తత్త్వము అంటారు. ఈ తత్త్వములను అనేక మంది అనేక విధాలుగా వివరించారు. ఆగమవేత్తలు తత్త్వములు మూడు రకాలు అన్నారు. అవి

1. ఆత్మ తత్త్వము
2. విద్యా తత్త్వము
3. శివ తత్త్వము

ఇంకా కొంతమంది తత్త్వాలు ఇరవైనాలుగు అని, ముప్పైఅని , యాభైఒకటి అని, రకరకాలుగా చెప్పారు. ఏది ఏమైనా చివరకు ఇరవైనాలుగు తత్త్వాలనే నిర్ణయించటం జరిగింది. వీటి వివరణకు 48వ సూత్రము 162పేజీ చూడండి.

**6.పంచక్లేశములు:-** మానవుడు పంచవిధక్లేశములనబడే పాశాలతో బంధింపబడి ఉంటాడు. అవి

అవిద్యా అస్మితా రాగం ద్వేషశ్చ ద్విపదాంవర
వదంత్యభినివేశశ్చ క్లేశాన్పంచత్వమాగతాన్॥

1. అవిద్య
2. అస్మిత
3. రాగము
4. ద్వేషము
5. అభినివేశము

అనేవి పంచ క్లేశములు. వీటిలో

| | | |
|---|---|---|
| 1. అవిద్య | - | ఇది తమస్సు |
| 2. అస్మిత | - | ఇది మోహము |
| 3. రాగము | - | ఇది అభిలాష, మహామోహము |
| 4. ద్వేషము | - | క్రోధము |
| 5. అభినివేశము | - | పైనవన్నీ పనికిరావని తెలిసికూడా వాటిని వదలలేక పోవుట. |

పంచావిధక్లేశాలు శారీరక సుఖాలయందు ఆసక్తి కలవాళ్ళనే పట్టి బాధిస్తాయి. అంతే కాని తత్త్వవేత్తలు, యోగులు మొదలయిన వారి జోలికి రావు.

**7. మలత్రయము:-** వీటిని మూడు రకాలుగా చెబుతున్నారు.

1. అణవ మలము
2. మాయిక మలము
3. కార్మిక మలము

**1. అణవమలము :-** చైతన్యరూపమైన ఆత్మలో అనాత్మభావన, అనాత్మలైన దేహాలలో ఆత్మభావన. ఈ రెండూ కలసి అణవమలము అని చెప్పబడింది.

**2. మాయికమలము :-** ఒకే రూపంలో ఉన్న ఆత్మను అనేక రూపాలుగా భావించటము. తత్త్వములన్నీ మాయచే కల్పించబడినాయి. కాబట్టి ఇది మాయికమలము.

**3. కార్మికమలము:-** విహితనిషిద్ధ క్రియవలన కలిగి శరీరోత్పత్తికి హేతువయిన పుణ్యపాప రూపమైన రెండు రకాల కర్మలను కార్మికమలము అంటారు.

ఈ మలములను పరిశోధన చెయ్యటానికి ఆగమ శాస్త్రప్రకారం సాధకుడు

1. అణవమల శోధనార్థం - స్థూల దేహపరిశోధన
2. మాయిక మల శోధనార్థం - సూక్ష్మదేహపరిశోధన
3. కార్మిక మల శోధనార్థం - కారణ దేహపరిశోధన చేయవలసి ఉంటుంది.

ఈ రకంగా సృష్టి క్రమమును వివరిస్తూ అవిద్యాపాదము పూర్తిచేయబడింది.

---

# 3. విద్యాపాదము

## మంత్ర సంకేతము

11. బిందు ద్వితయం యద్వద్భేదవిహీనం పరస్పరం తద్వత్
విద్యాదేవతయోరపి నభేదలేశోస్తి వేద్యవేదకయోః

ఏవిధంగా అయితే రక్త శుక్లరూపమయిన రెండు బిందువులు బేధం లేకుండా ఉన్నాయో, అలాగే మంత్ర దేవతకు, దేవతోపాసకులకు కూడా బేధం లేదు.

ఇంతవరకు ఈ సృష్టి అంతా ప్రకాశ విమర్శాంశలు, శుక్ల, రక్త బిందు స్వరూపాలూ అయిన శివశక్తులనబడే పరబ్రహ్మచేతనే చేయబడింది అని, అందుచేత ఆబిందువుల మధ్యకూడా బేధం లేదు అనీ చెప్పటం జరిగింది. అదే విధంగా మంత్రదేవతలకు, సాధకులకు బేధములేదని చెప్పబడుతోంది.

దేవత - త్రిపురసుందరీ మంత్రము - పంచదశీమహామంత్రము. ఈ రెంటికీ బేధము లేదు.

శ్లో॥ సర్వేవర్ణాత్మకా మంత్రాస్తే చ శక్త్యాత్మకాః ప్రియే
శక్తిస్తు మాతృకా జ్ఞేయా మాతృకాతు శివాత్మికేఇతి॥

అకారాది హకారాంతము అక్షరములు యాభై. అహమనేది ఆత్మ స్వరూపము కాబట్టి రెండు అక్షరముల మధ్యన ఉన్నటువంటి మొత్తం అక్షరాల వలన సకలవిద్యలు, [illegible]ేదములు ఉత్పన్నమైనాయి. ఈఅక్షర సముదాయము శక్తిస్వరూపము. కాబట్టి [illegible] ‌దేవతలకు బేధము లేదు. సాధకుడు విద్య, అవిద్య అనబడే రెండు విషయాలను తెలుసుకు[illegible]లన అమృతత్వం పొందుతాడు. అవిద్య అంటే అజ్ఞానము. విద్య అంటే జ్ఞానవ[illegible]ర్మలు గనక చేసినట్లైతే అవిద్యా పాశబద్ధుడౌతాడు. ఇతడు మృత్యువు వాతపడతా[illegible]కర్మ చేసినవాడు మృత్యువును జయిస్తాడు. అంటే కామ్యకర్మలు చేసినట్లైతే, [illegible] తీరి సాధకుడు మళ్ళీ మళ్ళీ ఈలోకంలో పుట్టటం, మరణించటం జరుగుత[illegible] జ్ఞానికి మోక్షప్రాప్తి కలుగుతుంది. కాబట్టి అతడికి మృత్యువు ఉండదు. విద్య అనేది [illegible] కాగా అవిద్య అనేది భ్రాంతి రూపజ్ఞానము. బ్రహ్మాండ పురాణంలో జ్ఞానరూపమయిన శ్రీవిద్యను గురించి ఈవిధంగా చెప్పబడింది.

శ్లో॥ నశిల్పాదిజ్ఞానయుక్తే విద్వచ్ఛబ్దాభియుజ్యతే।
మోక్షహే ర్విద్యావాన్ యస్సవిద్యానితీర్యతే॥
మోక్షైకహేతు ర్విద్యాతు శ్రీవిద్యా నాత్ర సంశయః॥
విహీ నః పశురితి సర్వేజీవాః పశవ ఏవ॥

శిల్పా దిజ్ఞానము కలవాడు పండితుడుకాదు. మోక్షవిద్య కలవాడు మాత్రమే విద్వాంసుడు. శ్రీవిద్యయే మోక్షవిద్య. విద్యావిహీనుడు పశువు. జీవులందరూ పశువులే.

విష్ణుపురాణంలో ఈవిధంగా ఉంది.

శ్లో॥ యజ్ఞవిద్యా మహావిద్యా గుహ్యావిద్యా చ శోభనే
అత్మవిద్యా చ దేవి త్వం విముక్తి ఫలదాయినీ॥

యజ్ఞవిద్య, మహావిద్య, గుహ్యావిద్య, ఆత్మవిద్య అన్నీ ఆదేవియే. అమెయే మోక్షఫలదాయిని.

శ్రుతులు, స్మృతులలో చెప్పిదాని ప్రకారము ప్రకాశాంతర్గత విమర్శ శక్తియే సంవిద్రూప విద్యాపదవాచ్యము. సకల జగత్కార్య నిర్మాణ శక్తి అయిన మూల ప్రకృతి అవిద్య. విద్య అనేది ఆత్మస్వరూపము. దేహము, ఇంద్రియాలు, జగత్తు అన్నీ అవిద్యా స్వరూపములే. ఎవరైతే మంచి గురువునాశ్రయించి ఈ తత్వాన్ని ఉపదేశింపబడతారో, అతడు అవిద్యనుంచి విముక్తుడై బ్రహ్మజ్ఞాని అవుతాడు. ఈరకంగా తత్వోపదేశం పొందలేనివాడు అవిద్యనుంచి విముక్తి పొందలేడు. అంటే అజ్ఞానమునుంచి బయట పడలేడు.

జన్మలన్నింటిలోకి మానవ జన్మ, ఉత్తమమని, అందులోను బ్రాహ్మణజన్మ ఉత్తమోత్తమమనీ చెప్పబడింది. కాబట్టి దుర్లభమైన బ్రాహ్మణ జన్మకలిగినపుడే ఈజ్ఞానము సంపాదించాలి. కాబట్టి ఎవరైతే ఈజ్ఞానము గురువు వలన పొందగలుగుతారో వారుబ్రహ్మవేత్తలయి పరమ సుఖంపొందుతారు. లేనివారు జనన మరణాలతో కూడిన సంసార లంపటంలో పడి ఐహికసుఖాలతో కొట్టుమిట్టాడుతుంటారు

జననమరణాలతో కూడిన ఈ దేహము, చరాచరజగత్తు అంతా మాయ. ఇవేవీ శాశ్వతం కాదు. పరబ్రహ్మస్వరూపమే సత్యము, నిత్యము. ఈవిషయము వృద్ధుల వద్ద నేర్చుకొని, సకల జీవులందు పరమాత్మ స్వరూపాన్ని దర్శించగలిగేవాడు జీవన్ముక్తుడౌతాడు.

దుష్కర్మలచేత కష్టాలు అనుభవిస్తున్న వాళ్ళని చూచి, పవిత్రత కలిగి ఉంచెంది, విరాగియై కర్మ చేసినంతమాత్రంచేత సాయుజ్యం రాదు. కేవలం జ్ఞానంచేతనే వస్తుంది అనేవిషయం తెలుసుకున్న బ్రాహ్మణుడు సద్గురువును వెతుక్కుంటూ వెడతాడు. అప్పుడు కనిపించిన గురువును చూసి, సాక్షాత్తు అపరమేశ్వరుడే తనను తరింపచేయటానికి వచ్చాడని భావించాలి.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః

అజ్ఞానమనే అంధకారాన్ని పారద్రోలి, జ్ఞానజ్యోతిని వెలిగించేవాడు గురువు. సాధకునకు మంత్రోపదేశంచేసి, దీక్షఇచ్చి, సాధనావిధానముచెప్పి, ముక్తి మార్గం చూపే వాడు గురువు.

ఏ మహాత్ముడు నీకు బాగా గుర్తు ఉంటాడో, ఏ మహానుభావుని రూపం నీ మనస్సులో సదానిలిచి పోతుందో, ఏ సన్యాసి నీకు స్వప్నంలో కూడా కనుపించి సన్మార్గాన్ని బోధిస్తుంటాడో, ఏ సాధువు చెప్పిన ధర్మసూత్రాలు నీ మదిలో నిలిచిపోతాయో, ఏ మహనీయుని దగ్గరకు వెళ్ళగానే నీకు అనుమానాలు తీరిపోతాయో, ఏ వ్యక్తి దగ్గర నీకు ప్రశాంతత ఆనందము కలుగుతాయో, ఏ వ్యక్తి మీదనీకు నమ్మకము, గురి కలుగుతాయో ఆమహనీయుడే నీకు గురువు. అలాగే గురువుచెప్పిన భక్తి, జ్ఞాన వైరాగ్యాలు, ధర్మసూత్రాలు గుర్తుంచుకుని మరచిపోకుండా ఉండేవాడే శిష్యుడు. స్థూలంగా చెప్పాలంటే తన శిష్యునకు సన్మార్గాన్ని బోధించి, తరుణోపాయం చూపే వాడు గురువు.

మనకు మొత్తం ఏడు రకాల గురువులున్నారని చెప్పబడింది. వారు :-

1. సూచకగురువుః- చదువు చెప్పే వాడు
2. వాచకగురువు :- కులధర్మాలు, ఆశ్రమధర్మాలు బోధించేవాడు.
3. బోధకగురువు :- మహామంత్రాలనుపదేశం చేసేవాడు,
4. నిషిద్ధగురువు :- వశీకరణ, మారణ, ప్రయోగాలు నేర్పేవాడు.
5. విహితగురువుః- విషయభోగముల మీద విరక్తి కలిగించేవాడు.
6. కారణగురువు :- జీవబ్రహ్మైక్యాన్ని బోధించేవాడు.
7. పరమగురువుః- జీవాత్మ, పరమాత్మ ఒకటే అని ప్రత్యక్షానుభవాన్ని కలిగించేవాడు.

గురువు శిష్యునకుఉపదేశం చేసి దీక్షని ఇస్తాడు. ఈ దీక్ష నాలుగు రకాలు.

1. స్పర్శదీక్ష :- గురువు శిష్యుని తాకినంత మాత్రం చేతనే శిష్యునకు శక్తివస్తుంది.

2. ధ్యానదీక్ష :- గురువు దూరంగా ఉన్నప్పటికీ శిష్యుని ఉద్ధరణ కోసం ధ్యానం చేస్తుంటాడు. దాని వల్లనే శిష్యునకు శక్తి వస్తుంది.

3. దృగ్దీక్ష :- ఇది కంటిచూపుతోనే ఇచ్చే దీక్ష. దీనిలో శిష్యుడు పవిత్రుడు కావాలనే తలంపుతో గురువు తన దృష్టిసారిస్తాడు.

4. మంత్రదీక్ష :- గురువు శిష్యునకు ధర్మసూత్రాలు చెప్పి, మంత్ర దీక్ష ఇచ్చి అతనికి తరణోపాయం చూపుతాడు.

ఈ రకంగా అనేక రకాలయిన గురువులు, వారిచ్చు దీక్షా ప  లు చెప్పబడినాయి. గురువు ఏ జాతివాడైనా, ఏ మతంవాడైనా, ఏ కులంవాడైనా రే అతనిని పూజించాలి. రవించాలి. ఆరాధించాలి. లోకంలో అస్థిరమైనవని, ఐహికసుఖాలని ఎన్ని సంపాదించినా గురుకటాక్షం పొందలేకపోతే, ఇవన్నీ నిష్ప్రయోజనం. ఈ విషయాన్ని శంకర భగవత్పాదులు తమ 'గుర్వష్టకమ్' లో వివరిస్తూ, గురువు అంటే ఆ భగవంతుడే అని చెప్పారు.

శరీరం సురూపం తథా వా కలత్రం యశశ్చారు చిత్రం ధనం  తుల్యమ్ ।
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

కలత్రం ధనం పుత్రపౌత్రాది సర్వం గృహం బాన్ధవాః సర్వ  జాతమ్ ।
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం  తతః కిమ్ ॥

షడఙ్గాది వేదో ముఖే శాస్త్రవిద్యా కవిత్వాది గద్యం సుపద్యం క ।
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

విదేశేషు మాన్యః స్వదే శేషు ధన్యః సదాచార వృత్తేషు మ  చాన్యః ।
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః  తతః కిమ్ ॥

క్షమామణ్డలే భూప భూపాలబృన్దైః సదాసేవితం యస్య పాదార విన్దమ్ ।
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

యశో మే గతం దిక్షు దానప్రతాపా జ్జగద్వస్తు సర్వం కరే  దాత్
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః  తతః కిమ్ ॥

న భోగే న యోగే న వా వాజిరాజౌ న కాన్తాముఖేనైవ విత్తే  చిత్తమ్ ।
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః  తతః కిమ్ ॥

అరణ్యే నవా స్వస్య గేహేన కార్యే నదేహే మనోవర్తతే మే 
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః  తతః కిమ్ ॥

ఈ లోకంలో ధనము, అందమైనభార్య, విద్య, పేరుప్రఖ్యాతులెన్నున్నా, ఇవేవీ గురుకటాక్షం కన్న ఎక్కువకాదు. అని పై శ్లోకాల అర్థం.

**న గురోరధికం తత్త్వం న గురోరధికం తపః ।**
**తత్త్వ జ్ఞానాత్ పరం నాస్తి తస్మై శ్రీగురవేనమః ॥**

గురువు కన్న ఎక్కువైన తత్త్వం లేదు, తపస్సులేదు. జ్ఞానంలేదు.

**అఖండ మండలాకారం వ్యాప్తంయేన చరాచరం ।**
**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవేనమః ॥**
**అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।**
**చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవేనమః ॥**

విశాలమైన ఈ విశ్వమంతా వ్యాపించినవాడు, శిష్యుని అజ్ఞానాన్ని పా 'రద్ర 'ేల, జ్ఞాన జ్యోతిని వెలిగించేవాడు, అయిన గురువు పాదాలకు నమస్కరిస్తున్నాను.

సాధకుని కర్మఫలాన్ని బట్టి గురువు లభించటం జరుగుతుంది. కొంతమందికి ''ళ్ళ )ల తరబడి ఎదురు చూచినా సద్గురువు లభ్యంకాదు. ఆ గురు అన్వేషణలో అడవు వెంబడి తిరుగుతూ, తనువు చాలించినవా రనేక మంది ఉన్నారు. మరికొందరికి చాలా తేలికగా, గురువే శిష్యుణ్ణి వెతుక్కుంటూ వస్తాడు. ఇదంతా సాధకుని పూర్వజన్మ కర్మఫలం మీద ఆధారపడి ఉంటుంది. వివేకానందునకు రామకృష్ణపరమహంసలాగా, మంచి గురువు దొరకటమనేది జన్మ జన్మల ఫలం అని గుర్తించాలి.లోకంలో అనేకరకాలయిన గురువులున్నారు. వారిలో ప్రకాశ విమర్శాంశలు, వర్ణోత్పత్తి, పరోక్ష, అపరోక్ష జ్ఞానము, చెప్పగలిగినవారే పరమేశ్వర స్వరూపులు, మోక్షప్రదులు, యదార్థగురువులు. తాము ఉపదేశించిన మంత్రముయొక్క పుట్టుక, మంత్రవివరములు చెప్పగలిగిన గురువులే ఈశ్వరతుల్యులు.

---

## బీజత్రయోత్పత్తి

**12. వాగర్థౌ నిత్యయుతౌ పరస్పరం శక్తి శివమయా౦ ోతౌ**
**సృష్టిస్థితిలయభేదౌ త్రిధా విభక్తౌ త్రిబీజరూపేణ॥**

రక్త, శుక్ల బిందువులు రెండూ, మూడు రకాలుగా విభజించబడి, వాగ్భవ, కామ౯ాజ శక్తి బీజములచేత,సృష్టిస్థితిలయములనే భేదము లుః కలవై అన్యోన్యమైన మేళనముగల ౦వగ౦ ౦ుచున్నవి.

ప్రకాశ విమర్శాత్మకమైన శుక్లరక్త బిందువులు మూడు విధముల[illegible] రూపవ[illegible]గించబడినాయని ఈ శ్లోకంలో వివరించబడుతోంది. ఈ బిందువులు సృష్టిస్థితిలయ[illegible]యలు గలవి. నిత్యమైనవి. యోనిచక్రంలో మధ్యగలబిందువు ఆత్మ. దానిలో ప్రకాశ విమర్శాంశలనబడే శివశక్తుల సమ్మేళనమున్నది. ఇదే సృష్టికి కారణము. అది గుణత్రయము, బీజత్రయము, (వాగ్భవకామరాజ శక్తిబీజాలు) త్రిమూర్తి ద్వంద్వము, యోని చక్రంల[illegible] కోణబిందువుల వల్లనే మండలత్రయము (చంద్ర సూర్యాగ్ని మండలాలు) . దానినుంచి పంచభూతాలు, తన్మాత్రలు, ఈరకంగా సృష్టి ఏర్పడింది.

యోనిచక్రం అంటే త్రికోణము. దానికి మూడు రేఖలు, మధ్యలో ఒకబిందువు ఉన్నాయి. ఆబిందువునే సంవిద్బిందువు అంటారు. ఇది అవ్యక్తము అంటే స్పష్టంగా చెప్పలేని స్వరూపము కలిగి వుంటుంది. సృష్టి ఆవిర్భావ సమయంలో సంవిద్బిందువుయొక్క కాంతికిరణాలవల్ల యోనిచక్రం ఏర్పడింది. బిందువుల[illegible]మై ఉన్నఅ[illegible]లు, యోనిచక్రంలోని మూడు రేఖలలోను ఒక్కొక్కదానియందు పదహారు చొప్పున, హళ[illegible] మూడు అక్షరాలు మూడు కోణాలలోను ఉంటాయి. ఇక్కడ అవ్యక్తరూపంలో ఉన్న శబ్దము విశుద్ధిచక్రం చేరేసరికి స్పష్టమైన రూపందాల్చుతుంది. దేవీ పురాణంలో చెప్పినట్లుగా

శ్లో॥త్రికోణం మండలం చాస్యాః భూపురం చ త్రిరేఖగమ్
మంత్రో..పి త్ర్యక్షరః ప్రోక్తః తథా రూపత్రయం పునః
త్రివిధా కుండలీశక్తిః త్రిదేవానాం చ సృష్టయే
సర్వత్రాపి త్రయంయస్మా త్తస్మాత్తు త్రిపురా మతేతి
(త్రీ[illegible]ణి పురాణి త్రి బిందురూపాణి యస్యా స్సా త్రిపురా)

త్రికోణంలోని మూడుకోణాలు, చంద్రసూర్యాగ్ని మండలాలు, భూపురంలో మూడు రేఖలు, మంత్రం సరస్వతి స్వరూపము, కుండలినీ శక్తి ఉన్న మూడుగానే ఉన్నది కాబట్టి అమె త్రిపురా అనబడుతున్నది.

విష్ణుపురాణంలో ఈవిధంగా ఉంది.

యోగీశ్వరీ శరీరాణి కరోతి వికరోతి చ
నానాకృతి క్రియా రూపా [illegible]వృత్తి స్వలీలయా
త్రిధా యద్వర్తతే లోకే త[illegible]త్రిగుణోచ్యతే॥

ఈ దేవి సృష్టిస్థితి లయాలకు కారణభూతురాలు. [illegible]ణ స్వరూపిణి. అందుకనే త్రిగుణా అనబడుతున్నది.

దీన్నిగురించి కాళికా పురాణంలో ఈవిధంగా ఉంది.

ప్రధానేచ్ఛా వశాచ్ఛంభోశ్శరీరమభవత్త్రిధా
తత్రోర్ధ్వభాగస్సంజాతః పంచవక్త్ర శ్చతుర్ముఖః
పద్మకేసరగౌరాంగః కామో, బ్రాహ్మో, మహేశ్వరః
తన్మధ్యభాగో నీలాంగః ఏకవక్త్ర శ్చతుర్భుజః॥
శంఖ చక్ర గదా పద్మపాణిః కాయ స్స వైష్ణవః
అభవత్తదధోభాగే పంచవక్త్ర శ్చతుర్భుజః
స్ఫటికాభ్రమయశ్శుక్లః సంకాయ శ్చంద్రశేఖరః

పరమేశ్వరుని శరీరము మూడు భాగాలయింది. ప్రథమ భాగం నుంచి పద్మకేసరములవలె ప్రకాశించేవాడైనచతుర్ముఖుడు, మధ్యభాగమునుంచి నీలవర్ణము కలవాడు, తన నాలుగు చేతులం దు శంఖ చక్రగదాపద్మములు ధరించినవాడు అయిన విష్ణువు, అథోభాగమునుండి స్ఫటిక వర్ణముతో ప్రకాశించు చంద్రశేఖరుడు ఉద్భవించారు.

ప్రకాశ విమర్శాంశలు నామరూపాలుగా ఉన్నాయి. ఇందులో నామము యాభై అక్షరాలతోను, రూపము ఇరవై నాలుగు తత్త్వాలతోను కూడి ఉన్నాయని ముందే వివరించటం జరిగింది. వీటిలో ప్రకాశాంశ రూపమును, విమర్శాంశ నామమును తెల్పుతున్నాయి. కాబట్టి ఈజగత్తు అంతా నామరూపాత్మకము. అదే శివశక్త్యాత్మకము.

---

## విద్యాకూటత్రయము

13.మాతా మానం మేయం బిందుత్రయబీజభిన్నరూపాణి
ధామత్రయ పీఠత్రయ శక్తిత్రయ భేద భావితాన్యపిచ॥

మాతా, మానము, మేయము అనగా జ్ఞాత అయిన పరమేశ్వరుడు, జ్ఞానసాధనమయిన పంచదశీవిద్య, జ్ఞేయభూతమైన మహాత్రిపురసుందరి, రక్తశుక్ల మిశ్రమ బిందువులనబడే వాగ్భవ కామరాజశక్తి బీజములు వేరువేరు రూపములుగలవి అయి మండలత్రయము, (చంద్ర, సూర్య, అగ్ని) పీఠత్రయము (కామగిరి, పూర్ణగిరి, జాలంధర) శక్తిత్రయము (ఇచ్ఛా జ్ఞాన క్రియా) అవుతున్నాయి.

ప్రకాశబిందువే పరమాత్మ అనీ, దానిలోనే విమర్శాంశ అంతర్గతంగా ఉన్నదనీ, దానినుంచే బిందుత్రయము, కామకళాంగనావయవములు వచ్చినాయని గతంలోనే వివరించ జరిగింది. ప్రపంచముయొక్క ఉత్పత్తిని గనక తెలునుకున్నట్లైతే, ఈజగత్తు అంతా మాయామయర్థసని తెలుస్తుంది.

రక్త శుక్ల మిశ్రమ బిందువులే పంచదశీమహామంత్రంలో భాగంగా బీజత్రయము, గుణత్రయము, మండలత్రయము, పీఠత్రయము, శక్తిత్రయము, మాతృమానమేయములుగా ఉన్నాయి. చరాచరమైన ఈజగత్తు గుణత్రయము వల్లనే వ్యాప్తమైంది. పరమాత్మ నిర్గుణ స్వరూపుడుకదా! మరి గుణత్రయము ఏరకంగా వచ్చింది.?

మొట్టమొదటగా ఆత్మ అనే వస్తువు మాత్రమే ఉంది. అదే పరబ్రహ్మ, ప్రకాశబిందువు. దాని స్వరూపము సత్యము. దాని ధర్మాలు జ్ఞానము, ఆనందము. కొంత కాలానికి సృష్టిచెయ్యాలనే తలంపుకలిగి ఆకాశంలో మేఘాలవలె, ప్రకాశబింబంనుంచి ఛాయాబింబమైన తమోబింబము ఒకటి ఆవిర్భవించింది. ఈతమోబింబము అసలు బింబంకన్నా వేరుగా ఉన్నది. కాని ఇది సత్యము, నిత్యముకానిది. మోహమనే అజ్ఞానమే దీనికి ఆత్మ.

ఈరకంగా ఆత్మ ప్రకాశ బిందువుగాను, ప్రతిబింబము తమోబిందువుగాను, రెండు బిందువులు ఏర్పడినాయి. ఈరెండు బిందువుల సమ్మేళనమువలన మిశ్రమబిందువు ఏర్పడింది. ప్రకాశబిందువు శుక్లబిందువు సత్వగుణము కలది. తమోబిందువు తమోగుణముకలది. ఈ రెండు బిందువుల మేళనము వలన రజోగుణ ప్రధానమైన రజోబిందువు ఏర్పడింది. ఈ రకంగా సత్వరజస్తమో గుణాలు ఏర్పడినాయి. ఇవన్నీ కలిసి గతంలో అశ్వత్థవృక్షమునందు చెప్పిన అవ్యక్తచక్రం ఉద్భవించింది. దీనిలో కనిపించిన ప్రతిబింబమే సాక్షి అని చెప్పబడింది. ఈ అవ్యక్తమే గుణత్రయము యొక్క మేళనవస్తువు. సృష్టికి మొదటిస్థానము.

ఆత్మయొక్క ప్రతిబింబము ఈశ్వరుడు. అతని ప్రతిబింబము హిరణ్యగర్భుడు. అతని ప్రతిబింబము విరాట్స్వరూపము. ఈ రకంగానే అవ్యక్తము బీజము, మహత్తత్త్వము స్పష్టమైన రూపంకలది, అహంకారము నీలమేఘమువంటిది. రూపంకలది. అహంకారమందు త్రిపుటి ఆవిర్భవించింది. కాబట్టి ఇక్కడ మూడు గుణములు విడిపోయినాయి. ప్రతి గుణము ఆరు భాగాలు అయింది. అందులో మూడు భాగాలు స్వంతము, రెండు భాగాలు రెండవది, ఒక భాగము మూడవది. అంటే సత్వగుణంలో మూడు భాగాలు సత్త్వము, రెండు భాగాలు రజోగుణము ఒక భాగము తమోగుణము. ఈరకంగా ఏర్పడ్డ గుణత్రయంవల్లనే బ్రహ్మాండమంతా నిండి ఉన్నది. ఈ గుణత్రయభేదంవల్లనే జగత్తులో వివిధ ఆకారాలు, స్వరాలు, రకాలు, వాసనలు, ప్రవృత్తులు కలిగిన ప్రాణులుద్భవిస్తున్నాయి. ఈ గుణాలకు అధిపతులే త్రిమూర్తులు. ఈగుణాలన్నీ మాయాస్వరూపాలు.

సత్వగుణ ప్రధానుడైన ప్రతిబింబము ఈశ్వరుడు. ఇతడు పంచబ్రహ్మలలో నాల్గవవాడు ఇతనిపైవాడు సదాశివుడు. అతడే ఆత్మతత్త్వము, శివశక్తి మేళనవస్తువు. బ్రహ్మాది త్రిమూర్తులను నియమించేవాడు పైనచెప్పిన నాల్గవ వాడయిన ఈశ్వరుడు. ఇతని ఆజ్ఞానుసారమే సృష్టిజరుగుతోంది. త్రిమూర్తులు వాళ్ళపనులు చేస్తున్నారు. పంచభూతాలు, చంద్రసూర్యాగ్నులు ఇతడి ఆజ్ఞలు పాలిస్తారు.

# త్రిపుటీ ఆవిర్భావము

14. తేషు క్రమేణ లింగత్రితయం తద్వచ్చమాతృకా త్రితయం
ఇత్థం త్రితయపురీ యా తురీయపీఠా చ భేదినీ విద్యా.

మూర్తిత్రయము, పదహారు అక్షరముల చొప్పున ఉన్న మాతృకాత్రయము, మొదలగు త్రితయములే స్థానముగా గలదై ఆ త్రిపురసుందరీదేవి ప్రకాశించుచున్నది

యోనిచక్రంలో మూడు కోణాలున్నాయి. ఆకోణాలలో మూడు బిందువులున్నాయి. అక్కడ వాగ్భవకామరాజ శక్తిబీజములనబడే బీజత్రయము, సత్వరజ తమోగుణ త్రయమనబడే మూర్తిత్రయము, అ నుంచి అః, క నుంచి త, థ నుంచి స వరకు లమాతృకాత్రయము, చంద్ర సూర్యాగ్ని మండలాలు, మాతృమానమేయములు మొదలైన త్రిపుటియే అవయవములుగా కలిగి మధ్య బిందువైన సంవిద్రూప పరమాత్మ స్వాత్మయందు సకలతత్త్వములుకల ఆత్రిపురసుందరీ దేవి విరాజిల్లుచున్నది. ఈరకంగా ఇక్కడ ఉన్నవన్నీ మూడు రకాలుగా ఉండటంచేత ఆపరాత్పరి త్రిపురసుందరీ అని పిలువబడుతున్నది.

అఖండాకారమయిన పరాశక్తికి ఈరకమైన త్రివిధభేదాలు ఎందుకు కలిగాయో ఈ దిగువ వివరించటం జరిగింది. దేవీభాగవతంలో ఈ విధంగా ఉంది.

యతీనాం మంత్రిణాం చైవ జ్ఞానినాం యోగినాం తథా।
ధ్యాన పూజా నిమిత్తం హి తనూర్న్సృష్టాతి మాయయాతి॥

యతులకు, మం వేత్తలకు, జ్ఞానులకు యోగులకు ధ్యానము, పూజ నిమిత్తమే ఈ మాయాదేహము ఇవ్వబడినది.

కాళికా పురాణంలో ఈవిధంగా ఉంది

మాయైకా భిన్నరూపేణ కమలాఖ్యా సరస్వతీ।
సావిత్రీ సా చ సంధ్యా చ భూతకార్యస్య భేదతః॥

ఒకే మాయ భూతములయొక్క కార్యనిర్వహణకు లక్ష్మీ సరస్వతి, సావి త్రి అను పేర్లతో విభజించబడినది.

బృహన్నారదీయంలో ఈవిధంగా ఉంది.

ఉమేతి కేచి దాహు స్తాం శక్తిం లక్ష్మీం తథా పరే।
భారతీత్యపరే చైనాం గిరిజే త్యంబికేతి చ॥
దుర్గేతి నారీసకాళీతి చండీ మహేశ్వరీతి చ।
కౌమ వైష్ణవీ చేతి వారాహీ చ తథాపరే॥
బ్రాహ్మీతి విద్యావిద్యేతి మాయేతి చ తథా పరే।
ప్రకృతిశ్చ పరాచేతి వదంతి పరమర్షయః॥

ఆ పరమే ్శ్వ రినే ఉమ, శక్తి, లక్ష్మి, భారతి, గిరిజ, అంబిక, దుర్గ, భద్రకాళి, చండి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవీ, వారాహీ, విద్యా అని, అవిద్య అని, మాయ అని వివిధ పేర్లతో పిలుస్తారు.

## సూక్ష్మ భూతనిరూపణము

**15 శబ్దస్పర్శౌ రూపం రసగంధౌ చేతి భూతసూక్ష్మాణి**
**వ్యాపకమాద్యం వ్యాప్యం తూత్తరమేవం క్రమేణ పంచదశః**

శబ్ద స్పర్శ రూప రస గంధాలనబడే పంచతన్మాత్రలు మొదటి వ్యాపకమని, తరువాతది వ్యాప్తమని ఈ రకంగా పదిహేను గుణాలవుతున్నాయి.

ఇక్కడనుంచి మూడు సూత్రాలలో పంచదశీ మహామంత్రా వివరిస్తున్నారు. పంచభూతాలయొక్క సూక్ష్మరూపాలే తన్మాత్రలు. వీటిలో మొదటనున్న ఆకాశము వ్యాప్యము. స్పర్శాదులు వ్యాపకములు. ఈ రకంగా వ్యాప్య, వ్యాపక భావము పొంది పదిహేను సూక్ష్మాంశాలుగా ఉన్నాయి. అది ఎలా అంటే

| | | |
|---|---|---|
| ఆకాశమందు | - | శబ్దము |
| వాయువునందు | - | శబ్దము స్పర్శ |
| అగ్నియందు | - | శబ్ద, స్పర్శ, రూపాలు |
| జలమందు | - | శబ్ద, స్పర్శ, రూప, రసాలు |
| భూమియందు | - | శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు. |

ఈ రకంగా పంచభూతాలలో ఉన్న సూక్ష్మాంశలే పదిహేను మం త్ర బీజాక్షరాలుగా ఉన్నాయి.

## పంచదశాక్షరీ ఆవిర్భావము

**16. పంచదశాక్షరరూపా నిత్యా చైషాహి భౌతికా ప్రోక్తా**
**నిత్యాశ్శబ్దాది గుణప్రభేదభిన్నా స్తథా ప్రోక్తా ప్రనయా వ్యా**

త్రిపురసుందరీ పరాశక్తి ఏకారణంచేత భూతసంబంధమైన ఏకకాల అంగీకరించబడిందో, అందుచేతనే పదిహేను బీజమ ౦ కలదై కూడ మహానిత్య అనే కావ రూపమవుతున్నది.

పదిహేను నిత్యలు శబ్దాది గుణములచేత అత్యంత భేదములు కలవై పదహారవ నిత్య షోడశీకళ అయిన సాదాఖ్య కళతో తాదాత్మ్యము పొందుతున్నాయి.

ఈ శ్లోకంలో పంచదశీ మహామంత్రానికీ, ఆమంత్రానికి అధిదేవత అయిన త్రిపురసుందరికీ భేదము లేదు. రెండూ ఒక్కటే అని చెప్పబడుతున్నది. పంచభూతాలు, వాటియొక్క సూక్ష్మరూపాలయిన తన్మాత్రలు పంచదశీ మహామంత్రంలోని పదిహేను అక్షరాలయినాయని ముందే చెప్పటం జరిగింది. నిత్యలు మొత్తం పదహారు. అవి.:

| | |
|---|---|
| 1. కామేశ్వరీ | 9. కులసుందరీ |
| 2. భగమాలినీ | 10. నిత్యా |
| 3. నిత్యక్లిన్నా | 11. నీలపతాకా |
| 4. భేరుండా | 12. విజయా |
| 5. వహ్నివాసినీ | 13. సర్వమంగళా |
| 6. మహావజ్రేశ్వరీ | 14. జ్వాలామాలినీ |
| 7. శివదూతీ | 15. చిత్రా |
| 8. త్వరితా | 16. మహాత్రిపురసుందరీ (మహానిత్య) |

వీటిలో కామేశ్వరి మొదలు చిత్రవరకు గల పదిహేను నిత్యలు, ఈ బీజాలకు అధిదేవతలుగా ఉండి పదహారవదయిన షోడశీకళ, మహాత్రిపుర సుందరియందు తాదాత్మ్యము పొందుతున్నాయి.

ఆత్మవలన అవ్యక్తము, దానివలన మహత్తత్త్వము, దానివలన అహంకారము ఉత్పన్నమైనాయి. ఆత్మ సత్యము, నిత్యము. దానినుంచి వచ్చిన అవ్యక్తము సత్వరజస్తమోగుణముల మిశ్రమము. దాని నుంచి వచ్చిన మహత్తత్త్వము అస్పష్టము. దీనివలన కలిగిన అహంకారము స్పష్టమైన రూపము గలది. సర్వకారణరూపమైన ఆత్మవల్లనే అవ్యక్త మహత్తత్త్వ అహంకారాలు కలిగినాయి. కాబట్టి ఈనాలుగు బిందువులకు ఆత్మ అని సంకేతము. ఇదే తురీయాకూటమి. ఆత్మనుంచి అహంకారము, దీనినుంచి అకాశము మొదలైన పంచభూతాలు గతంలో వివరించినట్లుగా ఉత్పన్నమైనాయి. ఈరకంగా అన్నింటికీ కారణము ఆత్మ. అదే మహానిత్య. అదే షోడశీకళ. దానినుంచి వచ్చినవే పదిహేను బీజాలు, నిత్యలు. కాబట్టే ఈనిత్యలు మళ్ళీ మహానిత్యలో లీనమౌతున్నాయి.

సహస్రారమే చంద్రమండలము. అదే ఆత్మ. ఇక్కడ ఉన్న చంద్రుడు నిత్య కళాయుక్తుడు. అతడికి వృద్ధిక్షయాలుండవు.

వేద,ఆత్మజ్ఞానం తెలుసుకోవటానికి మనకు అనేక విధాలునాయి. వాటిలో వేదాలు ఒకటి. ములో చెప్పబడిందే గాయత్రీ మహామంత్రం. గాయత్రిమంత్రం రెండు విధాలుగా ఉంది.

1. బ్రాహ్మణులు ఉపాసించే ఇరవైనాలుగు అక్షరాల గాయత్రి. 2. వేదాలలో రహస్యంగా ఉన్నది. దీన్నే శ్రీవిద్యాపంచదశీ అంటారు. కాబట్టి గాయత్రీ మహామంత్రానికీ, పంచదశీమహా మంత్రానికీ భేదము లేదు. రెండూ పరాశక్తి స్వరూపాలే. అంచేతనే గాయత్రీ మః బ్రా గహ్మణుల కోసం కల్పించబడగా, పంచదశీమహామంత్రం అన్ని వర్ణాలవారికోసం సృష్టించబడిందని అగస్త్యమహర్షి చెప్పారు.

> తద్ జ్ఞానార్థ ముపాయా విద్యా లోకే చతుర్దశ ప్రోక్తాః
> తేష్వపి చ సారభూతా వేదా స్త్రత్రాపి గాయత్రీ॥
> తస్యా రూపద్వితయం తత్రైకం య త్త్రపత్యతే స్పష్టం
> వేదేషు చతుర్ష్వపి పరమత్యంత గోపనీయతరం॥

పంచదశీ మహామంత్రము:-

> స్మరో మారో మారః స్మర ఇతి పరో మార మదనః
> స్మరానంగశ్చేతి స్మరమదన మారాః స్మర ఇతి।
> త్రిఖండః ఖండాంతే కలిత భువనేశ్యక్షరయుత
> శ్చతుః పంచార్ణాస్తే త్రయ ఇతి చ పంచాక్షరమనుః ॥

గౌడ పాదాచార్యులవారు ఈ శ్లోకంలో పంచదశీమహామంత్రాన్ని వివరించారు. ఇది పదిహేను అక్షరాల మంత్రం.

1.స్మర - క కారబీజము,
2.మారో - ఏ కారము
3.మారః - ఈ కారము,
4.స్మర - ల కారము
5.పర - హ కారము,
6.మార - స కారము

ఈ బీజాక్షరములను మూడుఖండములు గా చేసి, ఆఖండాంతములందు భువనేశ్వరీబీజము అనగా హృల్లేఖ (హ్రీంకారము) లను చేర్చినట్లైతే పంచదశాక్షరీ మహామంత్రం అవుతుంది.

మంత్రం :- క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క లహ్రీం ।
ఈమంత్రాన్ని సౌందర్యలహరిలో శంకరభగవత్పాదులవారు ఈ విధంగా చెప్పారు.

శివ శక్తిః కామః క్షితి రథ రవి శీతకిరణః
స్మరో హంస శ్శక్ర స్తదనుచ పరా మార హరయః
అమీ హృల్లేఖాభి స్తిస్మభి రవసానేషు ఘటితా :
భజన్తే వర్ణాస్తే తవ జ ఽస నామావయవ తా మ ॥

శ్రీవిద్యలో ప్రసిద్ధమైనది పంచదశీమహామంత్రము, ఇది శాక్తేయానికి గాయత్రి వంటిది. గాయత్రీమంత్రం బ్రాహ్మణుల కోసం ఏర్పడగా, పంచదశీ మహామంత్రం చతుర్వర్ణాల వారికీ ఉపాశ్య అని అగస్త్య మహర్షి వ్రాసిన శ్రీవిద్యాదీపిక లో చెప్పబడింది. పంచదశీమహామంత్రం మాయను పోగొట్టి పరబ్రహ్మను ప్రకాసింపచేస్తుంది.

మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మధుడు, అగస్త్యుడు, అగ్ని, సూర్యుడు, ఇంద్రుడు, శివుడు, విష్ణువు, దూర్వాసుడు, బలరాముడు, దత్తాత్రేయుడు మొదలైన అనేకమంది ఈ మంత్రం జపించి తరించారు అని మానసోల్లాసము, జ్ఞానార్ణవములలో చెప్పబడింది.

అయితే పంచదశీమహామంత్రాన్ని దర్శించి ఈ లోకానికి తెచ్చినవాడు మన్మధుడు. అతడే ఈ మంత్రానికి ఋషి అని కొందరి వాదము. కాగా దక్షిణామూర్తి మూలపురుషుడు అని కొందరంటారు.

సంస్కృతభాషకు గల అక్షరాలలో అ నుంచి అః వరకు అచ్చులని, క నుంచి క్ష వరకు హల్లులనీ అంటారు. అచ్చులు శక్తిరూపాలు, హల్లులు శివరూపాలు. ఈ విషయాన్ని మాతృకాహృదయం అనే గ్రంథంలో వివరించటం జరిగింది.

కకారాది క్షకారాంతా వర్ణాస్తే శివరూపిణః
సమస్త వ్యస్తరూపేణ షట్ త్రింశత్ తత్త్వ విగ్రహాః ॥
అకారాది విసర్గాంతాః స్వరాః షోడశ శక్తయః
నిత్యా షోడశకాత్మనః పరస్పర మమీయుతాః॥
శివ శక్తి మయా వర్ణా శబ్దార్థ ప్రతిపాదకా
శివః స్వర పరాధీనో న స్వతంత్రః పదాస్యసౌ ॥
స్వరాః స్వతంత్రా జాయంతే న శివస్తు కదాచన

అక్షరాలను మొత్తం మూడుభాగాలుగా చేసి, అంటే

1. అ నుంచి అః వరకు 16 అక్షరాలు - మొదటి భాగము.
2. క నుంచి త వరకు 16 అక్షరాలు - రెండవ భాగము.
3. థ నుంచి స వరకు 16 అక్షరాలు - మూడవ భాగము.

ఈ రకంగా మూడుభాగాలుగా చేసి వాటిలో సత్వ, రజస్ తమో గుణాల, త్రిమూర్తుల, చంద్రసూర్యాగ్నుల, జాగ్రత్ స్వప్న సుషుప్తి అనబడే మూడు అవస్థల తత్వాలు చేర్చబడ్డాయి. వీటిలో నిత్యలను కూడా చేర్చటం జరిగింది. నిత్యలు మొత్తం పదహారు. ఈ షోడశనిత్యలను వసిష్ఠసంహితలో శివుడు పార్వతికి వివరిస్తాడు.

శృణుదేవి ప్రవక్ష్యామి నిత్యాషోడశకం తవ
వకస్య చిన్మయా ఖ్యాతం సర్వ తంత్రేషు గోపితమ్ ॥
ఆదౌ ప్రథమానిత్యా మహాత్రిపురసుందరీ
తత: కామేశ్వరీనిత్యా, నిత్యాచ భగమాలినీ ॥
నిత్యక్లిన్నా తథాచైవ, భేరుండా వహ్నివాసినీ
మహావిద్యేశ్వరీ, రౌద్రీ, త్వరితా, కులసుందరీ ॥
నిత్యా నీలపతాకాచ విజయా, సర్వమంగళా
జ్వాలామాలిని, చిద్రూపాః ఏతానిత్యాస్తు షోడశః
ప్రతిపత్ప్రభృతౌ దేవ్యాః పౌర్ణ మాస్యంత మర్చయేత్
ఏకాదివృద్ధ్యా హాన్యాచ దశ్యాంతం దేవి విగ్రహమ్ ॥

ఈ నిత్యలు వరుసగా

| | |
|---|---|
| 1. మహాత్రిపుర సుందరి | 10. కులసుందరీ |
| 2. కామేశ్వరి | 11. నిత్యా |
| 4. నిత్యక్లిన్న | 12. నీలపతాకా |
| 5. భేరుండ | 13. విజయా |
| 6. వహ్నివాసిని | 14. సర్వమంగళా |
| 7. మహావిద్యేశ్వరి | 14.జ్వాలామాలిని |
| 8. రౌద్రీ (శివదూతి) | 15. (చిద్రూపా) |
| 9. త్వరిత | 16.మహాత్రిపురసుందరీ |

నిత్యలస్వరూపాలు శ్రీవిద్యాదర్పణం చూడండి.

ఈ షోడశనిత్యలు శుక్లపక్షపాద్యమి మొదలు పౌర్ణమి వరకు తిథుల రూపమున, కృష్ణపక్ష పాద్యమి మొదలు అమావాస్య వరకు తిథుల రూపమున ఉన్నారు. వీరినే చంద్రకళలు అని అంటారు. చంద్రకళలే పాద్యమి మొదలైన తిథులని జ్యోతిశ్శాస్త్రంలో చెప్పబడింది.

ప్రతిపన్నామ విజ్ఞేయా చంద్రస్య ప్రథమాకళా
ద్వితీయాద్యాః ద్వితీయాద్యాః పక్షయో శ్శుక్ల కృష్ణయోః ॥

పాద్యమి నుండి పౌర్ణమి వరకు పదిహేను అమావాస్య మొత్తం పదహారు తిథులు

దర్శ్యాద్యాః పూర్ణిమాంతశ్చ కలాః పంచదశైవతు
షోడశీతు కలాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ ॥

అమావాస్య మొదలు పూర్ణిమ వరకు గల కళలు పదిహేను. పదహారవవ కళ షోడశి సచ్చిదానంద స్వరూపిణి అయి ఉన్నది. ఇదే సాదాఖ్యకళ. నాదబిందు కళాతీతమయినది. ఈ రకంగా పదహారు తిథులను, పదహారు కళలను,

1. ప్రకటయోగిని
2. గుప్తయోగిని
3. గుప్తతరయోగిని
4. సంప్రదాయయోగిని
5. కుళోత్తీర్ణయోగిని
6. నిగర్భ యోగిని
7. రహస్య యోగిని
8. అతిరహస్య యోగిని
9. పరాపర రహస్యయోగిని

అనబడే తొమ్మిది మంది యోగినులను అందులో అంతర్భావం చేసి, ఒక్కొక్క భాగానికి ఒక్కొక్క హ్రీంకారాన్ని ఏర్పాటు చేశారు. హ్రీంకారము అనేది ప్రాణశక్తి. అది లేకపోయినట్లైతే మంత్రము నిర్వీర్యమవుతుంది.

1. దర్శ,
2. దృష్ట,
3. దర్శత,
4. విశ్వరూప
5. సుదర్శన,
6. అప్యాయమాన,
7. అప్యాయమాన,
8. అప్యాయ,
9. సూనృత
10. ఇర,
11. అపూర్వమాణా
12. అపూర్వమాణా
13. పూరయంతి
14. పూర్ణ
15. పూర్ణమాసి

అనబడే చంద్రకళలు, త్రిపురసుందరి మొదలైన నిత్యలే అధిదేవతలు. షోడశీకళ సాదాఖ్యకళ. తానే సర్వస్వమునకూ అధిదేవత. ఈ కళలన్నీ మూడుఖండాలుగా చేయబడ్డాయి.

1 శివ, శక్తి, మాయ, శుద్ధవిద్య, జలము అనే ఐదుతత్త్వాలకు సంబంధించిన మొదటి ఐదు కళలు గల ప్రథమఖండాన్ని ఆగ్నేయఖండం అంటారు. దీనికి అధిదేవత అగ్ని.

2. తేజస్సు, వాయువు, మనస్సు, పృథివి, ఆకాశము అను ఐదు తత్త్వాలకు సంబంధించిన ఆరు

నుంచి పది వరకు గల కళలు సౌరఖండము. దీనికి అధిదేవత సూర్యుడు.

3. విద్య, మహేశ్వరి,పర,ఆత్మ సదాశివ అను ఐదు తత్త్వాలకు సంబంధించిన చివరి ఐదుకళలు

సౌమ్యఖండము. దీనికి అధిదేవత సోముడు.

అన్ని కళలకూ, ఖండాలకు అధిదేవత కామేశ్వరుడు. అధిష్ఠాత్రి కామేశ్వరి. ఈ రకంగా సోమసూర్యఅనలాత్మకములైన మూడుఖండాలుగా ఈ మంత్రం విభజింపబడింది. ఈ మూడుఖండాలను మూడుకూటములు అంటారు.

1. క ఏ ఈ ల హ్రీం. - ఇది వాగ్భవకూటము. విద్యాప్రదము. బుద్ధిప్రదము.
2. హ స క హ ల హ్రీం - ఇది కామరాజకూటమి. అభీష్టసిద్ధి కలిగిస్తుంది. భోగప్రదము.
3. స క ల హ్రీం - ఇది శక్తి కూటమి. మోక్షప్రదము.

లలితాత్రిశతి ఫలశృతి లో ఈ విధంగా చెప్పబడింది.

> ఏతద్విజ్ఞాన మాత్రేణ శ్రీవిద్యా సిద్ధిదా భవేత్
> కత్రయం హద్వయం చైవ శైవో భాగః ప్రకీర్తితః ॥
> శక్త్యక్షరాణి శేషాణి, హ్రీంకార ముభయాత్మకః
> ఏవం దే విభాగ మజ్ఞాత్వా యేవిద్యాజపశా లిన ః ॥

పంచదశీమహామంత్రంలోని మూడు క కారములు, రెండు హ కారములు శివాత్మకములు. మూడు హ్రీంకారములు శివ శక్త్యాత్మకములు. మిగిలిన అక్షరములు శక్త్యాత్మకములు. ఈ విషయము తెలియకుండా ఎంతకాలము జపం చేసినా, మంత్రం సిద్ధించదు.

**హాది కాది విద్యలు :** అకారాది క్షకారాంతము అక్షరసముదాయానికి మాతృకలని పేరు. వీటిలో కకారాదిగ హల్లులున్న అక్షరాలను కాదిమాతృకలని, హకారాదిగహల్లులున్న అక్షరాలతోమొదలైతే హాదిమాతృకలని అంటారు. పంచదశీమహామంత్రము క కారముతో

మొదలైతే కాదివిద్య అని, హ కారంతో మొదలైతె హాదివిద్య అని చెప్పబడింది. కాదివిద్యలో యమనియమాలుండవు. ధర్మాచరణ విషయంలో స్వేచ్ఛ ఇవ్వబడిందని శక్తిసంగమతంత్రంలో చెప్పబడింది. ఈ రెండు విద్యలలోను కాది విద్య శ్రేష్ఠమైనది.

కామో (క) యోని : (ఏ) కమలా (ఈ) వజ్రపాణి : (ల)
గుహా (హ్రీం) హసా (హస) మాతరిశ్వా (క) (హ) మింద్రః (ల)
పునర్గుహా (హ్రీం) సకలా (సకల) మాయయా (హ్రీం) చ.

మంత్రము : క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీం। స క ల హ్రీం।

కాది మతానికి దక్షిణామూర్తి ఋషికాగా హాదిమతానికి హయగ్రీవుడు ఋషి. కాని వాడుకలో రెండు మతాలకూ దక్షిణామూర్తినే ఋషిగా చెబుతున్నారు. కాదిమతంలో మంత్రంలో చెప్పబడిన మొదటి మూడు అక్షరాలను హ,స,క అని మార్పుచేసినట్లైతే అది హాదిమతం అవుతుంది.

శివేన (హ) శక్త్యా (స) కామేన (క) శక్రే (ల) ణైవతు మాయయా ( హ్రీం)
హంసేన (హ) భృగుణా (స) చైవ కామేన (క) శశిమౌళినా (హ)
శక్రేణ (ల) భువనేశేన (హ్రీం) చంద్రేణ (స) చ మనోభువా (క)
క్షిత్యా (ల) హృల్లేఖయా (హ్రీం) చైవ ప్రోక్తో హసాది మంత్రరాట్ ॥

మంత్రం : హ స క ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ॥

ఈ రకంగా హాది, కాది మతాలలో పంచదశీమహామంత్రం ఉపాసింపబడింది. పూర్వకాలంలో ఈ మంత్రాన్ని చాలా మంది చాలా రకాలుగా ఉపాసించారు.

మనుశ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రాచ మన్మథః
అగస్తి (క్రో)న్నంది సూర్యోచ ఇంద్రో విష్ణుశ్శివ స్తథా
ధభట్టారకో దేవ్యా ఏతే ముఖ్యఉపాసకా :
ఏవం ద్వాదశదా భిన్నా శ్రీమత్పంచ దశాక్షరీ ॥।

మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మధుడు, అగస్త్యుడు, అగ్ని, సూర్యుడు, ఇంద్రుడు, విష్ణువు, శివుడు, దూర్వాసుడు అను పన్నెండు మంది ఈ మంత్రాన్ని వివిధ రకాలుగా ఉపాసించారు. కాని

తేషు ద్వౌ మనురాజౌ తు వరిష్ఠౌ వింధ్యమర్దన
లోపాముద్రా కామరాజావితి ఖ్యాతి ముపాగతౌ
హాదిస్తు లోపాముద్రా స్యాత్కామరాజస్తు కాదిక :
తయోస్తు కామరాజో ఽ యం సిద్ధిదో భక్తి శాలినాం ॥

ఈ పన్నెండుమంత్రాలలోనూ హాదిమతంలో లోపాముద్రము, కాదిమతంలో కామరాజము అనే రెండు మంత్రాలే శ్రేష్ఠములు. మళ్ళీ ఈ రెండింటిలోనూ కాది విద్య అయిన కామరాజవిద్య ప్రశస్తము.

ఈ పన్నెండురకాల మంత్రాల వివరణ నాచే వ్రాయబడిన శ్రీవిద్యాదర్శనము అనే గ్రంథంలో ఇవ్వబడింది.

ఈ రకంగా భిన్న సంప్రదాయాలతో పంచదశీమహామంత్రం చెప్పబడుతోంది. ఈ మంత్రాన్ని వివిధమంత్రాలతో సంపుటం చేయటం కూడా జరుగుతోంది. పంచదశీ మహామంత్రాన్ని

1. బాలా మంత్రంతో సంపుటంచేస్తే సౌభాగ్యవిద్య అంటారు.
2. గణపతి మంత్రంతో సంపుటం చేస్తే విద్యాగణపతి అంటారు.
3. గోపాల మంత్రంతో సంపుటం చేస్తే గోపాలసుందరి అంటారు.

---

## నిత్యాప్రకరణము

17. నిత్యా స్తిథ్యాకారా స్తిథయ శ్శివశక్తి సమరసాకారాః
దివసనిశామయ్యాస్తా శ్రీవర్ణాస్తే ऽ పితద్వయీరూపాః

కామేశ్వరీ మొదలైన పదిహేను నిత్యలు, పదిహేను తిథుల రూపంలో ఉన్నాయి. ఆ తిథులు పగలు, రాత్రి రూపంలో ప్రకాశ విమర్శలుగా పంచదశీ విద్యలో బీజములయి శివశక్తుల రూపంలో ఉన్నాయి.

ఈసూత్రంలో కాలము బ్రహ్మస్వరూపమని, నిత్యమని చెప్పబడుతోంది. గతంలో చెప్పిన కామేశ్వరీ మొదలైన పదిహేను నిత్యలు షోడశీకల నుంచి ఉద్భవించాయి. ఈ నిత్యలే తిథుల రూపంలో ఉన్నాయి. తిథులు పగలు రాత్రి అనే భేదము కలిగి ఉన్నాయి. ఈ చంద్రకళలు సూర్యుని నుండి చంద్రుని వద్దకు, చంద్రుని నుండి సూర్యుని వద్దకు తిరుగుతూ ఉంటాయి. జ్యోతిశ్శాస్త్రంలో ఈ విధంగా ఉంది.

ప్రతిపన్నామ విజ్ఞేయా చంద్రస్య ప్రథమాకలా
ద్వితీయం వా ద్వితీయం వా స్యాత్పక్షయో శ్శుక్ల కృష్ణయోః

పౌర్ణమినాడు పదిహేను కళలు చంద్రునిలో ఉంటాయి. తరువాత పాడ్యమినాడు ఒకకళ చంద్రుని విడిచి సూర్యునిలో కలుస్తుంది. ఈరకంగా రోజుకు ఒక కళచొప్పున చంద్రుని

విడిచిపోతుంది. ఆప్రకారం అమావాశ్య వచ్చేప్పటికి పదిహేను కళలు చం ని వదిలివేస్తాయి. కాబట్టి ఆరోజున చంద్రుడు కళా విహీనుడౌతాడు. ఆతరువాత రోజు ంచి ఒక్కొక్క కళ సూర్యుని వి ముంచి చంద్రునిలో చేరుతుంది. ఈ ప్రకారం పౌర్ణమి వ సరికి చ్చే న్ని కళలా చంద్రుణ్ణి చేరతాయి. ఈ రకంగా శుక్ల కృష్ణ పక్షాలు ఏ తున్నవి. కాలమానం గనక చూసినట్లైతే

| | | |
|---|---|---|
| ఒకపగలు, ఒకరాత్రి | - | ఒకరోజు సామాన్యంగా తిథి ఒక |
| పదిహేను తిథులు | - | ఒకపక్షము |
| రెండు పక్షములు | - | ఒక మాసము |
| రెండు మాసములు | - | ఒకఋుతువు. |
| అరు మాసములు లేక మూడు ఋుతువులు | - | ఒక అయనము |
| రెండు అయనములు లేక ఆరు ఋుతువులు | - | ఒక సంవత్సరము (360 రోజులు) |

ఈ ంగా విధ్వర్ధ కాలము కూడా ఆ పరబ్రహ్మస్వరూపమే. దేవి పాదములనుంచి వచ్చిన కిరణములచేతనే కాలస్వరూపము ఏర్పడింది. ఈ పక్షములందు పగలు, రాత్రుల పేర్లు విడిగా ఉన్నాయి.

తైత్తరీయంలో శుక్ల, కృష్ణ పక్షాల పగలు, రాత్రుల పేరు ఈవిధంగా వున్నాయి.

**1. శుక్లపక్ష పగళ్ళ పేర్లు:-**

సంజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం జాన దభిజానత్,
సంకల్పమానం ప్రకల్పమాన ముపకల్పమాన ముపక్లప్తం క్లప్తమ్,
శ్రేయోవశీయ ఆయస్సభూతం భూతం

**2. శుక్లపక్ష రాత్రుల పేర్లు:-**

శ్రీ దర్శ దర్శితా విశ్వరూపా సుదర్శనా,
ఆప్యాయమానా ప్యాయమానా ప్యాయా సూన ఇరావతి
అపూర్వమాణా పూరయంతీ పూర్ణా పౌర్ణమా సీ తి.

**3. కృష్ణ పక్ష పగళ్ళ-పేర్లు :-**

ప్రస్తుతం విష్టుత గ్ం సంస్తుతం క ల్యాణం విశ్వరూపం
శుక్రమమృతం తేజస్వి తేజ స్సమిద్ధం
అరుణం భానుమ త్మరీచి మదభితపస్త పస్వి . సేతి

4. కృష్ణపక్ష రాత్రుల పేర్లుం-

సుతా సున్వతీ ప్రసుతా సూయమానా విషూయమానా,
ప్రీతీ ప్రపా సంపా తృప్తి స్తర్పయంతీ, ‍ ‍ ్రూ
కాంతా కామ్యా కామజాతాయుష్మతీ కామధుష

శుక్లపక్ష తిథుల వివరాలు ఈవిధంగా ఉన్నాయి.

| తిథి | నిత్యాదేవిపేరు | పగటితిథి | రాత్రి తిథి |
|---|---|---|---|
| పాద్యమి | కామేశ్వరీ | సంజ్ఞానం | దర్శ |
| విదియ | భగమాలినీ | విజ్ఞానం | దృష్టా |
| తదియ | నిత్యక్లిన్నా | ప్రజ్ఞానం | దర్శతా |
| చవితి | భేరుండా | జానత్ | విశ్వరూపా |
| పంచమి | వహ్నివాసినీ | అభిజానత్ | సుదర్శనా |
| షష్టి | మహావజ్రేశ్వరీ | సంకల్పమానం | ఆప్యాయమానా |
| సప్తమి | శివదూతీ | ప్రకల్పమానం | ఆప్యాయమానా |
| అష్టమి | త్వరితా | ఉపకల్పమానం | ఆప్యాయా |
| నవమి | కులసుందరీ | ఉపక్లప్తం | సూనృతా |
| దశమి | నిత్యా | క్లప్తం | ఇరా |
| ఏకాదశి | నీలపతాకా | శ్రేయః | అపూర్యమాణా |
| ద్వాదశి | విజయా | వశీయః | పూర్యమాణా |
| త్రయోదశి | సర్వమంగళా | అయత్ | పూరయంతే |
| చతుర్దశి | జ్వాలామాలినీ | సంభూతం | పూర్ణా |
| పౌర్ణిమా | చిత్రా | భూతం | పూర్ణమాసీ. |

కృష్ణపక్షంలోని తిథులు ఈవిధంగా ఉంటాయి.

| తిది | నిత్యాదేవి పేరు | పగలు తిథి | రాత్రి తిథి |
|---|---|---|---|
| పాద్యమి | చిత్రా | ప్రస్తుతం | సుతా |
| విదియ | జ్వాలామాలిని | విష్టుతం | సున్వతీ |
| తదియ | సర్వమంగళా | [illegible]స్తుతం | ప్రసుతా |

| | | | |
|---|---|---|---|
| చవితి | విజయా | కల్యాణం | నూయమానా |
| పంచమి | నీలపతాకా | విశ్వరూపం | అభినూయమానా |
| షష్ఠి | నిత్యా | శుక్రం | ప్రీతీ |
| సప్తమి | కుసుందరీ | అమృతం | ప్రసా |
| అష్టమి | త్వరితా | తేజస్వీ | సంసా |
| నవమి | శివదూతీ | తేజః | తృప్తిః |
| దశమి | మహావజ్రేశ్వరీ | సమిద్ధం | తర్పయంతీ |
| ఏకాదశి | వహ్నివాసినీ | అరుణం | కాంతా |
| ద్వాదశి | భేరుండా | భానుమత్ | కామ్యా |
| త్రయోదశి | నిత్యక్లిన్నా | మరీచిమత్ | కామజాతా |
| చతుర్దశి | భగమాలినీ | అభితపత్ | అయుష్మతీ |
| అమావాశ్య | కామేశ్వరి | తపస్విత్ | కామధుఘా |

ఈ రాత్రులు మధువును సంపాదిస్తాయి. పగళ్ళు మధువును వర్షిస్తాయి. ఈవిషయము తెలుసుకున్న వారికి సుధాసింధువులు బైందవస్థానమందు కాలజ్ఞానము కలగచేస్తాయి. వారికోరికలు తీరతాయి. ఎవరైతే ఈవిషయం తెలుసుకోరో, వారిబైందవస్థానమందు మధు శూన్యమయి వారికోర్కెలు నెరవేరవు.

నిత్యాదేవతల ధ్యాన శ్లోకాలు, వారిస్వరూపాలు నాచేవ్రాయబడిన శ్రీవిద్యాదర్పణములో ఇవ్వబడినాయి.

శుక్లపక్షంలో కాని, కృష్ణపక్షంలోకాని అష్టమి తిథినాడు ఉందేది త్వరితాకళ. అందుచేతనే అష్టమి తిథినాటి చంద్రరేఖ పరాత్పరి శిరోభాగాన అలంకారంగా ఉంటుంది.

## విద్యా తత్త్వాత్మకము

**18. అజ్వ్యంజన బిందుత్రయ సమిష్టి భేదైర్విభావితాకారా,**
**షట్త్రింశత్తత్త్వాత్మా తత్త్వాతీతా చ కేవలా విద్యా.**

స్వరాలు, వ్యంజనాలు, అనుస్వారాలు అనబడే మూడు రకాలుగా విభజించబడిన అక్షర రూపాముకలదై, ముప్ఫై ఆరు తత్త్వములు శరీరముగా కలది, అన్ని తత్త్వాలకన్నా వేరుగా ఉన్నది అయిన పంచదశీవిద్య సర్వోత్కర్షగా ప్రకాశిస్తోంది.
పంచదశీమహావిద్య శివాదిక్షిత్యంతము ముప్ఫై ఆరు తత్త్వాలు తనశరీరముగా కలిగి ఉన్నది. ఈ మంత్రము మూడు కూటములుగా ఉన్నది. అవి

1. వాగ్భవకూటమి 2. కామరాజకూటమి 3. శక్తికూటమి

వాగ్భవకూటమిలో ఐదు బీజములు

కామరాజకూటమిలో - ఆరు బీజములు
శక్తి కూటమిలో - నాలుగు బీజములు ఉన్నాయి.

వీటిలో ఉన్న అచ్చులు, హల్లులు, ఉభయాక్షరాలు మొత్తం కలిపి ముప్పైఆరు అవుతున్నాయి. కాబట్టి ఈ అక్షరాలు ముప్పైఆరు తత్త్వాలకు ప్రతీకలు.

పంచదశీమహామంత్రము హాది కాది విద్యలలో చెప్పబడుతోంది. ఈ విద్యలలో ఈ వర్ణవిభజన మంత్రశాస్త్ర ప్రశిద్ధముగ నున్నది. కాదివిద్య ప్రకారము

ప్రథమఖండంలో - ఏడు అచ్చులు, ఐదు హల్లులు మొత్తం పన్నెండు
ద్వితీయఖండంలో - ఆరు అచ్చులు, ఎనిమిది హల్లులు మొత్తం పధ్నాలుగు
తృతీయఖండంలో - నాలుగు అచ్చులు, ఆరు హల్లులు మొత్తం పది

ఈరకంగా ముప్పైఅరు అక్షరాలు, ముప్పైఆరు తత్త్వాలకు ప్రతీకలు. హాది విద్య ప్రకారము

ప్రథమఖండంలో - ఐదు అచ్చులు, ఏడు హల్లులు. మొత్తం పన్నెండు
ద్వితీయఖండంలో - ఆరు అచ్చులు, ఎనిమిది హల్లులు. మొత్తం పధ్నాలుగు
తృతీయఖండంలో - నాలుగు అచ్చులు, ఆరు హల్లులు. మొత్తం పది.

సాధకుని శరీరము నాలుగు భాగాలుగా ఉంది. ఆజ్ఞా చక్రంవరకు మూడు కూటములు ఆజ్ఞాచక్రం పైనుండి తురీయకూటమి. తురీయకూటమిలో సాదాఖ్యాకళ అదే ధృవకళ, మహానిత్యాకళ ఉన్నది. ముప్పైఆరు తత్త్వాలు బిందువునుంచే ఏర్పడ్డాయి. విశ్వము అంటే శరీరము పదిహేనుకళలు, షోడశీకళ అయిన సాదాఖ్య కళనుంచి ఉద్భవించి మళ్ళీ అందులోనే కలిసిపోతున్నాయి.

**ఆధారే తరుణార్కబింబరుచిరం హేమప్రభం వాగ్భవం**
**బీజం మన్మథ మింద్రగోపసదృశం హృత్పంకజే సంస్థితం**
**రంధ్రే బ్రహ్మపదే చ శాక్తమపరం సోమప్రభా భాసురం**
**యే ధ్యాయంతి పదత్రయం తవశివే తే యాంతి సౌఖ్యంపదం॥**

మిశ్రమబిందువైన రవి బింబము ముఖంగాను, చంద్రాగ్నులు అనబడేశుక్ల రక్తబిందువులు స్తనయుగ్మంగాను గల పరదేవతను పుణ్యాత్ములు భజింతురుగాక. కల్పసూత్రములందుకూడా ఇదే విషయం చెప్పడింది.

**అగ్రబిందు పరికల్పితాననా బిందురచిత స్తనద్వయీాం**
**నాదబిందురశనా గుణాప్పదాం నౌమితే పరశివాం పరాంకళాం।**

---

# దేవతకు తత్త్వాత్మకము

**19. విద్యాపి తాదృగాత్మా సూక్ష్మా సా త్రిపురసుందరీ దేవీ**
**విద్యావేద్యాత్మకయో రత్యంతా భేద మామనం త్యార్యాః**

చిదానందస్వరూపిణి, స్వచ్ఛప్రకాశ రూపముగల ఆ త్రిపురసుందరీ దేవి సకలతత్త్వాలకు అతీతమైనది. అందుచేత మంత్రానికీ, మత్రాధిదేవతకు భేదము లేదు.

ఆ పరాత్పరి మూర్తిత్రయము, బీజత్రయము, శక్తిత్రయము, తేజస్త్రయములకు ముందున్నది కాబట్టి 'త్రిపురా' అనీ, లోకోత్తరమైన సౌందర్యముకలది కాబట్టి 'త్రిపురసుందరి' అనీ చెప్పబడుచున్నది.

ఆత్మ అనబడే పరమేశ్వరుని వలన పంచభూతములు, వాటినుంచి సకలతత్త్వములు ఉద్భవించి, తిరిగి ఆత్మలోనే లీనమవుతున్నాయి. కాబట్టి ఈ పరాశక్తి ఆత్మస్వరూపిణి. శ్రీవిద్యలో ప్రధానమైనవి పంచదశీ, షోడశీమహామంత్రాలు. వీటికి లలిత, రాజరాజేశ్వరి అధిదేవతలు. గతంలో పంచదశీ మహామంత్రము వివరించటం జరిగింది. ఇప్పుడు షోడశి మహామంత్రాన్నివివరించటం జరుగుతోంది.

**1. షోడశాక్షరీ మహామంత్రం :-**

శ్రీవిద్య పూర్ణదీక్షలో ప్రధానమైనది షోడశాక్షరీ మహామంత్రం. దీనినే శుద్ధవిద్య అని కూడా అంటారు. అయితే శుద్ధవిద్య అనే విద్య ఇంకొకటి కూడా ఉంది. దీనికి సదాశివుడు ఋషి. గాయత్రి ఛందస్సు. దీనిలో మూడు బీజాక్షరాలు మాత్రమే ఉంటాయి. దీని మంత్రం : ఐం ఈం ఔం ః ॥

**కామరాజ మంత్రాంతే శ్రీ బీజేన సమన్వితా**
**షోడశాక్షరీ విద్యేయం శ్రీవిద్యేతి ప్రకీర్తితా ॥॥**

మన్మధుడుపాసించిన పంచదశీమహామం(ం)త్రుకి చివర 'శ్రీం' బీజాన్ని చేర్చినట్లైతే షోడశాక్షరి అవుతుంది. అనగా షోడశాక్షరీ మ ం :-

క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । శ్రీం ॥

లక్ష్మీధరులు,భాస్కరాచార్యులు,కూడా దీనిని సమర్థించారు. కాని పంచదశీ మహామంత్రానికి చివర 'ఈం' బీజం చేర్చినట్లైతే షోడశి అవుతుంది అని కొందరి వాదన. దీని ప్రకారం షోడశాక్షరీమంత్రం -

క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । ఈం ॥

కావ్యకంఠగణపతి మునివర్యులు తమ మహావిద్య సూత్రగ్రంధంలో

బ్రహ్మ (క) యోని (ఏ) శాంతి (ఈ) ఇంద్ర (ల) మాయా (హ్రీం) భి :
ఖ (హ) భృగు (స) బ్రహ్మ (క) ఖ (హ) ఇంద్ర (ల) మాయాహ్రీం భి :
భృగు (స) బ్రహ్మ (క) ఇంద్ర (ల) మాయా (హ్రీం) భిశ్చ
పంచదశీ ॥ రయో (శ్రీం) త్తరీయం షోడశీ ॥

మంత్రం : క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । శ్రీం ॥

అయితే ఇది కేవలం పదహారు అక్షరాల మంత్రం. అంతే కాని బ్రహ్మవిద్య మాత్రం కాదు. బ్రహ్మవిద్య అయిన షోడశాక్షరికి ఇరవైఎనిమిది అక్షరాలుంటాయి.

అష్టౌ బీజాక్షరాణ్యాద్యౌ పశ్చాత్పంచదశీ తతః
పంచబీజాక్షరాప్యేషా శ్రీమహాషోడశీమతా ॥

పంచదశీమహామంత్రానికి ముందు ఎనిమిది బీజాక్షరాలు, తరువాత ఐదుబీజాక్షరాలు కలిపినట్లైతే దాన్ని మహాషోడశి అంటారు. అది బ్రహ్మవిద్య.

శ్రీబీజ మాయా స్మర యోని శక్తి సర్వం చ మాయా కమలాత్మవిద్యా
శక్త్యాది బీజాని విలోమితాని శ్రీషోడశార్ణా : పరదేవతాయా : ॥

దీనిని బట్టి మహాషోడశి కి పదహారు అక్షరాలే ఉంటాయి. పంచదశీ మహామంత్రంలోని మూడుఖండాలను మూడు బీజాలుగా లెక్కపెడితే మొత్తంపదహారు అక్షరాలే అవుతాయి ఇది శ్రీవిద్యారహస్యము.త్రిపురాసిద్ధాంతం లో [illegible] (క్లీ

కమలా (శ్రీం) భువనేశానీ (హ్రీం) కామో [illegible]ం) వాగేశ్వరీ (ఐం)తతః
పరా (సౌః) చ ప్రణవః (ఓం) పశ్చాత్ భువనానామధీశ్వరీ (హ్రీం)
కమలా (శ్రీం) చాపి పూర్వోక్తా త్రికూటా (పంచదశి) పరమేశ్వరీ
పరా (సౌః) వాణీ (ఐం) రతీశ (క్లీం) శ్చ లోకేశీ (హ్రీం) విష్ణువల్లభా (శ్రీం)

దీనిని బట్టి పంచదశీ మహామంత్రానికి శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం అనబడే ఎ[illegible]ది బీజాక్షరాలు ముందు, సౌః ఐం క్లీం హ్రీం శ్రీం అనబడే ఐదు బీజాక్షరాలు తరువాత చెప్పినట్లైతే మహాషోడశి అవుతుంది. పంచదశీమహామంత్రాన్ని మూడు బీజాలుగా లెక్కపెట్టినట్లైతే మహాషోడశి పదహారు అక్షరాలు కల బ్రహ్మవిద్య అవుతుంది.

మంత్రం : - శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం । క ఏ ఈ ల హ్రీం।
హస క హ ల హ్రీం। స క ల హ్రీం । సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ॥

షోడశాక్షరీ మహామంత్రాన్ని దూర్వాస మహర్షి వ్రాసి దేవీ మహిమ్నస్తోత్రము అనే గ్రంథంలో కూడా నిరూపించటం జరిగింది.

శ్రీ మాత । స్త్రిపురే । పరాత్పరతరే । దేవీ । త్రిలోకీ। మహా
సౌన్దర్యార్ణవ మందనోద్భవ సుధా ప్రాచుర్యవర్ణోజ్వలాం
ఉద్యద్భాను సహస్ర నూతన జపాపుష్ప ప్రభంతే వపుః
స్వాస్తే మే స్ఫురతు త్రిలోకనిలయం - జ్యోతిర్మయం । వాఙ్మయం॥

శ్రీం (శ్రీం) మా (హ్రీం) త్రిపురే (క్లీం ఐం సౌః) ఈ(ఓం)
పరాత్పరే (హ్రీం శ్రీం), దేవీ, త్రిలోకీ (పంచదశీ) మహాసౌందర్యా
(సౌం ఐం క్లీం)ర్ణవ మథనోద్భవ సుధా ప్రాచుర్య వర్ణోజ్వలాం
ఉద్యద్భాను సహస్ర నూతన జపాపుష్ప ప్రభంతే వపుః (హ్రీం)
స్వాస్తే మా (శ్రీం) ఈ స్ఫురతుత్రిలోకనిలయం జ్యోతిర్మయం వాఙ్మయమ్॥

మంత్రం : శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం । క ఏ ఈ ల హ్రీం ।
హ స క హ ల హ్రీం। స క ల హ్రీం । సౌః ఐం క్లీం హ్రీం శ్రీం॥

2. మహాషోడశి - ప్రణవముః -

వైదికా ప్రణవైర్యుతా ప్రణవేన విహీనస్తు తాంత్రికా ఏవ ప్రకీర్తితా॥

అని చెప్పబడింది. అంటే ఓంకారము బీజముగాగల మంత్రాలే వైదికమంత్రాలు. అదే బ్రహ్మవిద్య. మరి షోడశీ మహామంత్రములో ఓంకారము లేదుకదా. అది వైదిక మంత్రము అందులోను బ్రహ్మవిద్య ఏరకంగా ఔతుంది.?

దేవీ పంచాసనాసీన. అనగా ఐదురకాల ఆసనములధిష్ఠించింది. అవి
1. పంచదిగాసనము 2.పంచకలాసనము 3. పంచభూతాసనము 4. పంచముఖాసనము 5. పంచప్రణవాసనము.

వీటిలో పంచప్రణవాలు అంటే శ్రీం హ్రీం క్లీం ఐం సౌః
ఈ పంచప్రణవాలు షోడశిమహామంత్రంలో అనులోమ విలోమాలుగా ఉంటాయి. మంత్రంలో ఒక ప్రణవం ఉంటేనే అది మనకు ముక్తిని ప్రసాదించే మహామంత్రం అయినప్పుడు, ఐదు ప్రణవాలు, అనులోమ,విలోమంగా ఉంటే, ఆమంత్రంయొక్క శక్తిని ఏవిధంగా వర్ణించగలుగుతాము? మహాషోడశిలో పంచప్రణవాలు అనులోమ విలోమంగా ఉన్నాయనేది శ్రీవిద్యారహస్యము.

3. షోడశీకళ:-

దర్శాద్యాః పూర్ణిమాం తాన్తకలాః పంచదశైవతు
షోడశీతుకలాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ॥

దర్శ మొదలు పూర్ణిమ వరకు ఉండే చంద్ర కళలు పదిహేను, పదహారవ కళ సాక్షాత్తు ఆ సచ్చిదానందరూపిణి అయి ఉన్నది. ఇదే సాదాఖ్యకళ. నాదబిందు కళాతీతమైనది. భగవతి మాతృకావర్ణ రూపిణి. అంటే యాభై అక్షరముల స్వరూపమై ఉన్నది. అక్షరాలలోని అకచటతపయశ వర్గులు ఎనిమిది, వశిన్యాది శక్తులతో కలిసి శ్రీచక్రంలోని శివశక్తి చక్రాలతో ఐక్యతపొందు తున్నాయి. అక్షరాలను ఒక్కొక్క ఖండానికీ పదహారు చొప్పున మూడు ఖండాలుగా చేశారు. ఆ మూడు ఖండాలు షోడశనిత్యతో తాదాత్మ్యం చెందుతున్నాయి. హకారము బైందవస్థానమందు, క్షకారము సర్వత్రవ్యాపించి ఉంటాయి. ఈ విషయాలను పంచదశీమహామంత్రంలో పూర్తిగా వివరించటం జరిగింది. బైందవస్థానానికి శ్రీచక్రము అని, సరఘ అని పేరు. సహస్రారంలో ఉండే చంద్రమండలమే సరఘ. ఇదే పదహారవకళ అయిన సాదాఖ్య కళ సహస్రారంలో ఉండే చంద్రుడు నిత్యకళాయుక్తుడు. ఆ చంద్రమండలంలోనే పరాత్పరి ఉంటుంది. ఆమె పాదోదకము అమృతమయము. అది శరీరంలోని డెబ్భైరెండు వేల నాడీమండలాన్నీ తడుపుతున్నది. గౌడపాదెలవారి సుభగోదయస్తుతిలో

ఇమాస్తాః షోడశ్యాస్తవసుచ సరఘాయాం శశికళా
స్వరూపాయాం, లీనా నివసతి తవశ్రీ శశికళా ।
అయం ప్రత్యాహారః శ్రుత ఇహ కళా వ్యంజనగణః
కకారేణాకారః స్వరగణ మశేషం కథయతి॥

కౌళ, సమయమతాలు పూర్తిగా తెలిసిన విజ్ఞులు, కౌళమతస్థులు వివేక శూన్యులని, పామరులని అంటారు. పండితులందరూ సహస్రారంలో శివాశివుల రూపంలో ఉన్న 16వ నిత్యనే ఆరాధిస్తారు. సుధాసింధువు మధ్యన ఉన్న ఆకళయే చంద్రకళ, సాదాఖ్యకళ. ఆమెయే భగవతి.

అతస్తే కౌలాస్తే భగవతి దృఢ ప్రాకృత జనా
ఇతిప్రాహుః ప్రాజ్ఞాః కులసమయ మార్గద్వయవిధః
మహాంతః సేవంతే సకలజననీం బైందవగృహే
శివాకారాం నిత్యామమృత ఝరికా మైందవకళామ్

సహస్రారంలో గల చంద్రమండలమే శ్రీచక్రము. ఇది షోడశకళాత్మకము సహస్రదళకమలంలో శ్రీ చక్ర స్వరూపమైన చంద్రబింబానికి మధ్య ఆ దేవి ఉంటుంది. అందుకనే లలితా సహస్రంలో దేవి చంద్రమండలమధ్యగా అని చెప్పబడింది. ఆమె పాదోదకము అమృతమయము. అది శరీరంలోని 72 000 నాడీ మండలాన్నీ తడుపుతున్నది.

శిరస్సు నందు చంద్రమండలమున్నదని యోగశాస్త్రాలన్నీ చెబుతున్నాయి. దీన్నే శ్రీచక్రం అంటారు. చంద్రమండలం 16 కళలతో కూడినదవటంచేత, శ్రీ విద్యలో పాడ్యమి మొదలయిన తిథుల వృద్ధిక్షయాలను చెప్పటంచేత, శ్రీవిద్యయే చంద్రమండలమవుతున్నది. ఇది సమయమత రహస్యము.

సమయములకు షట్చక్రపూజ నియతంకాదు. వారికి సహస్ర కమలమందే పూజ. అంటే సహస్రకమలము బైందవ స్థానంగాను దాని మధ్యలో ఉన్న చంద్రమండలము చతుష్కోణము గాను, దాని మధ్యలో ఉన్న బిందువు 25 తత్త్వములకు అతీతమైన 26వ తత్త్వము, శివశక్తుల మేళన రూపమయిన సాదాఖ్య కళ అని చెప్పటం జరిగింది. అందుకనే సమయ మతంలో బాహ్యపూజలేదు.చతుర్విధైక్య సంధానము లేదా షడ్విధైక్య సంధానమే భగవతికి సపర్య. ఈ సపర్యకు సాదాఖ్య తత్త్వధ్యానైకనిష్ఠ కావాలి. సాదాఖ్య అని పిలువబడేది సహస్రారంలో ఉండే చంద్రకళ.

శ్రీచక్ర రూపమైన చంద్రబింబంలో ఒకేకళ ఉన్నది. అది పరమాకళ. ఆజ్ఞాచక్రంలో ఉన్న చంద్రుడికి పదిహేను కళలున్నాయి. పదహారవది పరమాకళ. ఆజ్ఞాచక్రంలో ఉండే చంద్రుని కన్న భిన్నమైన చంద్రుడు సహస్రారంలో ఉన్నాడు. అదే బైందవస్థానము. సుధాసింధువు. సరఘ అని పిలవబడుతోంది. కాబట్టి సమయులు సహస్రారంలోనే దేవిని పూజించాలి. అక్కడ ఉన్న బిందువు శివశక్తుల రూపమైన సాదాఖ్య అని పిలవబడే ఇరవైఆరవ తత్త్వము. అదే పరబ్రహ్మమహిషి.

ఆజ్ఞాచక్రం చంద్రకళలు ఉండే స్థానము. సహస్రారం చంద్రమండలము. ఇక్కడ చంద్రుడు నిత్యకళాయుక్తుడు. అదే శ్రీచక్రము. శ్రీచక్రముయొక్క నాలుగు ద్వారాలలోను మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు అనే నాలుగు తత్త్వాలున్నాయి. ఇవి భగవతి విశ్రమించే మంచానికిగల నాలుగుకోళ్ళు అంటారు. నాలుగు ద్వారాలు కలిగి కర్ణికా రూపంలో ఉన్న శ్రీచక్రంలోని చతుష్కోణము మధ్యగలబిందువునే సరఘ అంటారు. అదే శివశక్తుల సంగమస్థానం.

సాధకుడు కుండలినీ శక్తిని సహస్రారం చేర్చగలిగినట్లైతే పరదేవత సాక్షాత్కరిస్తుంది.

ఉపనిషత్తులలో షోడశీకళను గురించి ఈవిధంగా చెప్పటం జరిగింది.

ఈలోకంలో నదులు వివిధ పేర్లు కలిగి ఉన్నాయి. సముద్రంలోని నీరు సూర్యుని వేడికి ఆవిరై, మేఘాలుగా మారి, ఆమేఘాలు వర్షించి నదులు ఏర్పడతాయి. మళ్ళీ ఈ నదులన్నీ

సముద్రంలోకే చేరతాయి. అదేవిధంగా పరమాత్మ షోడశకళాస్వరూపుడు. అతనినుండె అవ్యక్తము, మహత్త్వము అహంకారము, మనస్సు ప్రాణములు, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు అనబడే పదిహేను ఉద్భవించి తిరిగి ఆత్మలో లయమవుతున్నాయి. పురుషుడు షోడశకలలు కలవాడు.

| | | |
|---|---|---|
| ప్రాణము | - | జలమయము |
| మనస్సు | - | అన్నమయము |
| వాక్కు | - | తేజోమయము |

అన్నంలేకుండా కొంతకాలంపాటునీరుత్రాగి బ్రతకవచ్చు. కాని అన్నంతినకపోతే మనస్సు క్షీణిస్తుంది. మనసుపనిచేయకపోతే జ్ఞానం నశిస్తుంది. కొద్దిగా జ్ఞానమున్నప్పటికీ దాన్ని వృద్ధి చెయ్యటంవలన మానవుడు సర్వజ్ఞుడౌతాడు. పరమేశ్వరునిలోగల పదహారు కళలలోను జ్ఞానము శ్రేష్టమైనది. అది అన్నముచేతనే వృద్ధిపొందుతుంది.

ఈషోడశకళలకు సంవత్సరము అనేది కాలస్వరూపంలోగలపేరు. సంవత్సరానికి షోడశకళలు అవయవాలు. వాటిలో షోడశీకళ ధృవకళ. షోడశీకళ రాత్రులచేతనే వృద్ధిక్షయములు పొందుతున్నది. శుక్లపక్షరాత్రులందు వృద్ధిపొంది పౌర్ణమి అవుతుంది అలాగే కృష్ణపక్షరాత్రులలో క్షీణించి అమావాశ్య అవుతుంది. అమావాశ్యరోజున ధృవకళ మాత్రమే ఉంటుంది. ఆధృవకలయే పరమాత్మ.

**4.మహావాక్యము:-**

పరబ్రహ్మస్వరూపాన్ని ఈవిధంగా వర్ణిస్తున్నారు.

'యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ
స్వాద్వస్వాదు విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితం"

ఏవస్తువుచేత సకలము చూపబడుచున్నదో, వినబడుచున్నదో, ఆఘ్రాణించబడుచున్నదో, వాక్కు ఉచ్చరింపబడుచున్నదో, ఆవస్తువే ప్రజ్ఞానము. అదే బ్రహ్మస్వరూపము.

'చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వః గజాదిషు
చైతన్య మేకం బ్రహ్మేతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి'

బ్రహ్మేంద్రాది దేవతలయందు, మనుష్యులయందు, ఏనుగులు, గుర్రాలు మొదలైన జంతువులందు చైతన్యస్వరూపమైనబ్రహ్మ ఒకే రూపంలో ఉన్నది. అందువలన చైతన్య రూపమయిన ఆ బ్రహ్మ వాయందే కాక ఉత్తములైన దేవతలయందు, మధ్యములైన మానవులయందు, అధమమైన జంతువులయందు, చరాచర జగత్తునందుకూడా ఉన్నాడు. వీటన్నిటిలోను ఉన్న చైతన్యమే బ్రహ్మస్వరూపము.

'పరిపూర్ణః పరాత్మా ऽస్మిన్ దేహేవిద్యాధి కారిణీ
బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహ మితీర్యతే'

దేశకాల వస్తు బేదములు లేనటువంటి పరమాత్మ, మాయచేత సృష్టించబడిన ఈజగత్తులో మానవ దేహమందు బుద్ధి అనబడే సూక్ష్మ శరీరానికి సాక్షిగా ఉంది అహమని చెప్పబడుతున్నాడు.

'స్వతః పూర్ణః పరాత్మా త్ర బ్రహ్మశబ్దేన వర్ణితః
అస్మిత్యైక్య పరామర్శ స్తేన బ్రహ్మ భవామ్యహమ్'

దేశకాల భేదములు లేనటువంటి పరమాత్మయే బ్రహ్మము. ఆత్మబ్రహ్మకు జీవబ్రహ్మకూ భేదము లేదు.

'ఏకమేవాద్వితీయం సన్నామరూపవివర్జితం
సృష్టేః పురో ऽధునాప్యస్యతా దృక్త్వం తదుదీర్యతే'

సృష్టికి పూర్వము స్వగతాది భేదరహితమై, నామరూపములు లేనివస్తువు సృష్టి అనంతరకాలంలో కూడా ఒకే అకారంలో ఉన్నది.

'శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్ర త్వం పదేరితం
ఏకతాగ్రాహ్యతే ऽ సీతి తదైక్య మనుభూయితా.'

పరమాత్మకు, దేహేంద్రియాలకు సాక్షిగా ఉన్నప్రత్యగాత్మకు భేదములేదు. ముముక్షువులు పరమాత్మ ప్రత్యగాత్మల ఏకీభావనవలన సుఖమనుభవించుచున్నారు.

'దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వమీర్యతే
బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మ రూపకమ్'

కళ్ళకు కనిపిస్తున్న సకలజగత్తుకు ఏది అధిష్టాన కారణముగా ఉన్నదో, ఏది సచ్చిదానంద లక్షణములు కలిగి ఉన్నదో ఆవస్తువే పరబ్రహ్మము.

అంటే ఈ చరాచర జగత్తుయొక్క సృష్టి, స్థితి, లయాలకు మూలకారణమైనది, ఆదిమధ్యాంత రహితమైనది, సమస్త ప్రాణికోటికీ జీవనాధారమైనది అయిన వస్తువే పరబ్రహ్మము.

విద్యాపాదంలో మంత్రశాస్త్రం గురించి కొంతవరకైనా అవగాహన రావటానికి ఈ క్రింది విషయాలను గురించి తెలుసుకోవలసి ఉన్నది.

**5.షడామ్నాయాలు** :- ఆమ్నాయము అంటే సంప్రదాయము అని అర్థం ఒకేరకమైన మంత్రాలన్నింటినీ ఒకే సంప్రదాయంలో చేర్చి, దానిని ఆమ్నాయము అన్నారు. ఆమ్నాయ

మంత్రాలన్నీ పరమేశ్వరుని ముఖంనుంచే వచ్చినాయి. పరమేశ్వరుడు ఐదురూపాలుగా ఉన్నాడు. ఆరూపాలే పంచబ్రహ్మలు వారు వరుసగా

1. సద్యోజాత 4. తత్పురుష
2. వామదేవ 5. ఈశానులు
3. అఘోర

ఈరకంగా పంచబ్రహ్మలస్వరూపమే ఆ దేవి. అందుకే ఆమెను పంచబ్రహ్మస్వరూపిణి అన్నారు. ఆ పరాత్పరి పంచప్రేతా సనాసీన అనికూడా చెప్పబడుతోంది. ఈ పంచబ్రహ్మల స్వరూపంలోనే పరమేశ్వరుడు మంత్రశాస్త్రాన్ని చెప్పాడు. షడామ్నయాల్లు ఈక్రింది విధంగా ఉన్నాయి. వీటి వివరాలు తంత్రసారము, దుద్రయామళము మొదః ్రగంధాలలో ఇవ్వబడినాయి.

దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనంతుదైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం, బ్రాహ్మణోమమదేవతా॥

ఈ చరాచర జగత్తు అంతా కూడా దైవముయొక్క అధీనంలో ఉన్నది. ఆ దైవం మంత్రానికి అధీనం అయిఉన్నది. ఆ మంత్రము బ్రాహ్మణునకు అధీనం అయి ఉన్నది. అందుకనే బ్రాహ్మణుని భూసురుడు అన్నారు. ప్రతిఫలాపేక్ష లేకుండా లోకకల్యాణం కోసం జపం చేసేవాడు బ్రాహ్మణుడు ఒక్కడే. అందుకనే భూలోకంలో బ్రాహ్మణు ప్రత్యక్ష దైవంగా చెప్పబడుతున్నాడు. మననాత్త్రాయత ఇతిమంత్రః

దేవతల దయకుపాత్రులుకావాలి అంటే మంత్రజపంచెయ్యాలి, దీనినే ఉపాసన అంటారు. అరణి మథిస్తే అగ్ని ఎలాపుడుతుందో, అలాగే మంత్రజపంచేస్తే శక్తి పుడుతుంది,ఒకేమాటని, లేదా పదాన్ని పదేపదే ఉచ్చరించటంవల్ల శక్తి ఉద్భవిస్తుంది, ఆశక్తి సాధకుని సర్వకార్యాలు నెరవేరుస్తుంది. అయితే బీజాక్షరాలచేతసంపుటంచేయబడిన మంత్రజపంవల్ల దేవతల అనుగ్రహం త్వరగాకలుగుతుంది, సంస్కృతభాషకు ఉన్న యాభై అక్షరాలనూ యాభై బీజాలుగా గుర్తించాలి. ఇవేకాకుండా సంయుక్తాక్షరాలను కూడాబీజాలుగా వ్రాయటంజరుగుతుంది. ఈ రకంగా బీజాక్షరాలు అనేకం ఉన్నాయి. ఈబీజాక్షరాలకు ప్రతిదానికీ విడివిడిగా కొంతశక్తి ఉంటుంది. ఆ విషయం బీజాక్షరనిఘంటువుచూచినట్లైతే తెలుస్తుంది, అటువంటిశక్తిగల బీజాక్షరాలు కొన్నింటిని సాధకుడి కోరికను అనుసరించి సంపుటీకరణం చేస్తారు. ఆరకమైన మంత్రసాధనవల్ల సాధకుడి కోరికలు త్వరగా తీరుతాయి.అయితే దేవతల ఉపాసన చేసేటప్పుడు ఆదేవతలతత్త్వాలకు సాధకుని కోర్కెలకు అనుగుణంగా బీజాక్షరాలు చెప్పబడతాయి,దీన్నే సంపుటీకరణ అంటారు. ఐం వాగ్బీజము, క్లీం మన్మథబీజము. ఈ

రకంగా దేవతలకేకాకుండా పంచభూతాలకు కూడాబీజాలున్నాయి, అవి లం పృథివీ బీజము, హం ఆకాశ బీజము, యం వాయుబీజము, రం అగ్ని బీజము, వం అమృత బీజము. అసలుమంత్రాలను మూడు రకాలుగావిభజించవచ్చు.

1.వైదికములు. 2 .తాంత్రికములు 3 అపభ్రంశములు

1. వైదిక మంత్రాలు :- ఇవి జ్ఞానప్రదాలు ముక్తి కారకాలు

2. తాంత్రికములు :- కేవలం కామ్యప్రదమైన మంత్రాలను తాంత్రికాలు అంటారు

3. అపభ్రంశములు :- సంస్కృతభాషలో కాకుండా ఇతర భాషలలో ఉన్న మంత్రాలను అపభ్రంశాలు అంటారు. మళయాళమంత్రాలు, హిందీ,తెలుగు, పార్శీమంత్రాలు, పాము, తేలుమంత్రాలు ఇలాటివే.

వైదికాప్రణవైర్యుతాః ప్రణవేనవిహీనాస్తు తాంత్రికాటవ ప్రకీర్తితాః ।

అంటే ఓంకారసహితమైనవి వైదికమంత్రములు. ఓంకారములేనివి తాంత్రికాలు. మంత్రాలను1స్త్రీ, 2 పురుష,3 నపుంసక మంత్రాలు అని మూడు రకాలుగాచెప్పవచ్చు.

| | |
|---|---|
| స్వాహా అనేపదం చివరకలవి | స్త్రీ మంత్రాలు |
| హుంఫట్ అనే పదం చివరకలవి | పురుష మంత్రాలు |
| నమః అనే పదం చివరకలవి | నపుంసక మంత్రాలు |

స్త్రీ దైవత్యాస్తు విద్యాస్స్యుః మంత్రాః పుందేవతా స్స్మృతా

పురుషదేవతలనుపాసించేవాటిని మంత్రాలని, స్త్రీదేవతలనుపాసించే మంత్రాలను 'విద్య' అని అంటారు. వీటిలో

మంత్రా ఏకాక్షరాః పిండాః కర్తర్య స్త్ర్యక్షరా మతాః
వర్ణత్రయం సమారభ్య నవార్ణావధిబీజకాః
తతో దశార్ణ మారభ్య యావద్వింశతి మంత్రకాః
అత ఊర్ధ్వం గతా మాలా స్తాసు భేదో న విద్యతే.

| | | |
|---|---|---|
| ఒక అక్షరములు కలమంత్రాలను | - | పిండము |
| మూడు అక్షరములు కలమంత్రాలను | - | కర్తరులు |
| 3 నుంచి9 వరకు అక్షరములు కలమంత్రాలను | - | బీజములు |
| 10-20 వరకు అక్షరము కలవాటిని | - | మంత్రము |
| 20 కన్న ఎక్కువ అక్షరములు కలవాటిని | - | మాలామంత్రము అంటారు |

ఆమ్నాయమంత్రాలన్నీ పరమేశ్వరుని ముఖంనుంచేవచ్చినాయని

చెప్పబడుతోంది,పరమేశ్వరుడుఐదురూపాలుగా ఉన్నాడు. ఆరూపాలే పంచబ్రహ్మలు. వారు 1.సద్యోజాత 2.వామదేవ 3.అఘోర 4.తత్పురుష 5.ఈశానులు. ఈరకంగాపంచబ్రహ్మలస్వరూపమే ఆదేవి.అందుకే ఆమెను పంచబ్రహ్మ స్వరూపిణి అన్నారు. అమెపంచప్రేతాసనాసీన అనిచెప్పబడుతోంది ఈ పంచబ్రహ్మల స్వరూపంలోనే పరపశివుడు మంత్రశాస్త్రాన్నిచెప్పాడు. షడామ్నాయాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

## 1. పూర్వామ్నాయము

ఋగామ్నాయ మయం తత్ర పూర్వద్వారం ప్రకీర్తితం।
ఊర్మిణీనామ విఖ్యాతా ఋగామ్నాయాధిదేవతా॥

సద్యోజాతునిముఖంనుంచి వేదయుతమైన గాయత్రి మొదలైన రెండుకోట్ల మంత్రాలు వచ్చినాయి. ఇది పూర్వామ్నాయమము. ఋగ్వేద పూర్వకము. దీనికి అధిదేవత ఊర్మిణి

శుద్ధవిద్యా చ బాలా చ ద్వాదశార్థా మతంగినీ,
ద్విజత్వసాధనీ విద్యా గాయత్రీ వేదమాతృకా.
గాణాపత్యం కార్తికేయం మృత్యుజి న్నీలకంఠకం
త్ర్యంబకం జాతవేదాశ్చ తథా ప్రత్యంగిరాదయః
సద్యోజాతముఖోద్భూతా వైదికాస్తు ద్వికోటయః
ఏతాః కామగిరీంద్రస్థాః పూర్వామ్నాయస్య దేవతాః
గురుత్రయాదిపీఠాంతం చతుర్వింశత్సహస్రకం,
ఏతదావరణో పేతం పూర్వామ్నాయం భజామ్యహం.
మూలాధారే భజస్మా త్రే పూర్వామ్నాయ మనూన్ ప్రియే.

## 2. దక్షిణామ్నాయము

తత్రైవ దక్షిణం ద్వారం యజురామ్నాయ రూపకం।
భోగినీనామ సా దేవీ దక్షిణామ్నాయ దేవతా॥

వామదేవుని ముఖంనుండి శైవాగమాలయిన కోటి మంత్రాలువచ్చినాయి. ఇది దక్షిణామ్నాయము యజుర్వేద పూర్వకము దీనికి అధిదేవత భోగిని

సౌభాగ్యవిద్యా బగళా వారాహీ పటుక స్తథా
శ్రీతిరస్కరిణీ ప్రోక్తా మహామాయా ప్రకీర్తితా,
అఘోరం శరభం ఖడ్గరావణం వీరభద్రకం.
కాద
రౌద్రం శాక్తం పాశుపత ృ్యప్ర్రశస్త్రాదిభైరవం,
దక్షిణామూర్తిమంత్రాద్యా శ్శైవాగమ సముద్భవాః
వామదేవముఖోద్భూతాః కోటిమంత్రా వరాననే,
పూర్వపీఠస్థితా దేవి దక్షిణామ్నాయదేవతాః
ద్విసహస్రంతు దేవ్యస్తాః పరివారసమన్వితాః
భైరవాదిపదద్వంద్వం భజే దక్షిణ ముత్తమం
స్వాధిష్ఠానే స్మరేద్దేవి దక్షిణామ్నాయ ముత్తమం.

## 3. పశ్చిమామ్నాయము

సామ వేదమయం చాత్ర పశ్చిమద్వార మీరితం।
కుబ్జికాఖ్యా మహాదేవి పశ్చిమద్వార దేవతా॥

అఘోరునిముఖంనుండి పశ్చిమామ్నాయమైన వైష్ణవాగమాలుకోటి మంత్రాలు వచ్చినాయి. సామవేద పూర్వకమయిన పశ్చిమామ్నాయానికి అధిదేవత కుబ్జిక

లోపాముద్రా మహాదేవీ అంబా చ భువనేశ్వరీ
అన్నపూర్ణా కామకలా సర్వసిద్ధి ప్రదాయినీ,
సుదర్శనం వైనతేయం కార్తవీర్యం నృసింహకం.
నామత్రయం రామమంత్రం గోపాలం సౌరమేవ చ,
ధన్వంతరం చేంద్రజాలమింద్రాది సురమంత్రకం.
దత్తాత్రేయం ద్వాదశాష్టౌ వైష్ణవాగమచోదితాః.
అఘోరముఖసంభూతాః మదంశాః కోటిసంఖ్య కాః.
ఏతా జాలంధ్ర పీఠస్థాః పశ్చిమామ్నాయదేవతాః.
దూత్యాది చ చతుష్షష్టిః సిద్ధాంతం త్రిసహస్రకం.
ఆమ్నాయం పశ్చిమం వందే సర్వదా సర్వకామదం,
మణిపూరేస్మరేద్దేవి పశ్చిమామ్నాయజం మనుం.

## 4. ఉత్తరామ్నాయము

అథర్వణమయం తద్వ దుత్తరామ్నాయ మీరితం।
కాళికాఖ్యా మహాదేవీ ఉత్తరద్వార దేవతా॥

తత్పురుషునిముఖం నుంచిశ్రీవిద్యాఖ్యమైన ఉత్తరామ్నాయ మంత్రాలు రెండు కోట్లువచ్చినాయి. అథర్వణవేద పూర్వికమయిన ఉత్తరామ్నాయానికి అధిదేవత కాళిక.

తురీయాంబా మహార్ధా చ అశ్వారూఢా తథైవ చ.
మిశ్రాంబా చ మహాదేవీ శ్రీమద్వాగ్వాదినీ అపి.
దుర్గా కాళీ దహచ్చండీ నకులీ చ పుళిందినీ,
రేణుకాలక్ష్మివాగీశౌ మాతృకాద్యాస్స్వ యంవరా.
పంచామ్నా యసమోపేతం శ్రీవిద్యాఖ్యం మదంశజం,
ముఖాత్తత్పురుషాజ్జాతా ద్వికోటీమంత్రనాయకాః.
ఏతాశ్చోర్ధ్వానపీఠస్థాశ్శాక్తాగమ సముద్భవాః
ద్విసహస్రస్తు దేవ్యస్తాః పరివారయుతాః ప్రియే.
ముద్రాదినవకం చైవ సిద్ధానాం నవకం తథా,
వీరావళీ చ నవకం భజేదామ్నాయ ముత్తమం.
అనాహతాబ్జే స్మర్తవ్య ముత్తరామ్నాయ ముత్తమం.

## 5. ఊర్ధ్వామ్నాయము

చతుర్వేదమయః సాక్షాదూర్ధ్వామ్నాయస్సమీరతః।
ఊర్ధ్వామ్నాయస్య సంప్రోక్తా దేవతా చండ భైరవీ॥

ఈశానుని(శివుని)ముఖం నుంచిఆత్మానంద ప్రదాయకమైన కోటిమంత్రాలువచ్చినాయి.ఇది ఊర్ధ్వామ్నాయము. చతుర్వేద సమన్వయము. దీనికి అధిదేవత చండభైరవి.

పరాపరా చ సా దేవీ పరా శాంభవమేవ చ.
ప్రాసాదం దహరం హంసం మహావాక్యాదికం పరం,
పంచాక్షరం మహామంత్రం తారకం జన్మతారకం.
ఈశానముఖసంభూతా స్స్వాత్మానంద ప్రదాయకాః.
కోటిసంఖ్యా మహాదేవి మద్రూపాస్సర్వసిద్ధిదాః,

ఏతాశ్శాంభవపీఠస్థా స్సహస్ర పరివారితాః,
ఆరాధ్య మాలినీపూర్వం మండలాంతం తథైవ చ.
సాయుజ్య హేతుకం నిత్యం వందే చోర్ధ్వకలాత్మకం,
ఊర్ధ్వామ్నాయస్య చ మనూనాజ్ఞాంతే తు విభావయేత్.
పూర్వశ్చ పశ్చిమశ్చైవ దక్షిణశ్చోత్తర స్తథా।

## 6. అనుత్తరామ్నాయము

ఊర్ధ్వామ్నాయశ్చపంచైతే మోక్షమార్గాః ప్రకీర్తితాః।
ఊర్ధ్వత్వాత్సర్వధర్మాణామూర్ధ్వామ్నాయః ప్రశస్యతే।
ఊర్ధ్వామ్నాయం విజానీయా త్సాక్షా న్మోక్షైకసాధనమ్।
పూర్వామ్నాయః సృష్టిరూపః స్థితిరూపశ్చ దక్షిణః ।
సంహారః పశ్చిమోదేవి తిరోధాన స్తథోత్తరః।
ఊర్ధ్వామ్నాయ స్తతోదేవి తథానుగ్రహరూపకం।
అనుత్తరా పరాంబా సా శ్రీమత్త్రిపురసుందరీ॥

కాగా అనుత్తరామ్నాయ మంత్రాలు సాక్షాత్తు పరమేశ్వరుని ముఖంనుంచే వచ్చినాయి. ఈరకంగా శివుని ముఖంనుంచి ఏడుకోట్లమంత్రాలువచ్చినాయి.వీటన్నింటినీ శంకరభగవత్పాదులవారు ప్రపంచసార సంగ్రహంలో నిక్షిప్తంచేశారు

ఊర్ధ్వ శ్రీపాదుకా పూర్వం చరణాంతం గురోః క్రమాత్
స్మర్తవ్యా పాదుకా పూర్వం చరణం తదనంతరం,
పంచాంబా నవనాథాంబా మూలవిద్యా తతఃపరం
ఆధారవిద్యాషట్కం చ పునరంఘ్రిద్వయం క్రమాత్,
శాంభవీ చాథ హృల్లేఖా సమయాపరబోధినీ.
కౌళపంచాక్షరీ పంచ దళార్ణా ను త్తరాత్మికా,
షోడశీ పూర్తివిద్యా చ మహాత్రిపురసున్దరీ.
పశ్చాదనుత్తరం వందే పరబ్రహ్మస్వరూపిణీం.
అనుత్తరామ్నాయమనూన్మండలాంతం యథాక్రమం,
సప్తకోటిమహామంత్రాన్ ద్వాదశాంతే సదాస్మరేత్.
శుచిర్వాప్యశుచిర్వా ఽపి గచ్ఛన్తిష్ఠన్ స్వపన్నపి,
మంత్రైకశరణో విద్వాన్మనసా ఽపి సదా స్మరేత్.
తత్తత్సిద్ధ్యై చ సాహస్రం జపేత్సాధకపుంగవః.

తంత్రాలు :-

చతుష్షష్టిశ్చతంత్రాణి మాతృణా ముత్తమానిచ
మహామాయాశంబరంచ యోగినీ జాలశంబరమ్
తత్త్వశంబరకం చైవ భైరవాష్టక మేవచ
బహురూపాష్టకంచైవ యమళాష్టకమేవచ థా
చంద్రజ్ఞానం మాలినీంచ మహాసమ్మోహన
వామజ్ఞం మహాదేవం వాతులం వాతుల ॥
హృద్భేద తంత్ర భేదంచ గుహ్య ॥ కం చకామికవ్
కలావాదంకలాసారం తథాన్యత్ కుండికామ
మతోత్తం చ వీణాఖ్యాం త్రోతలం త్రోతలోత్తర
పంచామృ రూపభేదం భూతోడ్డామరమేవచ ॥
కులాసారం కులోడ్డీశం కులచూడామణిస్తథా
సర్వజ్ఞానోత్తరం చైవ మహాకాళీమతం తథా ॥
అరుణేశం మోదినీశం నికుంతేశ్వర మేవ ॥
పూర్వపశ్చిమ దక్షంచ ఉత్తరంచ నిరుత్తర ॥
విమలంవిమలోత్థంచ దేవీమత మతః పరమ్

ఈరకంగా అరవైనాలుగు తంత్రాలు పార్వతీదేవిని గూర్చి చెప్పబడ్డాయి. ఇవన్నీ అవైదికములు, నీతి బాహ్యములు. ఇవి లోకంలో మహాజ్ఞానులైన విద్వాంసులను కూడా వంచించి భ్రష్టులను చేస్తాయి. ఆ తంత్రముల వివరణ :-

**1. మహామాయాశాంబరము :-**

మాయా ప్రపంచాన్ని నిర్మింపచేసే తంత్రము. అనగా ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు కనిపిస్తుంది.

**2. యోగినీజాలశాంబరము :-**

ఇదికూడా మాయాప్రధానమైన విద్యయే.

**3. తత్త్వశాంబరము :-**

ఇది ఇంద్రజాల, మహేంద్రజాల విద్యలకు సంబంధించి నది.

**4- 11 భైరవాష్టకము :-**

ఇవి మొత్తం ఎనిమిది తంత్రాలు.

| | |
|---|---|
| 1. సిద్ధ భైరవ | 5. కంకాళ భైరవ |
| 2. వటుక భైరవ | 6. యోగినీ భైరవ |
| 3. కాల భైరవ | 7. మహా భైరవ |
| 4. కాలాగ్ని భైరవ | 8. శక్తి భైరవ |

ఇవన్నీ కూడా నిధి నిక్షేపాలను కనుగొనటానికి ఉపయోగిస్తాయి.

**12-19. బహురూపాష్టకము :-**

ఇవిఎనిమిది రూపములు గల శక్తి తంత్రములు. అవైదికములు.ఆశక్తులు వ సగా

| | |
|---|---|
| 1. బ్రాహ్మి | 5. వారాహి |
| 2. మహేశ్వరి | 6. మాహేంద్రీ |
| 3. కౌమారి | 7. చాముండీ |
| 4. వైష్ణవి | 8.మహాలక్ష్మి |

**20-27 యమళాష్టకము :-**

కామసిద్ధాంబకు యామళ అని పేరు. కామసిద్ధాంబ ప్రతిపాదితమై త్ర్రాలకు యామళాష్టకమని పేరు. ఇవి వైదిక మార్గ దూరములు. భైరవ యామళము, రు యామళము మొదలైనవి ఇందు చెప్పబడ్డాయి.

**28. చంద్రజ్ఞానము :-**

ఇది కాపాలిక మతసంబంధమైనది. సమయాచార సంబంధమైన చంద్రజ్ఞాన విద్యకాదు.

**29. మాలినీ తంత్రము :-**

దీనిని మాలినీవిద్యా త మ్రు అనికూడా అంటారు. సముద్రయానమునకు ఉపయోగిస్తుంది.

**30. మహాసమ్మోహనము :-**

మేల్కొన్న వారిని నిద్రపోయినట్లుగా మైకంలో ముంచెత్తగలదు. 14 సం॥ బా నాలుకను కోసి ఈ విద్య సాధించాలి. పూర్తిగా అవైదికము.

**31,32. వామజుష్ట, మహాదేవ తంత్రములు :-**

ఇవి వామాచారానికి సంబంధించినవి.

**33,34,35:- వాతుల, వాతులోత్తర, కామికా తంత్రములు :-**

వీటిలో ఆకర్షణ మొదలైన ప్రక్రియలున్నాయి. ఇవి కొంత భాగము వైదికము,తక్కినది అవైదికము.

**36. హృద్భేద తంత్రము :-**

దీనిలో షట్చక్రభేదనము, సహస్రార ప్రదేశము చెప్పబడినవి. ఇది వామాచారపద్ధతిలో ఉన్నది.

**37,38. తంత్రభేదము, సహ్య తంత్రము :-**

వీటిలో మారణ విద్యలు చెప్పబడినవి.

**39. కళావాద తంత్రము :-**

ఇందులో చంద్రకళల ప్రతిపాదన చెప్పబడింది. అయినను, పరదారాగమ నాదులను ఉపదేసించినదగుటచే నిషిద్ధము.

**40. కళాసార తంత్రము :-**

దీనిలో వర్ణముల అధిక్యత గురంచి చెప్పబడినది. వామాచార ప్రవృత్తికము.

**41. కుండికామతము :-**

ఇది ఘటికా సిద్ధి హేతువైనది. ఘటిక అంటే పానపాత్ర.

**42. మతోత్తరము :-**

దీనిలో రససిద్ధి చెప్పబడింది.

**43. వీణాఖ్య తంత్రము :-**

వీణ అనేది ఒక యక్షిణి పేరు. అది సిద్ధిస్తుంది కాబట్టి దీనిని వీణాఖ్య తంత్రము అంటారు. దీన్ని సంభోగయక్షిణి అని కూడా అంటారు.

**44. త్రోతల తంత్రము :-**

దీనిలో ఘటిక (పానపాత్ర) సిద్ధి, అంజన సిద్ధి, పాదుకా సిద్ధి చెప్పబడ్డాయి.

**45. త్రోతలోత్తరము :-**

అరవైనాలుగు వేల మంది యోగినుల దర్శనము చేయించునది.

**46. పంచామృత తంత్రం :-**

అమృతము, మృత్యులేమి గురించి చెప్పబడినది.

**47-51. రూపభేదము, భూతోడ్డారము, కుళాసారము, కలోడ్డీశము, కులచూడామణి :-**

ఈ ఐదు తంత్రములు మారణ హేతువులు.

**52-56. సర్వజ్ఞానోత్తరము, మహాకాళిమతము, అరుణేశము, మోదినీశము, వికుంతేశ్వరము:-**

ఇవి కాపాలిక, దిగంబర మతాలకు చెందినవి.

నిర

**57-64 పూర్వ, పశ్చిమ, దక్షిణ, ఉత్తర , ాత్రం, విమలము, విమలోత్థము, దేవీ మతము:-**

ఇవి దిగంబర, క్షపణిక మతాలకు చెందినవి.

ఈ తంత్రాలన్నీ కూడా ఐహికఫలాన్నే ఇస్తాయి. అవైదికములు, నీతి బాహ్యములు. కాబట్టి ఇవి పనికి రావు.

*7. ద్వాదశాంతము:-* బిందుస్థానాన్ని ద్వాదశాంతము అంటారు. ఆధారచక్రం దగ్గరనుండి లెక్కపెట్టినట్లైతే బిందువు పన్నెండవది అవుతుంది. అందుకే దాన్ని ద్వాదశాంతము అంటారు. దాని వివరాలు.

1. కులపద్మము మూలాధారానికి కొద్దిగా క్రింద ఉన్న సహస్రదళ పద్మము
2. అష్టదళపద్మము
3. షడ్దళపద్మము
4. మూలాధారము
5. స్వాధిష్ఠానము
6. మణిపూరము
7. అనాహతము
8. విశుద్ధము
9. విశుద్ధలంబికాగ్రము (అష్టదళము)
10. ఆజ్ఞాచక్రము
11. సహస్రకమలము
12. అకులపద్మము. (సహస్రార కర్ణిక)

ఇక్కడున్న సహస్రారకర్ణికనే బిందుస్థానమని చంద్రమండలమనీ అంటారు.

*8. మంత్రసారాంశము*

**గాయత్రీయంత్రము :-** ఈ మంత్రము బ్రాహ్మణుల కోసం చెప్పబడింది అని చెబుతున్నారు. దీనికి కారణము పూర్వకాలంలో చిన్నపిల్లలకు 5 నుంచి 8 సం॥లోపు వడుగుచేసి బ్రహ్మోపదేశము, గాయత్రీ ఉపదేశము ఇచ్చేవారు.

'జన్మనా జాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః"

అని చెప్పటం వలన అనాదినుంచే బ్రహ్మజ్ఞాన సాధనమైన విద్యనుపదేవించారని తెలుస్తోంది. గాయత్రీమంత్రము ఇది 1. స్థూలము 2. సూక్ష్మము అ ెండు రకాలు. వీటిలో ఇరవైనాలుగు అక్షరములతో, మూడుపాదములు కలిగిన మ ంత్ర ము స్థూలము. దీనిలో నాల్గవపాదము, శ్రీవిద్యా ప్రకరణము సూక్ష్మము. అందుచేతనే ఉపనయనము లఘుదీక్ష అని, శ్రీవిద్యా మంత్ర దీక్ష పూర్ణదీక్ష అని చెప్పబడింది. గాయత్రీ ఉపాసన ప్రారంభంలో సగుణోపాసనగా మూడు పాదాలు, అధికారము కలిగిన తరువాత నిర్గుణోపాసగా నాల్గవపాదము (తురీయపాదము) తోకలిపి ఉపాసనచేస్తారు. గాయత్రీ ఉపాసన గురించి వివరించినప్పుడు, ముందు ఒక లక్ష జపానికి సంకల్పించి, ఇరవైవేలు త్రిపదగాయత్రి చేసి ఆ తరువాత నాల్గవపాదముతో కలిపి లక్ష

జపం చెయ్యాలని, ఆ తరువాత జీవితాంతము నాల్గుపాదాలు గల గాయత్రీ మంత్రాన్నే ఉపాసన చెయ్యాలనీ వసిష్ఠ, విశ్వామిత్ర కల్పాలలో చెప్పబడింది. గాయత్రీ జపపరులు ప్రణవవ్యాహృతి త్రయ సహితమైన పాదచతుష్టయమును ఉపాసించుట సంపూర్ణ ఫలప్రదము.

'ఓం భూర్భువస్సువః' ఇది వ్యాహృతి త్రయము. (ఓం భూః, ఓం భువః, ఓం సువః)

"భూః భువః సువః మహః జనః తపః ఓగ్ం సత్యం" ఇవి సప్తవ్యాహృతులు.

| | | |
|---|---|---|
| బ్రహ్మచారి, గృహస్థులు | - | ప్రణవత్రయ సహితముగాను |
| వానప్రస్థులు | - | పంచప్రణవసహితముగాను |
| సన్యాసులు | - | ఏకప్రణవ మాత్రమును |

ఉపాసించాలని వసిష్ఠాది మహర్షులు చెప్పారు.

**ప్రణవత్రయము అంటే:-** వ్యాహృతిత్రయము ముందు ఒకటి, మొదటిపాదము ముందు ఒకటి, తురీయపాదముకు ముందు ఒకటి. మొత్తము మూడుప్రణవాలు.

**పంచప్రణవము అంటే:-** ఆద్యంత ప్రణవాలు రెండు, గాయత్రీ మంత్ర పాదత్రయాదిన ఉన్న ప్రణవములు మూడు. మొత్తం ఐదు.

**ఏకప్రణవము అంటే:-** గాయత్రీ మంత్రంలోని మూడుపాదాలు, వ్యాహృతి త్రయములోకలిసిపోతాయి. వ్యాహృతిత్రయము ప్రణవమందు గల అకార ఉకార మకారములలో కలిసి పోతుంది. ఇప్పుడు మిగిలేది ఓంకారము ఒక్కటే. ఇదే యతులు ఉపాసింపతగినది.

**గాయత్రీ మంత్రార్థము :-** లోకమందు ప్రసిద్ధముగా ఉన్న లింగ ధర్మరహితమైన, సచ్చిదానంద లక్షణములుగల సూర్యమండలాంతర్గతమయిన బ్రహ్మతేజస్సు మాయొక్క బుద్ధివృత్తులను ప్రేరేపణచేయుచున్నదో, జగత్తుయొక్క సృష్ట్యాది ధర్మములుగల ప్రకాశమానమయినది సేవింపదగినది, పాపములను హరించునది, సకల నిగమాగమ ప్రసిద్ధమైనది అయిన ఆ బ్రహ్మతేజస్సును ధ్యానించుచున్నాను.

సర్వజగత్కారణమైన, ప్రకృతికన్న వేరైన అపరాశక్తి తనసాయుజ్యమును ఇచ్చి మమ్ము రక్షించుగాక అని నాల్గవపాద సారాంశము.

**బాలామంత్రము :-** ఇందులో మూడు బీజాక్షరాలుంటాయి. ఐం క్లీం సౌః

**వాగ్భవం ప్రథమబీజం ద్వితీయం తు కామరాజకం**
**తృతీయం శక్తి బీజాఖ్యం నిగమాత్ సముద్ధృతం.**

'ఈ మంత్రంలోని బీజాక్షరాలలోని ఒక్కొక్క దానిలోను సూక్ష్మాకారంలో అనేక శక్తులు దాగి ఉన్నాయి.

ఐం - అనబడే మొదటి బీజములో అ, ఈ, అ, ం. అనే నాలుగు బీజాలున్నాయి. ఇవి చతుర్వేదాలకు, ప్రతీకలు. ఈ బీజము త్రిమూర్తి స్వరూపము. పరాశ్యంతీ మధ్యమా వైఖరీ స్వరూపమైన శబ్ద బ్రహ్మాత్మకము. వాగ్భవబీజము. వాణీహిరణ్యగర్భ స్వరూపము.

క్లీం - దీనిలో క, ల, ఈ, ం. అనే నాలుగు బీజాలున్నాయి. వీటిలో కకారము బిందువు, రెండూ విష్ణుస్వరూపాలు. కాగా లకార ఈకారములు లక్ష్మీరూపము. మొత్తం మీద ఇది లక్ష్మీనారాయణాత్మకము కామరాజబీజము.

సౌః - అనే మూడవ బీజమునందు సకారము ఔకారము విసర్గ ఉన్నాయి. శివశక్త్యాత్మకము. అందుకనే దీన్ని శక్తిబీజము అంటారు. బాలా మంత్రంలో ఐం క్లీం సౌః అనబచే మూడు బీజాక్షరాలు అనులోమవిలోమంగా మొత్తంమీద ఆరు అక్షరాలుంటాయి.

మంత్రార్థము:

ఐం క్లీం సౌః - అహంబ్రహ్మాస్మి

సౌః క్లీం ఐం - బ్రహ్మైవాహమస్మి.

పంచదశీమహామంత్రము :- ఇది మొత్తము పదిహేను అక్షరముల మంత్రము. మూడు కూటములుగా ఉంటుంది. మొదటి కూటములో ఐదు, రెండవ కూటములో ఆరు, మూడవ కూటములో నాలుగు బీజాక్షరాలుంటాయి.

మొదటి కూటమి అర్థము :- మాయాస్వరూపమయిన ఓ పరదేవతా! బ్రహ్మవిషయకమై, అష్టపాశాత్మకమైన స్వపరభేదమనే లజ్జారూపమయిన అజ్ఞానమును పోగొట్టుము. అనగా బ్రహ్మజ్ఞానము గురించి నాకుగల అజ్ఞానమును పోగొట్టుము.

రెండవ కూటమి అర్థము :- బ్రహ్మయొక్క గ్రాహకశక్తిని, బ్రహ్మపరోక్ష వృత్తిని ప్రకాశింప చేయుము.

**మూడవకూటమి అర్థము:-** బ్రహ్మజ్ఞానముగురించి నాకు గల సకలవిధములైన అజ్ఞానమును పోగొట్టుము.

**మహాషోడశి:-** ఇది ఇరవైఎనిమిది అక్షరాలు గల మంత్రము.

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - [illegible] అవ్యక్త, మహత్తత్త్వ, అహంకార, అర్ధనారీశ్వరాత్మకము.

ఓం హ్రీం శ్రీం - ఉమామహేశ్వర, వాణీ హిరణ్యగర్భ, లక్ష్మీనారాయణాత్మకము.

**సౌః ఐం క్లీం హ్రీం శ్రీం - అగ్ని సోమ[illegible]త్మక, పంచభూతాత్మక ప్రా[illegible] బరూపము చేత బ్రహ్మగ్రాహకమయిన ఓ పరదేవత [illegible]బ్రహ్మజ్ఞానము గురించి న[illegible]గల అజ్ఞానమును పోగొట్టి, నానిజరూపము నాకు తెలియచేయుము. నీసాయుజ్యము నాకు ఇమ్ము.**

**కామకళా:-** 'శ్రీం' అనేది కామకళా ఏకాక్షరీ మంత్రము. దీనిలో శ, ర, ఈ, బిందువు. మొత్తం

నాలుగు బీజాలున్నాయి. మంత్రశాస్త్రంలో దీనికి అనేకార్థాలున్నాయి. అవి:

1. ప్రకాశ, విమర్శ, మిశ్రమ, సంవిద్బిందువులు.
2. కామకళాంగనయొక్క ముఖము, స్తనయుగము, కటిప్రదేశము మొదలైన అవయవాలు.
3. ఆత్మతత్త్వము, విద్యాతత్త్వము, శివతత్త్వము, బ్రహ్మ స్వరూపము.
5. అవ్యక్తాది తత్త్వసముదాయమైన వర్ణకదంబము.
6. అవస్థాచతుష్టయము (జాగ్రస్వప్న సుషుప్తి తురీయా) విశ్వతైజస ప్రాజ్ఞసాక్షులు, పరాపశ్యంతీ మధ్యమావైఖరులు.
7. సచ్చిదానంద స్వరూపము

ఈరకంగా జీవాత్మ పరమాత్మలకు ఐక్యము తెలుపుతున్నాయి. కాబట్టి ఇది సర్వోత్తమమైన బీజము. ఇదియే కామకళాబీజము. ఇదే ధృవకళ, షోడశీకళగా చెప్పబడుచున్నది.

## 9. దేవీపూజ - ఆచారాలు

భారత దేశంలో అనాదిగా అనేకమంది దేవతలు పూజింపబడుతున్నారు. ఆ దేవతలలో గణపతి, శివుడు, విష్ణువు, సూర్యుడు అంబిక (శక్తి) కార్తికేయుడు (కుమారస్వామి) ముఖ్యులు. శక్తిని పూజించేవారిని శాక్తేయులు అంటారు. శాక్తేయులు వివిధ రకాల పద్ధతులు, ఆచారాలలో ఆదేవిని ఉపాసిస్తున్నారు. ఆ ఆచారాలలో ముఖ్యమైనవి:

1. కౌళాచారులు : వీరు ఆధార చక్రాన్ని పూజిస్తారు.
2. క్షపణికులు : స్త్రీ యోనిని పూజిస్తారు. పూర్వాదితంత్రాలు వీరి ప్రమాణాలు.
3. కాపాలికలు: పంచామృతతంత్రం వీరికి ప్రమాణము.
4. దిగంబరులు: రూపభేదము, భూతోడ్డారము నుంచి నికుంతేశ్వర తంత్రము వరకు గల ఎనిమిది తంత్రములు వీరికి ప్రమాణాలు.
5. ఇతిహాసులు: వీరు వస్త్రహీనులు. భైరవయామళము వీరికి ప్రమాణ గ్రంథము.
6. వామాచారులు: వీరు తంత్రవాదులు. వామకేశ్వరతంత్రము వీరికి ప్రమాణ గ్రంథము.
7. సమయాచారులు: వీరు బ్రహ్మవాదులు, జ్ఞానులు. వీరికి శుభాగపంచకము ప్రమాణము

వీళ్ళలో కాపాలికులు, దిగంబరులు, క్షపణికులు మొదలయినవారు జంతుబలి, నరబలి ఇచ్చినట్లైతే తమ కోర్కెలు తీరుతాయి అని నమ్ముతారు. వీరు కాళి, స్మశానభైరవిలాంటి ఉగ్రదేవతలను అర్చిస్తారు. మన కథలలో ఉండే మాంత్రికులు ఈ కోవకు చెందినవారే. వీరందరూ కూడా ఐహికవాంఛలను తీర్చుకొవటానికే దేవీపూజ చేస్తారు. అందుకనే

చతుష్షష్ట్యా తంత్రైః సకల మతిసంధాయ భువనం
స్థిత స్తత్తత్సిద్ధి ప్రసవ పరతంత్రైః పశుపతిః
పునస్త్వన్నిర్బంధా దఖిల పురుషార్థైకఘటనా
స్వతంత్రం తే తంత్రం క్షితితల మవాతీతరదిదమ్॥

అన్న శ్లోకంలో పార్వతి శివుడితో "దేవా నీవు చెప్పిన 64 తంత్రాల ద్వారా నా భక్తులు ఐహికబంధాలలో కూరుకుపోతున్నారు. వారికి మోక్షం ప్రసాదించటానికి ఏదైనా ఇంకొక మార్గము సూచించవలసినది" అన్నది. అప్పుడు-శివుడు-మోక్షప్రదమైన-శ్రీవిద్యాతంత్రాన్ని చెప్పాడు.

ఈ శ్లోకాన్ని పరిశీలిస్తే కేవలం కామ్యవాదులు, మోక్షవాదులని రెండు రకాలవారున్నారు అని తెలుస్తుంది. వీరి ఆచారవ్యవహారాలనుబట్టి దేవీ ఉపాసనాపరులను మూడు రకాలుగా విభజించవచ్చు అని ఇంద్రకంటి. విశ్వనాథంగారు అన్నారు. అవి:

1. కాశ్మీరు పద్ధతి : ఇది శుద్ధ దక్షిణాచారము
2. వంగదేశ పద్ధతి : ఇది వామాచారము
3. కేరళ పద్ధతి : ఇది మిశ్రమాచారము

కాని ప్రస్తుతం వాడుకలో నాలుగు పద్ధతులు కనిపిస్తున్నాయి. అవి:
1. కౌళాచారము 2. మిశ్రమాచారము 3. సమయాచారము 4. వామాచారము.

సగుణబ్రహ్మను గురించి చెప్పే తంత్రశాస్త్రాలను ఆగమాలు అంటారు. వీటిని సమిష్టిగా మంత్రశాస్త్రం అని పిలుస్తారు. అతి సామాన్యులకు కూడా అర్థమయి వారి హృదయాలను స్పందింపచేసివి ఈ ఆగమాలు. ఆగమాలలో వైష్ణవాగమాలు, శైవాగమాలు, శక్త్యాగమాలు అని మూడు రకాలున్నాయి. శక్తిని జగన్మాతగా, పరతత్త్వంగా చెప్పే ఆగమాలను శక్త్యాగమాలు అంటారు. కౌళ, మిశ్రమ, సమయమార్గాలు. వీటిలో సాత్వికఆగమాలకు తంత్రాలు అనీ, రాజసాలకు యామళాలు అనీ, తామసాలకు డామరాలు అనీ, పేర్లున్నాయి.

కౌళాచారులు:- పురుషార్థాలలో అర్థకామాలకే ప్రాధాన్యత ఇచ్చేవారు కౌళులు. వీరికి బాహ్యపూజయే కాని అంతః పూజ లేదు. వీరు ప్రత్యక్షంగా శ్రీచక్రాన్ని పూజిస్తారు. వీరికి కౌళాగమాలుగా పిలవబడే అరవైనాలుగు తంత్రాలు ప్రామాణికాలు. ఈ చతుషష్టి తంత్రాలు దేవీపూజకు ఉత్తమమైనవి. అని చతుశ్శతి యందు చెప్పబడింది.

ఈ 64 తంత్రాలు అన్నీ తెలిసిన వారిని కూడా పెడత్రోవను పట్టిస్తాయి. ఇవి ఐహికసిద్ధికి మార్గాలు. కాబట్టి వైదిక మార్గానికి పనికిరావు. కొంతమంది పండితులు కూడా ఐహికఫలాపేక్ష చేత ఈ తంత్రమార్గాన్ని అనుసరిస్తున్నారు. వారందరూకూడా వంచితులే అని గ్రహించగలరు.

కౌళాచారులు షట్చక్రాల్లోకి ఆధారచక్రాన్ని పూజిస్తారు. కుః అంటే పృథివీతత్త్వము. అది

షట్చక్రాలలోని ఏ చక్రమందు ఉంటుందో, దాన్ని కులము అ ...రు. ఇది ఆధారచక్రంలో ఉంటుంది. శ్రీచక్రానికి బాహ్యపూజచేసే వారు కేవలం కామ్యసిద్ధి... చేస్తారు. అందుకే వీరు పృథివీ త్త్వాత్మకమైన ఆధారచక్రాన్ని పూజిస్తారు. కాబట్టి వీరి పూజను ...ు అనీ వీరి ఆచారాన్ని కౌళాచారము అని అంటారు. వీరు శ్రీచక్రాన్ని భూర్జరీపత్రము, ...స్త్రము, బంగారు లేక వెండి రేకు మీద వ్రాసి దాన్ని ఆరాధిస్తారు. దీనిని కౌళపూజ అంటారు.

షట్చక్రాల్లోని ఆధార, స్వాధిష్టానాలు అంధకార బంధురాలు. వాటియందు కౌళులకే అధికారం వుంది. భైరవయామళంలో

చతుర్భి శ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః
నవ చక్రైశ్చ సంసిద్ధం శ్రీచక్రం శివయోర్వపుః ॥

త్రికోణ మష్టకోణం చ దశకోణ ద్వయం తథా
చతుర్దశారం చైతావి శక్తిచక్రాణి పంచ చ॥

బిందు శ్చాష్టదళం పద్మం, పద్మం షోడశపత్రకమ్
చతురశ్రంచ చత్వారి, శివచక్రాణ్యనుక్రమాత్॥

నాలుగు శివచక్రాలు, ఐదు శక్తి చక్రాలతో ఉన్న చక్రాన్నే శ్రీచక్రం అంటారు. దీనిలో త్రికోణము, అష్టకోణము, అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము అనే ఐదు శక్తిచక్రాలు. బిందువు, అష్టదళము షోడశదళము, భూపురము అనే నాలుగు శివచక్రాలు.

ఆధారచక్రమే త్రికోణము. దానిలో బిందువు ఉన్నది అని ప్రసిద్ధి. కౌళమతానుసారము త్రికోణమే బిందుస్థానం. ఆ బిందువే త్రికోణమందు ఆరాధింపతగినది. అందుకే కౌళులు త్రికోణాన్ని పూజిస్తారు. ఈ త్రికోణము రెండు రకాలుగా ఉంటుంది.

1. శ్రీచక్రంలో మధ్యఉన్న త్రికోణము

2. సుందరాంగి అయిన స్త్రీయొక్క ప్రత్యక్షయోని.

కౌళాచారుల్ని రెండు రకాలుగా విభజించవచ్చు.

1. పూర్వకౌళులు 2. ఉత్తర కౌళులు

పూర్వకౌళులు శ్రీచక్రాన్ని భూర్జరీపత్రము, పట్టువస్త్రము, బంగారు లేదా వెండి రేకు మీద వ్రాసి దానిలోని త్రికోణాన్ని పూజిస్తారు ఉత్తరకౌళులు స్త్రీయొక్క ప్రత్యక్ష యోనిని పూజిస్తారు. వీరికి శివుడనేవాడు ప్రత్యేకంగా లేడు.

ఈ రెండు రకాల పూజలూ బాహ్యపూజలే. అందుచేత వారికి ఆధార చక్రమేపూజనీయ మవుతుంది. అందులో ఉండే కుండలినీ శక్తినే కౌళిని అంటారు. త్రికోణపూజలో కౌళినియే ఉపాశ్య.

ఆధారచక్రంలో కుండలినీశక్తి సర్పాకారం ధరించి తోకను నోటితో కరచి పట్టుకున్నట్లుగా ఉంటుంది. నిద్రావస్థలో ఉన్నప్పటికీ కుండలినీ శక్తి పూజింపతగినదే. అందుకే ఆ పూజను తామిశ్రకము అంటారు. ఆధారస్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. వాటి మీద కౌళాచారులకు మాత్రమే అధికారం ఉంది. కుండలినీ ప్రబోధం ఎప్పుడు కలుగుతుందో, ఆ క్షణంలో కౌళులకుముక్తి కలుగుతుంది. అందుకనే కౌళులను క్షణముక్తులు అంటారు. కౌళులు త్రికోణంలో భైరవీభైరవులు పూజనీయులు.

జపాకుసుమ సంకాశౌ మదఘూర్ణితలోచనౌ
జగతః పితరౌవందే భైరవీ భైరవాత్మకౌ॥

సాధకులు వారితో ఐక్యము పొందటం అనేది ముఖ్యం. అందుకనే బిందువును పూజించేటప్పుడు స్త్రీపురుషులు భైరవాకారమైన దిగంతబరత్వాన్ని ఆశ్రయించి, అంటేవారు దిగంబరులై పూజచేస్తారు. వామాచారప్రవృత్తి ననుసరించి మధు, మత్స్య, మాంసాలతో సమారాధన చేస్తారు. ఉత్తరకౌళులు స్త్రీయోనిలోని మన్మథ ఛత్రాన్ని బిందువుగా భావించి పూజిస్తారు. అందుకే అది అవైదికము, నీతి బాహ్యము అని చెప్పబడింది. కౌళులు పరమేశ్వరుణ్ణి నవాత్మకుడు లేదా నవవ్యూహాత్మకుడు అంటారు. ఈ నవవ్యూహాలను కామకళావిద్యలో ఈవిధంగా చెప్పబడింది.

కాలవ్యూహః కులవ్యూహో నామవ్యూహ స్తథైవచ
జ్ఞానవ్యూహ స్తథా చిత్తవ్యూహ స్స్యా త్తదనంతరమ్ ॥

నాదవ్యూహ స్తథా బిందు వ్యూహ స్స్యా త్తదనంతరమ్
కలావ్యూహ స్తథా జీవవ్యూహ స్స్యా దితి తే నవ॥

1. కాలవ్యూహము : నిమిషము మొదలు కల్పాంతము వరకు ఉన్న కాలము యొక్క సముదాయము
2. కులవ్యూహము: ఎరుపు, తెలుపు, నీలము మొదలైన రంగులను గురించి తెలిసేది.
3. నామవ్యూహము: ప్రపంచంలోని ప్రాణుల యొక్క పేర్లను తెలిపేది.
4. జ్ఞానవ్యూహము : ఇంద్రియాల ద్వారా ప్రపంచాన్ని గురించి తెలుసుకునే జ్ఞానము.
5. చిత్తవ్యూహము: అహంకారము, చిత్తము, బుద్ధి, మహతత్త్వము, మనస్సు అను అహంకార పంచకము గురించి తెలిపేది.
6. నాదవ్యూహము: రాగము, ఇచ్ఛ, కృతి, ప్రయత్నము, మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు, పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీలను గురించి తెలిపేది.

7. బిందు వ్యూహము: ఆధారాది షట్చక్రాల సంఘము
8. కళావ్యూహము : యాభై కళలై వర్గ స్వరూపములైన అక్షరముల గురించి తెలిపేది.
9. జీవవ్యూహము: భోక్తలగు జీవుల సమూహము.

నవవ్యూహాత్మకోదేవః పరానంద పరాత్మకః
నవాత్మా భైరవోదేవో భక్తి ముక్తి ప్రదాయకః

పరానంద పరాశక్తిః చిద్రూపా ऽనందభైరవీ
తయోర్యదా సామరస్యం జగదుత్పద్యతే తదా॥

పరానందుడు, పరాత్మకుడు అను భైరవుడు నవవ్యూహాత్మకుడు. ఆయనే భక్తి, ముక్తి ప్రదాత. పరానందమైన పరాశక్తి చిద్రూప అయిన ఆనందభైరవి అవుతుంది. ఈ భైరవీభైరవులకు సామరస్యము ఎప్పుడు కలుగుతుందో అప్పుడు జగదుత్పత్తి జరుగుతుంది.

వామకేశ్వరతంత్రంలో చెప్పినట్లుగా

భుజంగాకార రూపేణ మూలాధారం సమాశ్రితా
శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభా ऽశుభా

మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్
ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా॥

పద్మాసన గత స్వస్థో గుద మాకుంచ్యసాధకః
వాయుమూర్ధ్వగతిం కుర్వన్ కుంభకావిష్టమానసః

వాయ్వాఘాత వశా దగ్నిః స్వాధిష్ఠానగతో జ్వలన్
జ్వలనాఘాత పవనాఘాతై రున్నిద్రితో ऽహిరాట్॥

రుద్రగ్రంథిం తతో భిత్వా విష్ణుగ్రంథిం భినత్త్యతః
బ్రహ్మగ్రంథించ భిత్వైవ కమలాని భినత్తి షట్॥

సహస్రకమలే శక్తిః శివేన సహమోదతే
సాచావస్థా పరా జ్ఞేయా సైవనిర్వృతి కారణమ్॥

పద్మాకారముతో భగవతి ఆధారచక్రంలో కుండలినీ శక్తియై మెరుపు తీగవలె ప్రకాశిస్తూ ఉంటుంది. సాధకుడు పద్మాసనంలో కూర్చొని, మడమను గుదస్థానంలో వంధించి శ్వాసను పైకి వదులుతూ ప్రాణాయామం చేయాలి. అప్పుడు స్వాధిష్ఠానంలో అగ్నిప్రజ్వరిల్లి కుండలినీశక్తి మేల్కొంటుంది. అంతట ఆ శక్తి బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథులను ఛేదించుకుని సహస్రారం చేరి శివునితో సంతోషం పొందుతుంది. ఆస్థితిలో ఉన్నదేవియే పరాశక్తి. నిత్య సుఖకారిణి, కుండలినీ ప్రబోధం కలిగితేనే దేవి సాక్షాత్కారం జరుగుతుంది.

కౌళులు నాలుగుదళాలుగల ఆధారచక్రాన్ని, ఆరుదళాలు కల స్వాధిష్ఠానంతో అంతర్భూతంచేసి పూజిస్తారు. ఈరకంగా ఆధారస్వాధిష్ఠానాలను అనుసంధానం చెయ్యటం వలన వారికి షట్చక్ర అనుసంధానం చేసిన ఫలం కలుగుతుంది.

పాశాంకుశౌ తదీయౌతు రాగద్వేషాత్మకౌ స్మృతౌ
శబ్ద స్పర్శాదయో బాణాః మన స్తస్యాభవద్ధనుః॥
కరణేంద్రియచక్రస్థాం దేవీం సంవిత్స్వరూపిణీమ్
విశ్వాహంకార పుష్పేణ పూజయే త్సర్వసిద్ధిభాక్॥

సాధకుడు తన రాగద్వేషాలను దేవి పాశాంకుశాలుగా, తన మనస్సును దేవి ధనుస్సుగా పంచతన్మాత్రలు దేవి బాణాలుగా భావించి అహంకారమను పుష్పముతో దేవిని పూజించినట్లైతే అతడికి సర్వసిద్ధులు కలుగుతాయి.

2. మిశ్రమాచారులు:- వీరు కౌళ, సమయాచారాలను కలిపి ఆచరిస్తూ ఉంటారు. వీరికి చంద్రకళ, జ్యోత్స్నావతి, కళానిధి, కులార్ణవ, కులేశ్వరి, భువనేశ్వరి, బార్హస్పత్య, దూర్వాసతంత్రాలు ప్రమాణాలు. ఈ ఆగమాలలో ధర్మ, కర్మ, ఉపాసనల వివరణ, కుండలినీ శక్తి వివరణ, సాధనామార్గాలు ఉన్నాయి.

3. సమయాచారులు:- సయమమతంలో ప్రధానమైనది కేవలం కైవల్యము, పారమార్థిక దృష్టి. కర్మకాండలవల్ల మోక్షము లభించదు అని వీరు నమ్ముతారు. జీవబ్రహ్మైక్యమే వీరి సిద్ధాంతము. వీరికి శుభాగపంచకము అని పిలువబడే సనక, సనందన, సనత్కుమార, వసిష్ఠ, శుకసంహితలు ప్రమాణాలు. సయమాచారులకు బాహ్యపూజలేదు. అంటే వారు శ్రీచక్రాన్ని వేరుగా పూజించరు. ఇదే విషయాన్ని సనత్కుమార సంహితలో ఈ విధంగా చెప్పారు.

బాహ్యపూజా న కర్తవ్యా కర్తవ్యా బాహ్య జాతిభిః
సా క్షుద్రఫలదా (క్షుద్రధర్మదా) నృణాం ఐహికార్థైక సాధనాత్॥
బాహ్య పూజారతాః కౌలాః క్షపణాశ్చ కపాలికాః
దిగంబరాశ్చేతిహాసాః (వీతవాసాః) వామకా స్తంత్రవాదినః॥
అంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః
జీవన్ముక్తాశ్చరం త్యేతే త్రిషు లోకేషు సర్వదా॥

ఉత్కృష్ట జాతుల వారు బాహ్యపూజచేయరాదు. బాహ్యజాతులవారు మాత్రమే బాహ్యపూజ చెయ్యాలి. బాహ్యపూజ అనేది ఐహిక ప్రయోజనము సాధించుటకు ఉపయోగిస్తుంది. ఇది అల్పప్రయోజనకారి. కౌళులు, క్షపణికులు, కాపాలికులు, దిగంబరులు, ఇతిహాసులు, (జాలవిద్యారతులు) వామాచారులు, తంత్రవాదులు వీరందరూ బాహ్యపూజారతులు. బ్రహ్మవాదులైన వైదికాఆచారపరులు, అంతరారాధనాపరులు. వీరు జీవన్ముక్తులై మూడు లోకాల్లోనూ సదా సంచరిస్తూ ఉంటారు. మోక్షప్రాప్తికై నిర్గుణబ్రహ్మ ఉపాసనేకాక స్వర్గ వైకుంఠాది లోకప్రాప్తికై శ్రుతి స్మృతులచే బోధింపబడిన కర్మలు సమయులకు అనుసరణీయములు. చంద్రజ్ఞాన విద్యలో చెప్పినట్లుగా సమయాచారులు

సూర్యమండలమధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం
పాశాంకుశధనుర్బాణాన్ ధారయంతీం ప్రపూజయేత్॥

సూర్యమండలము మధ్యనున్న దేవి అగు త్రిపురసుందరిని, పాశము, అంకుశము, ధనుర్బాణములు ధరించిన మూర్తిని పూజించాలి.

సమయాచారులలో ఒక తెగవారికి మాత్రం బాహ్యపూజవుంది. అంటేవారు విడిగా శ్రీచక్రాన్ని పూజిస్తారు. మూలమంత్రానికి అంతఃపూజలో ఋషి, ఛందస్సు అవసరం లేదు. కేవలం బాహ్యపూజలోనే అవి కావాలి.

సమయాచారులు శివశక్తులను సమయుడు, సమయ అంటారు. సమయ అంటే శివునితో ఐదురకాలుగా సామ్యము పొందినశక్తి అలాగే శివుడు కూడా శక్తితో ఐదు రకాలుగా సామ్యము పొందుతున్నాడు. ఈరకంగా శివశక్తులకు సామ్యము ఉన్నది అని వీరి నమ్మకము. అందుకే వీరి ఆచారాన్ని సమయాచారము అంటారు.

సామ్యము అంటే పోలిక. శివశక్తులు ఐదు రకాలుగా ఒకే పోలిక కలిగి ఉంటారు. అవి:

1. అధిష్ఠానసామ్యము : శివశక్తులు ఇద్దరూఒకేస్థానాన్ని అధిష్ఠించి ఉండటం.
2. అనుష్ఠానసామ్యము : ఇద్దరూ ఒకే పనిలో నిమగ్నమై ఉండటము
3. అవస్థాసామ్యము : ఇద్దరూ ఒకే అవస్థలో నిమగ్నమై ఉండటము.
4. రూపసామ్యము : ఇద్దరూ ఒకే రూపంలో ఉండటము
5. నామసామ్యము : ఇద్దరి పేర్లు ఒకే రకంగా ఉండటము

షట్చక్రాల్లోని ప్రతిచక్రంలోనూ వీరికి ఈ రకంగా సామ్యం చెప్పబడింది. ఆధారచక్రంలో
1. శివాశివులిద్దరికీ ఆధారచక్రమే అధిష్ఠానము. అందుచేత వీరిద్దరికీ అధిష్ఠానసామ్యం చెప్పబడింది.
2. ఇద్దరూ అక్కడ నాట్యం చేస్తూంటారు. ఇది అవస్థాసామ్యము.
3. ఇద్దరూ జగత్తును సృష్టించే కార్యక్రమంలో నిమగ్నమై ఉంటారు. ఇది అనుష్ఠానసామ్యము.
4. ఇద్దరూ ఎర్రని రంగులో ఉంటారు. ఇది రూపసామ్యము.

5. ఇద్దరికీ భైరవీ, భైరవుడు లేదా నవాత్మ, నవాత్మకుడు అనిపేరు. ఇది నామసామ్యము. ఈరకంగానే మిగిలిన ఐదు చక్రాల్లోనూ కూడా చెప్పబడింది.

సహస్రకమలమే బైందవస్థానం. దానిమధ్య ఉండే చంద్రమండలమే చతుష్కోణం. దాని మధ్యలో ఉండే బిందువులో శివశక్తులు కలసి సాదాఖ్యకళగా ఉంటారు.

సమయాచారుల దృష్టిలో చతుర్విధైక్య సంధానమే భగవతికి సమారాధన. చతుర్విధైక్య సంధానము అంటే శ్రుతి ఈ విధంగా చెబుతోంది.

పిండ బ్రహ్మాండయోరైక్యం లింగ సూత్రాత్మనోరపి
స్వాపావ్యాకృతయోరైక్యం క్షేత్రజ్ఞ పరమాత్మనోః॥

1. పిండబ్రహ్మాండములకు ఐక్యము
2. లింగసూత్రాలకు ఐక్యము
3. స్వాపావ్యాకృతులకు ఐక్యము
4. క్షేత్రజ్ఞ పరమాత్ములకు ఐక్యము

దీనినే చతుర్విధైక్యసంధానము అంటారు. చతుర్విధైక్యసంధానము చేసిన యోగి శివశక్తి భావన చేత తాదాత్మ్యము పొందుతాడు. ఈ విషయం కాదిమతంలో ఈ విధంగా చెప్పబడింది.

మూలాది బ్రహ్మరంధ్రాంతం స్ఫురిద్విద్యుల్లతాకృతిమ్।
ధ్యాయే త్కుండలినీం దేవీం త్వద్విద్యాక్షర రూపిణీమ్॥

షట్చక్రభేదినీం దేవీం తాంచ బిందుత్రయాత్మికామ్।
తాం చాప్యర్థకలారూపాం చింతయేత్పద్మకాననే॥

ఏవం భావనయాజుష్టః పరమానందనిర్భరః
సంసార సాగరం ధీమాన్ గోష్పదీకురుతే శివే॥

ఎవరైతే ఆధార చక్రమును నుంచి బయలుదేరి సహస్రారముచేరి ఆదేవి సాక్షాత్కారం పొందగలుగుతాడో, అతడు సంసారసాగరాన్ని తేలికగా దాటగలుగుతాడు.

ఇదే విషయాన్ని సుభగోదయంలో

మూలాది బ్రహ్మరంధ్రాంతం మూలవిద్యాం విభావయేత్
ఉద్యదాదిత్యసంకాశాం తటిత్కోటి సమప్రభామ్॥
తత్ప్రభా పటలవ్యాప్తం శరీరమపి చింతయేత్॥

షట్చక్రాలయందు ఎవరైతే దేవిని ధ్యానిస్తారో, వారికి కోట్లకొలది సూర్యుల వెలుగుతో ప్రకాశిస్తున్న దేవి సాక్షాత్కారమౌతుంది.

గురుకటాక్ష మహిమవల్ల జనించిన మహావేధ కారణంగా భగవతి, సాధకుడి ఆధార, స్వాధిష్ఠాలను భేదించుకుని మణిపూరం చేరుతుంది. అక్కడ ఆమెకు అర్ఘ్యపాద్యాదులిచ్చి షోడశోపచార విధిని మానసికంగా పూజచెయ్యాలి. తదుపరి ఆమె అనాహతానికి చేరుతుంది. అక్కడ ఆమెకు ధూప, దీప, నైవేద్య, హస్తప్రక్షాలనవరకూ సేవచెయ్యాలి. తరువాత ఆమెను అజ్ఞాచక్రంచేర్చి నీరాజనాదులచే సంతోషపెట్టాలి. తరువాత దేవి విద్యుల్లతవలె సహస్రారంలో ప్రవేశించేవరకు సాధకుడు వేచి ఉండాలి. ఇది యోగసాధ్యము. సమయమతరహస్యము.

సమయాచారులకు బాహ్యపూజలేదు. కాబట్టి హృదయమునందే ఆరాధింపబడిన భగవతి సాధకులకు ఐహికఫలం కూడా ఇస్తుంది.

మాతృకాం వశిన్యాయుక్తాం యోగినీభి స్సమన్వితామ్
గంధాద్యాకర్షిణీయుక్తాం సంస్మరే త్రిపురాంబికామ్

వశిన్యాది శక్తి యుక్తము, యోగినీ గణసమన్వితము, గంధాకర్షిణీ సహితము, మాతృరూపము అయిన త్రిపురాంబికను ధ్యానిస్తే విద్యాప్రాభవం కలుగుతుంది. దేవిని ఎర్రని కాంతి కలదిగా పూజిస్తే స్త్రీలోకం వశమౌతుంది. లఘుస్తవములో చెప్పినట్లుగా

వామే పుస్తకధారిణీ మభయదాం సాక్షస్రజం దక్షిణే
భక్తేభ్యోవరదాన పేశలకరాం కర్పూరకుందోజ్జ్వలామ్।
ఉజ్జృంభాంబుజపత్రకాంతి నయన స్నిగ్ధప్రభాలోకనీం
యేత్వామంబ న శీలయంతి మనసా తేషాం కవిత్వం కుతః॥

చేతులయందు పుస్తకము, అక్షరమాల, అభయ వరదముద్రలు ధరించి కర్పూరము మరియు మల్లెపూవువలె ప్రకాశించు ఆ దేవిని ధ్యానించినట్లయితే కవిత్వము సిద్ధిస్తుంది. అంబాస్తవంలో చెప్పినట్లుగా

యః స్ఫాటికాక్షగుణ పుస్తక కుండికాఢ్యాం
వ్యాఖ్యా సముద్యతకరాం శరదిందుశుభ్రామ్।
పద్మాసనాం చ హృదయే భవతీముపాస్తే
మాతః స విశ్వకవితాం కిము చక్రవర్తీ॥

చేతులందు అక్షమాల, పుస్తకము, కమండలము ధరించి, పద్మాసనాసీనయై,

శరత్కాలచంద్రబింబమువలె ప్రకాశించు దేవిని ఎవరైతే ధ్యానిస్తారో ఆతనికి ప్రపంచాన్ని సమ్మోహనం చేసే కవిత్వం సిద్ధిస్తుంది. ఇదే విషయాన్ని మార్కండేయుల వారు

స్తుతా సంపూజితా పుష్పై ర్ధూపగంధాదిభి స్తథా!
దదాతి విత్తం పుత్రాంశ్చ మతిం ధర్మే తథా శుభమ్॥
సా చింతితా చ విజ్ఞానం తుష్టా బుద్ధిం ప్రయచ్ఛతి
ఆరాధితాసై వ నృణాం భోగస్వర్గాప వర్గద
శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణా॥
సర్వస్యార్తి హరే దేవి నారాయణి నమోస్తుతే.

భక్తిచేత నమస్కరించినంత మాత్రము చేతనే దేవి మనకు శుభాలు కలుగచేస్తుంది. సౌభాగ్యము, శుభగత్వము, సారూప్య సౌశీల్యాదికము ఆ దేవిని కీర్తించినందువల్లనే కలుగుతాయి. పశు,పుత్ర, ధసలాభము దారిద్ర్యనాశనము, అభీష్టసిద్ధి కలుగుతాయి. ఈ విధంగా సమయులకు అంతః పూజయే ఐహిక అముష్మిక ఫలములు కూడా ఇస్తుంది.

*4. వామాచారము* : వీరికి వామకేశ్వరతంత్రం ప్రమాణ గ్రంథం. క్షీరసాగరమథనంలో పుట్టిన మద్యంతాగిన అసురలది వామమార్గం, అమృతం తాగిన దేవతలది సయమమార్గంగా చెప్పడ్డాయి. వామాచారులు ఇంద్రియతృప్తిచే ఆనందాన్ని అనుభవించటానికి ఇష్టపడతారు. మనస్సు, శరీరము వేటితో తృప్తిపొందుతాయో, అట్టి వాటిచేతనే దేవి కటాక్షిస్తుంది అని వీరి నమ్మకము. వీరు పంచమకార పూజలు చేస్తారు. పశు, నర బలులు ఇస్తారు. వివస్త్ర అయిన కన్యను, కులకాంతను, అందమైన వేశ్యను దేవి స్థానంలో కూర్చోపెట్టి, మద్యం పూర్తిగా సేవించి ఆ స్త్రీతో సంభోగం చేస్తారు. ఇదే దేవిని తృప్తిపరచటానికి సులభమైన మార్గం అని వీరితలంపు. బెంగాలు, బీహారు, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో వీరు విస్తృతంగా ఉన్నారు.

మేరుతంత్రం వామాచారాన్ని పూర్తిగా ఖండిస్తోంది. వామమార్గం వలన సర్వనాశనం కలుగుతుంది. అజ్ఞానులు, నాటవికులు ఈ మార్గాన్ని అనుసరిస్తారు. ఇంద్రియతృప్తి చేత ఆనందాన్ని అనుభవించే వామాచారులు భ్రష్టులవుతారు అని చెప్పబడింది. దేవిపూజలో వైదికపూజ శ్రేష్ఠము, స్మార్త పూజ ఉత్తమము, పౌరాణికపూజ మధ్యమము, తాంత్రిక పూజ అధమము అని చెప్పబడింది.

*10.మకార పంచకము:-* సాధకులు పూజలో ఈ రకమైన మకారపంచకాన్ని ఉపయోగించకూడదు. ఇది అవైదికము, నీతిబాహ్యము. మద్యపానం చెయ్యటంవల్లనే సాధకుడికి ముక్తికలిగితే, దేశంలో తాగుబోతులందరికీ ఎప్పుడో ముక్తికలగాలి. మాంసభక్షణ చెయ్యటంవల్లనే

జన్మరాహిత్యం కలిగితే క్రూరమృగాలకు ఎప్పుడో జన్మరాహిత్యం కలిగి ఉండాలి కదా! అసలు మకారపంచకము అంటే తంత్రశాస్త్రాలలో ఈ విధంగా చెప్పబడింది.

మద్యం, మాంసం, తథా మత్స్యం ముద్రా, మైథునమే వచ
శక్తిపూజా విధానాద్యై పంచతత్త్వ ప్రకీర్తితం

ఈ మకార పంచకానికి అర్థాలు వేరుగా,గోప్యంగా ఉన్నాయి.కానివాడుకలో మాత్రం అపార్థాలు కలుగుతున్నాయి. మానవులు అజ్ఞానులవటం వలన బాహ్యార్థము గ్రహించి జుగుప్సాకరము, హింసాత్మకమైన ప్రక్రియలవలన భ్రష్టులవుతున్నారని చెప్పబడుతోంది. మకారపంచకమునకు అర్థము శక్తిసంగమతంత్రము లో ఈ విధంగా చెప్పబడింది.

గుడార్ద్రకరసోదేవి ముద్రతా ప్రథమా మతా
పిణ్యాకం లవణం దేవి ద్వితీయా పరికీర్తితా
లశునం తిత్తిడీ చైవ తృతీయా పరికీర్తితా
సూర్యమండల సంకాశా చంద్రమండల సన్నిభా
గోధూమమాష సంభూతా సుందరీచ చతుర్థికా
శక్త్యాలాపః పంచమీస్యాత్పంచ ముద్రాః ప్రకీర్తితా॥

దీనిప్రకారము

1. బెల్లపుపానకము - మద్యము
2. తెలగపిండి, లవణము, గారెలు - మాంసము.
3. వెల్లుల్లి, తిత్తిడి పదార్థములు - మత్స్యము.
4. గోధుమలు, మినుములచే చేయబడిన పదార్థములు - ముద్ర
5. భక్ష్య బోజ్యముల కలయికనే - మైథునము

ప్రస్తుతము ఎక్కువగా వాడుకలో ఉన్న ఆచారము ఇదే.

మహానిర్వాణతంత్రంలో మకారపంచకాన్ని విపులీకరించటం జరిగింది.

నమద్యం మాధవీ మద్యం, మద్యం శశికిరణ రసోద్భవం
కర్మాకర్మ పశూన్హత్వా జ్ఞానఖడ్గేన చేశ్వరీ
మనోమీనం తృష్ణామేచ హత్వా సంకల్ప వాసనాం
భక్ష్యబోజ్యామృతం భక్ష్యమింద్రియ నిగ్రహః తాం చతుర్థాం విజానీయాత్
హంసః [illegible] శక్త్యైవ ఆనందపర్మలః పంచమీంతాం విజానీయాత్

చంద్రబింబము నుండి జాలువారు అమృతరసమే మద్యము అంతేకాని మాధవీలత నుండి తీసిదికాదు. కర్మాకర్మాలను పశువులను జ్ఞానఖడ్గముచేఛేదించుటయే మాంసము. మనస్సే మత్స్యము. దాని వాసనాచయమునర్పించుటయే మత్స్యమునర్పించుట. ఇంద్రియ నిగ్రహమే భక్ష్యభోజ్యములు. ఇదియే ముద్ర. హంసఃసోహం అను మంత్రార్థములయిన శివశక్తుల కలయికయే మైధునము.

అహింసా ప్రథమపుష్పం పుష్పమింద్రియ నిగ్రహః
దయాక్షమా జ్ఞాన పుష్పం పంచపుష్పం తతః పరం

సాదకుడు అహింస, ఇంద్రియ నిగ్రహము, దయ, క్షమ, జ్ఞానములే పంచపుష్పములు అని గ్రహించాలి. కాబట్టి సాధకులు శాస్త్రానికి అసలు అర్థాన్ని గ్రహించి దేవి కృపకు పాత్రులగుదురు గాక.

---

# 4. ఆనందపాదము చక్రసంకేతము

## పరాస్వరూపము

20. యాసాంతరోహరూపా పరా మహేశీ త్రిభావితా సైవ
స్పష్టా పశ్యంత్యాది త్రిమాతృకాత్మాచ చక్రతాం యాతా॥

ఆ పరాశక్తి అవాఙ్మాన స గోచరమై, సంకల్ప మాత్ర రూపమై, సర్వవ్యాపినియై, పశ్యంతి మధ్యమ వైఖరి అను మాతృకాస్వరూపమై శ్రీచక్రాకారము పొందినది.

ఇంతవరకు మంత్రము, దేవత రెండూ ఒకటే అనే విషయాన్ని నిరూపించటం జరిగింది. శ్రీచక్రము పరాస్వరూపమయిన యాబై అక్షరముల వలన రూపొందుతున్నది కాబట్టి ఇకపై శ్రీచక్రాన్ని గురించి వివరించటం జరుగుతోంది. ముందుగా పరాస్వరూపము.

అస్తి భాతి ప్రియం రూపం నామఇత్యంశ పంచకం।
ఆద్యత్రయం బ్రహ్మరూపం నామరూపాత్మకం జగత్॥

ఈ ప్రపంచం జగత్తు రెండు భాగాలుగా ఉన్నది.

1. పరబ్రహ్మ స్వరూపము 2. మాయాస్వరూపము

1. అస్తి 2. భాతి 3. ప్రియం అనేవి బ్రహ్మరూపాలు. నామరూపాలు రెండుజగత్తులోను రూపము

శివభాగమని, నామము శక్తి భాగమని చెప్పబడుతున్నాయి. శివభాగమైన రూపమును అ[illegible]ద్యాపాదంలో వివరించటం జరిగింది. కాగా ఇప్పుడు శక్తి భాగమైన నామము వివరించబడుతున్నది. నామము అంటే శబ్ద బ్రహ్మము. ఆశబ్దమే పరాస్వరూపము. ఆపరాశక్తి సంకల్పమే స్వరూపముగా కలది.

ఆ పరాశక్తి పశ్యంతి, మధ్యమా, వైఖరి అని మూడు సంజ్ఞలు పొంది, మాతృకా స్వరూపము పొంది ఉన్నది. మాతృక పరాస్వరూపశబ్ద బ్రహ్మ. అది పరాపశ్యంతీ, మధ్యమా, వైఖరీ అని నాలుగు భాగాలయి, ఈ చరాచర జగత్తుకు, శ్రీచక్రానికి కారణముగా ఉన్నది.

దేవీం వాచమజనయన్త దేవాస్తాం విశ్వరూపాః పశవోవదంతి
సానో మంద్రేష మూర్జం దుహానా ధేనుర్వాగ స్మానుపసుష్టుతైతు॥

ఇంద్రియపాలకులు, అంతఃకరణ పాలకులు అయిన మిత్ర, వరుణ, చంద్ర, విష్ణు మొదలగు దేవతలు సృష్టించిన వాగ్దేవి యొక్క వైఖరిని, మనుష్యులు నాలుకతో ఉచ్చరిస్తున్నారు. అటువంటి వాగ్దేవత అనే ధేనువు మాచే ఉచ్చరింపబడుతూ సాధకజనులను రక్షించుగాక అని వేదము చెబుతున్నది.

వాగ్దేవతకు పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ అని నాలుగు స్థానాలున్నాయి. ఈ స్థానాలను తెలుసుకున్నవారే విద్వాంసులు. వీటిలో నాల్గవది అయిన వైఖరి, వాక్కుచే ఉచ్చరింపబడుతుంటుంది.

ఈజగత్తు అంతా శివశక్త్యాత్మకమై ఉన్నది. సాధకుడి శరీరంలో సహస్రారం దగ్గర కాంతివంతమైన చంద్రమండలం ఉన్నది. అదే పరమాత్మ. ఆధారచక్రం దగ్గర నుండి సహస్రారం వరకు సుషుమ్నానాడి వ్యాపించి ఉన్నది. దీనినే జీవనాడి, పరానాడి అనికూడా అంటారు. చంద్ర మండలంలోని తేజస్సు ఈనాడిద్వారానే ఆధారచక్రంవరకు వ్యాపిస్తుంది. అందుకే ఇది మెరుపుతీగెలాగా, ప్రకాశిస్తుంది. సాధకుడు ప్రాణాయామం చేసినప్పుడు, స్వాధిష్ఠానములోని అగ్ని ఈమార్గంగుండావే సహస్రారంచేరుతుంది. ఈ అగ్నియొక్క వేడికి చంద్రమండలం ద్రవీభవించి అమృతం స్రవిస్తుంది. వాగ్దేవతకు నాలుగు స్థానాలున్నాయని చెప్పబడింది. అవి

| | |
|---|---|
| 1. పరా | 3. మధ్యమా |
| 2. పశ్యంతీ | 4. వైఖరీ |

1. పరాః- మానవుడికి ఏపని చెయ్యాలన్నా ఆలోచనముందుగా సహస్రారమధ్యవర్తి అయిన సాక్షిస్థానంలో [illegible] కొంటుంది. ఇది సహస్రారగతమైన పరావాక్కు.

2. పశ్యంతిః- నా[illegible] అ[illegible] వాయువు[illegible] కలగగానే పరానాడి ద్వారా ప్రేరణ అయి మూలాధారంలో [illegible] స్పష్టమవుతుంది. అందుకే మూలాధారగతమైనది పశ్యంతి.

**3. మధ్యమా:-** మూలాధారంలో ఉత్పన్నమైన వాయువు స్వాధిష్ఠాన మణిపూరాలను దాటి (సుషుమ్నద్వారా) అనాహతం చేరుతుంది. దీనిని మధ్యమా అంటారు.

**4. వైఖరి:-** ఆ వాయువు అనాహతంనుంచి విశుద్ధచక్రం చేరి, స్పష్టమైన అక్షరరూపం దాల్చి ఉచ్చరింపబడుతుంది. ఇది వైఖరీవాక్కు.

వీటిలో మొదటి మూడుస్థానములు మనుష్యులు తెలుసుకోలేరు. నాల్గవది అయిన వైఖరీ మాత్రము జనులందరికీ తెలుస్తుంది. అయితే శ్రీవిద్యలో కౌళ, సమయాచారులకు భేదమున్నది. కౌళమతస్థుల ప్రకారము పరావాక్కు స్థానము మూలాధారము. కాని ముందు కోరిక కలిగిన తరువాతనే వాక్కు పుడుతుంది. ఆ కోరిక సహస్రామందే పుడుతుంది కాబట్టి సహస్రారమే పరావాక్కు స్థానము అని సమయమత సిద్ధాంతము.

ఈ రకంగా సహస్రారంలో ఉన్న పరావాక్కుకు పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అని మూడు పేర్లున్నాయి. అవి ఏవిధంగా వచ్చాయి అంటే

యత్కుమారీ మంద్రయతే యద్యోషి ద్యత్పతివ్రతా
అరిష్టం యత్కించ క్రియతే అగ్ని స్తదనువేధతే॥

1. నిద్రావస్థ 2. ప్రయాణావస్థ 3. సుఖావస్థ వీటినే 1. కౌమారావస్థ 2. యోషిదవస్థ 3. పతివ్రతావస్థ అనికూడా అంటారు. మొదటి దశలో అది మూలాధారంలో మంద్రస్వరం చేస్తూ నిద్రిస్తూ ఉంటుంది. పరాకాశంలో స్ఫురణ కలగగానే ఆధారచక్రంలో వాయువు ఉత్పత్తి అవుతుంది. ఇదే పశ్యంతీ వాక్కు. ఆతరువాత అది ఊర్ధ్వముఖంగా ప్రయాణించి స్వాధిష్ఠాన మణిపూరాలుదాటి అనాహతంచేరి స్పష్టమైన స్వరం కలిగి ఉంటుంది. ఇది ప్రయాణావస్థ. దీనినే యోషిదవస్థ అనికూడా అంటారు. ఇది మధ్యమావాక్కు. ఆతరువాత మధ్యమా అని పిలువబడే ఆవాయువు విశుద్ధి చక్రంచేరి, స్పష్టమైన అక్షరరూపంలో ఉచ్చరింపబడుతుంది. ఇదే పతివ్రతావస్థ. దీనినే వైఖరీవాక్కు అంటారు.

శ్రీవిద్యలో కుమారీ, యోషిత్, పతివ్రతా అనే పేర్లు ఆ పరాత్పరికి చెప్పబడ్డాయి. అది ఏరకంగా అంటే

**1. బాలాత్రిపురసుందరి:-** ఈమె తొమ్మిది సంవత్సరములుకల బాలిక. అందుచేతనే ఐంహ్రీంశ్రీం అనే బీజాలతో సంపుటీకరణం చేస్తే ఈమంత్రంకూడా తొమ్మిది అక్షరాలలో ఉంటుంది.

ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః సౌః క్లీం ఐం ఈమెయే కుమారి అనబడుతున్నది.

**2. లలితా త్రిపుర సుందరి:-** ఈమె ప[illegible] సంవత్సరములుకలది. అందుచేతనే ఈదేవి పంచదశీ మహామంత్రంతో జపించబడుతూ ఉంటుంది.

క ఏ ఈ ల హ్రీం। హసకహలహ్రీం। సకలహ్రీం॥ ఈమెకు యోషిత్సంజ్ఞ చెప్పబడింది.

3. రాజరాజేశ్వరి:- ఈమె షోడశవర్షీయ, అందుచేతనే పతివ్రత అని, ఎల్లప్పుడూ సదాశివుని అంకభాగమందే ఉంటుందని చెప్పబడుతోంది. ఈమె పదహారు అక్షరములుకల షోడశాక్షరీ మహామంత్రంతో జపించబడుతుంది.

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం క ఏ ఈ ల హ్రీం।
హ స క హ ల హ్రీం। స క ల హ్రీం। సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ॥

సుషుమ్నానాడి సర్పాకారంలో ఉంది కాబట్టి ఇదే కుండలినీశక్తి అని కౌళాచారుల, హఠయోగులవాదం. ప్రాణాయామం చేసినప్పుడు నిద్రలో ఉన్న కుండలిని మేల్కొని, పూత్కారంచేస్తూ ఊర్ధ్వముఖంగా బయలుదేరి అనాహతం చేరినప్పుడు యోషిత్సంజ్ఞకలదని, సహస్రారంచేరినపుడు పతివ్రత అని, అప్పుడు చంద్రమండలంనుంచి సుధాధారలు స్రవిస్తాయని వీరిమతం.

'సహస్రారాంబుజారూఢా సుధాసారాభివర్షిణీ'

చంద్రమండలంనుంచి అమృతస్రావము కలిగినంత కాలము యోగికి సుఖప్రాప్తి కలుగుతుంది. అదే అనిర్వచనీయమైన బ్రహ్మానందము. కుండలినీ దశానిరూపణంచేస్తూ గౌడపాదులవారు తమ 'సుభగోదయస్తుతి'లో ఈ విధంగా అన్నారు.

కుమారీ యన్మంద్రం ధ్వనతిచ తతో యోషి దపరా
కులం త్యక్త్వా రౌతి స్ఫుటతిచ మహాకాలభుజగీ।
తతః పాతివ్రత్యం భజతి దహరాకాశకమలే
సుఖాసీనా యోషా భవసి భవసీత్కార రసికా॥

ప్రస్తుతకాలంలో కౌళాచారులున్నారు కాని హఠయోగులు లేరనే చెప్పవచ్చు. కౌళుల మాదిరిగానే హఠయోగులది కూడా మోక్షమార్గం కాదు. దీనితో అణిమాది అష్టసిద్ధులు సాధించవచ్చు, ఇహలోకంలో సుఖాలు పొందవచ్చు. అంతేకాని హఠయోగి జ్ఞానయోగి కానిదే మోక్షంపొందలేడు. ఈయోగాన్ని క్షపణకులు, కాపాలికులు, దిగంబరులు మొదలైనవారు చేస్తుంటారు. ఇది వేదబాహ్యము. జ్ఞానయోగము శుకమార్గము వంటిది కాగా, హఠయోగము వామదేవమార్గము వంటిది.

పరావాడి అనబడే సుషుమ్నానాడి మాతృకాస్వరూపిణి. మాతృకలు (అక్షరములు) విశుద్ధి చక్రంలో అకారము అతో మొదలయి ఆజ్ఞా చక్రంలో క్షకారాంతంగా ఆయా కమలాలలో దళాల రూపంలో ఉంటాయి. అక్షరాలు మొత్తం యాభై. అవి.

1. అచ్చులు - పదహారు 16

2. వర్గులు(క,చ,ట,త ప)- ఇరవది ఐదు 25

3.య,ర,ల,వ - (అంతస్థములు)నాలుగు 4

4. శ,ష,స,హ (ఊష్మములు) నాలుగు 4

5. క్ష - ఒకటి 1

------

మొత్తం అక్షరాలు - యాభై 50

-------

వీటిలో అ నుంచి అః వరకు గలవి -- అచ్చులు క నుంచి క్ష వరకు గలవి హల్లులు.

అచ్చులు శక్తి రూపాలు కాగా హల్లులు శివరూపాలని 'మాతృకా హృదయము' లో చెప్పబడింది.

> కకారాది క్ష కారాంతా వర్ణాస్తే శివరూపిణః॥
> సమస్త వ్యస్తరూపేణ షట్ త్రింశత్ తత్త్వవిగ్రహా॥
> అకారాది విసర్గాంతాః స్వరాః షోడశ శక్తయః॥
> నిత్యాషోడశకాత్మనః పరస్పర మమీయుతా॥

హల్లులు 34 --- ప్రకాశాంశ కాగా, అచ్చులు 16 --- విమర్శాంశ.

షట్చక్రాలు :

ఆత్మ ఒక్కటే సత్యము. అదే నిత్యము. అంటే జీవాత్మవేరు, పరమాత్మవేరుకాదు రెండూ ఒకటే. పరమాత్మ యొక్క స్వరూపమే జీవాత్మ. సాధకుడు తనలోని ఆత్మను ఆపరమాత్మలో ఐక్యం చెయ్యాలి. అంటే కావలసినది బాహ్యపూజలు కాదు. సగుణారాధన పనికి రాదు. "బాహ్యపూజా న కర్తవ్యా"అని చెప్పబడింది. బాహ్యపూజచెయ్యటం వల్ల ఐహికమైన కోరికలు తీరతాయి. అందుకే సాంసారికమైనటువంటి ఇహలోకానికి సంబంధించిన అర్థకామాలు ఒనగూడటానికి బాహ్యపూజలుకావాలి. "అంతరారాధనపరావైదికాబ్రహ్మవాదినః"అత్ర 'వైదికులు, బ్రహ్మవాదులు అయిన జ్ఞానులు, సాయుజ్యం కోరేవారు, అంతరారాధన మాత్రమే చేస్తారు. అంతరారాధన అంటే సాధకుడు తన శరీరంలోనే పరమాత్మను ఆవాహన చేసి, తానే పరమాత్మ అనే భావంతో షట్చక్రభేదనం చేసి సహస్రారంలో పరమాత్మను దర్శించాలి. దీనికి గాను శిష్యుడు గురువుగారి వద్ద అశ్వయుజ శుద్ధనవమినాడు ప్రాతఃకాల గురువునకు పాదాభివందనం చేసినప్పుడు, గురువు శిష్యుని తలమీదచేయి ఉంచి మళ్ళీ ఉపదేశం చేస్తాడు. దీన్నే హస్తమస్తక సంయోగము అంటారు. అప్పుడు గురువుగారు తన శిష్యునికి షట్చక్రభేదనముస్వా

చతుర్విధైక్య సంధానము ఉపదేశిస్తాడు. వాటిని గనక నిరంతరాభ్యాసం చేస్తే భగవత్సాక్షాత్కారం కలుగుతుంది.(చతుర్విధైక్యము, షడ్విధైక్యమనుసంధానము నాచే వ్రాయబడిన శ్రీవిద్యాదర్పణములో వివరించటం జరిగింది.)

మానవదేహంలో అరవైఆరు ఎముకలు, డెబ్బైరెండు వేలనాడులు, అర్థశేరు రక్తము, ఒకమణుగు నాలుగు సేర్ల మాంసము, అరసోలశ్లేష్మము సోలెడుపైత్యము, ముప్పైమూడు కోట్ల రోమాలు, ముప్పైమూడుమూరలు ప్రేగులు ఉంటాయి. వీటిలో అంతరారాధనకు కావలిసినవిషట్చక్రాలు. ఈ చక్రాలు గుదస్థానం దగ్గరనుండి సహ[illegible]రందాకా వ్యాపించి ఉంటాయి.

> మూలాధారంగుదస్థానం, స్వాధిష్ఠానంతు మేహనం.
> నాభిస్తుమణిపూరాఖ్యం, హృదయంచాబ్జమనాహతమ్।
> తాలుమూలం విశుద్ధాఖ్యం, ఆజ్ఞాంచనిటలాంబుజమ్

షట్చక్రాలు ఎక్కడ ఉన్నాయోముందుగామనం తెలుసుకోవాలి. షట్[illegible]చక్రాలు. వాటిస్థానాలు, అధిదేవతలు దళములు,మొదలగునవన్నీ ఈదిగువ ఇవ్వబడినాయి,మానవశరీరంలోని షట్చక్రాలు, వాటిపూర్తి వివరాలు ప్రక్కపటంలోచూపటం జరిగింది

| చక్రము | స్థానము | దళాలు | అధిపతి | దేవత | అక్షరాలు | తత్వము |
|---|---|---|---|---|---|---|
| 1. ఆధారము | గుదస్థానము | నాలుగు | గణపతి | సాకిని | వ,శ,ష,స | పృథివి |
| 2. స్వాధిష్ఠానము | లింగస్థానము | ఆరు | బ్రహ్మ | కాకిని | బ,భ,మ,య,ర,ల | అగ్ని |
| 3. మణిపూరము | నాభిస్థానము | పది | విష్ణువు | లాకిని | డ నుంచి ఫ వరకు | జలము |
| 4. అనాహతము | హృదయస్థానము | పన్నెండు | రుద్రుడు | రాకిని | కనుంచి ఠవరకు | వాయువు |
| .5. విశుద్ధిచక్రము | కంఠస్థానము | పదహారు | మహేశ్వరుడు | డాకిని | అనుంచి అఃవరకు | ఆకాశ |
| 6. ఆజ్ఞాచక్రము | భ్రూమధ్యస్థానము | రెండు | సదాశివుడు | హాకిని | హం,క్షం | మనస్సు |
| 7. సహస్రారము | బ్రహ్మరంధ్రము | వేయి | పరమేశ్వరుడు | యాకిని | సర్వవర్ణములు | ఆత్మ |

'సాయుజ్యముఅనేమాటకు జన్మరాహిత్యము,మోక్షము, జీవాత్మనుపరమాత్మలో చేర్చటము అనిఅర్థం. అర్చనము రెండురకాలు అని ఇదివరకే చెప్పటం జరిగింది. కౌళ,దక్షిణా చారాల్లో ఏవిధంగా భగవదారాధన చేసినప్పటికీ [illegible] [illegible] [illegible] అవుతుంది. జన్మరాహిత్యం కావాలంటే మానవుడు తననుగురించి తాను తెలుసుకోవాలి. తననుగురించితాను తెలుసుకున్నవాడే మహా పురుషుడు. అటువంటివ్యక్తి తననుతాను ఆ భగవంతుని

దర్శించకలుగుతాడు. సాధకుడు భగవంతునిదర్శించాలంటే షట్చక్రభేదనము చెయ్యాలి. షట్చక్రాలు ఎక్కడవుంటాయనేది ముందే చెప్పబడింది. సాధకుడు గురుముఖతః షట్చక్రభేదన, కుండలినీప్రభోధము తెలుసుకున్న తరువాతనేదీని సాధన చెయ్యాలి. షట్చక్రాలలో మొదటిది ఆధారచక్రము. దీన్నే మూలాధారము అంటారు.

**మూలాధారముః**

ఆధారస్తుచతుర్దళోరుణరుచి ర్వాసాంత వర్ణాశ్రయః

ఇదిసర్వాభూతమైనచక్రము. ఇదిగనకలేకపోతే శరీరం పైకిఎగిరిపోవటం గాని, క్రిందికి పడిపోవటం కానిజరుగుతుంది. 'మూల' అంటేగుదస్థానము. ఆధారచక్రం గుదస్థానంలో ఉంటుంది. ఇదిపృధిపీతత్త్వాత్మక మైనస్థానము. దీనికి అధిపతి గణపతి. ఇక్కడ నాలుగుదళాలతో కూడిన పద్మంఉంటుంది. లలితాసహస్రంలో ఈచక్రాన్నిగురించి వివరంగా చెప్పబడింది.

మూలాధారాంబుజారూఢా పంచవక్త్రాస్థిసంస్థితా
అంకుశాదిప్రహరణా వరదాదినిషేవితా
ముద్గౌదనాసక్తచిత్తా సాకిన్యంబాస్వరూపిణీ"

దీనివివరణ ఈవిధంగా ఉన్నది : షట్చక్రాల్లోను మొదటి చక్రాన్ని మూలాధారచక్రం అంటారు ఇదినాలుగు దళాలు కలిగిన పద్మము పృధివీ తత్త్వాత్మకము. దీని యొక్కకర్ణికలో అధిష్ఠించిన దేవతపేరు 'సిద్ధవిద్యా', పుట్టుకతోజ్ఞానవైరాగ్యములు కలవారుసిద్ధులు. వారు ఉపాసించువిద్య సిద్ధవిద్య. అణిమాది అష్టసిద్ధులు సాధించినవారు సిద్ధులు. వారు ఉపాసించేవిద్య సిద్ధవిద్య.

కాళీ తారా మహావిద్యా షోడశీ భువనేశ్వరీ
భైరవీ ఛిన్నమస్తా చ విద్యా ధూమవతీ తథా!
బగళా సిద్ధ విద్యా చ మాతంగీ కమలా[illegible]స్త్రికా
ఏతా దశమహావిద్యా స్సిద్ధ విద్యాః [illegible]కీర్తితాః

1. కాళి 6. భైరవి
2. తారా 7.ఛిన్నమస్తా
3. మహావిద్యా 8. ధూమవతీ
4. షోడశీ 9. బగళా
5. భువనేశ్వరీ 10మాతంగీ

అనేవి సిద్ధవిద్యలుగా చెప్పబడుతున్నాయి, ఆధారచక్రమునందు పసుపు రంగులో,

వర్తులాకారముగ భూమండలమున్నది. ఇక్కడ తెల్లని ఏనుగుమీద లం బీజముంటుంది. ఇది కుండలినీ స్థానము. దీనిమధ్య ఉన్నత్రికోణము, దానిమీద స్వయం భూలింగానికి మూడున్నర వలయాలుగాచుట్టుకుని కుండలినీశక్తి ఉంటాయి. ఇక్కడ ఉన్న సిద్ధవిద్యాదేవికి ఐదుముఖములు (శిరస్సులు) ఉంటాయి, అవి 1. సద్యోజాత, 2. వామదేవ, 3. అఘోర. 4. తత్పురుష 5. ఈశానములు. ఈదేవత ఎముకలయందుటుంది. చేతులయందు అంకుశము, కమలము,పుస్తకము,జ్ఞానముద్ర ధరించి ఉంటుంది.ఈచక్రానికి నాలుగుదళాలుంటాయి. వాటిలో వరుసగా 1. వరద 2. శ్రీ 3 షండా 4. సరస్వతీ, అనబడే దేవతలు ఉంటారు,సిద్ధవిద్యాదేవికి పెసరపప్పు,బియ్యము,బెల్లము,కొబ్బరి,పాలు,నెయ్యి కలిపివండిన పులగము (ముద్గాన్నము) నందుప్రీతి. మంత్రజపంలో బీజము,న్యాసము,కీలకము,మంత్రము అన్నీసకారసంకేతములుగా ఉంటాయి కాబట్టి సిద్ధవిద్యా దేవి 'సాకిన్యంబా' అనిపిలువబడుతుంది. యోగినీన్యాసమందు సాకినీ ధ్యానము ఈవిధంగాఉన్నది.

మూలాధారస్థపద్మే శ్రుతిదళ లసితే పంచవక్త్రాం త్రినేత్రాం
ధూమ్రాభామస్థిసంస్థాం సృణిమపి కమలం పుస్తకం జ్ఞానముద్రాం।
బిభ్రాణాం బాహుదండై స్సులలిత వరదాం పూర్వ శక్త్యావృతాం తాం
ముద్గాన్నాసక్తచిత్తాం మధుముద ముదితాం సాకినీం భావయామః॥

ఆధారచక్రంలో ఐదుముఖములు, మూడుకనులుకలిగిధూమ్రవర్ణముకలది, ఎముకలయందుండునది, అంకుశము,కమలము,పుస్తకము,జ్ఞానముద్రలనుచేతులందు ధరించినది వరద,సరస్వతిమొదలైనశక్తులచేపరివృతఅయినది,ముద్గాన్నము నందుఆసక్తికలది ఐరావతారూఢ అయిన సాకినీ దేవికి నమస్కరించుచున్నాను.

మూలాధారాధిష్ఠానదేవతా సాకినీయుక్తశ్రీగణ పతిస్వరూపిణ్యంబా
శ్రీపాదుకాంపూజయామి తర్పయామినమః॥

సౌందర్యలహరిలో శంకరభగవత్పాదులు ఆధారచక్రాన్నిగురించి ఈవిధంగా అన్నారు.

తవాధరే మూలే సహస మయ యాలాస్యపరయా
నవాత్మానం మన్యే నవరసమహాతాండవనటం।
ఉభాభ్యామేతాభ్యా ముదయవిధి ముద్దిశ్యదయయా
సనాథాభ్యాం జజ్ఞే సకలజననీ మజ్ఞగదిదమ్ ॥

ఆధారచక్రంలో శివాశివులకు భైరవీభైరవులని లేదా నవాత్మ, నవాత్మకుడు అని పేర్లు. వీరిద్దరూ ఎర్రని రంగుతో ప్రకాశిస్తూ శృంగారముతోకూడిన నాట్యముచేస్తూ, జగత్తునుసృష్టించే కార్యక్రమంలో నిమగ్నమై ఉంటారు.

షట్చక్ర నిరూపణంలో ఆధార 'ని గురించి ఈ విధంగా చెప్పబడింది.

1. అథాధారపద్మం సుషుమ్నాస్యలగ్నం
ధ్వజాధో గుదోర్ధ్వం చతుశ్శోణ పత్రం।
అధోవ క్త్రమద్యత్ సువర్ణాభవర్ణైః ॥
వకారాదిసాంతైర్యుతం వేదవర్ణైః

2 అముష్మిన్ ధరాయుశ్చతుష్కోణచక్రం
సముద్భాసిశూలాష్ట కైరావృతంతత్।
లసత్ పీతవర్ణం తటిత్ కోమలాంగం
తదంతే సమాస్తే ధరాయాః స్వబీజమ్॥

3 చతుర్బాహు భూషం గజేంద్రాధిరూఢం
తదంకే నవీనార్కతుల్య ప్రకాశః ।
శిశుః సృష్టికారీ లసద్వేదబాహుః
ముఖాంభోజ లక్ష్మీశ్చతుర్భాగభేదః ॥

4 వసేదత్ర దేవీ చ డాకిన్యభిఖ్యా
లసద్వేద బాహూ జ్వలా రక్తనేత్రా
సమానోది తానేక సూర్య ప్రకాశా
ప్రకాశం వహంతీ సదా శుద్ధబుద్ధేః ॥

5. వజ్రాఖ్యా వక్త్రదేశే వసతి సతతం కర్ణి కామధ్య సంస్థం
కోణంతత్ త్రైపురాఖ్యం కది దినవిలసత్ కోమలం కామరూపం।
కందర్పో నామ వాయు ర్నివసతి సతతం తస్య మధ్యే సమంతాత్
జీవేశో బంధుజీవ ప్రకరమభిహసన్ కోటిసూర్య ప్రకాశః ॥

6. తన్మధ్యే లింగరూపీ ద్రుతకనక కలాకోమలః పశ్చిమాస్యః
జ్ఞానధ్యానప్రకాశః ప్రథమకిసలయాకారరూపః స్వయంభూః ।
విద్యుత్ పూర్ణేందు బింబ ప్రకర కరచయస్నిగ్ధ సంతానహాసీ
కాశీవాసీ విలాసీ విలసతి సరిదావర్తరూప ప్రకారః ॥

7. తస్యోర్ధ్వే బిసతంతు సోదరలసత్సూక్ష్మా జగన్మోహినీ
బ్రహ్మద్వారముఖం ముఖేన మధురం సంచారయంతీ స్వయమ్।
శంఖావర్తనిభా నవీనచపలా మాలావిలాసాస్పదా
సుప్తా సర్పసమా శివోపరిలసత్సార్ధ త్రివృత్తా కృతిః ॥

8. కూజంతీ కులకుండలీ చ మధురం మత్తాలిమాలాస్ఫుటం
వాచం కోమలకావ్యబంధరచనా భేదాతిభేదక్రమైః ।
శ్వాసోచ్ఛ్వాసవిభఞ్జనేన జగతాంజీవో యయాధార్యతే
సామూలాంబుజగహ్వరే విలసతి ప్రోద్దామ దీప్తావళిః ॥

9. తన్మధ్యేపరమా కలాతికుశలాసూక్ష్మాతి సూక్ష్మాపరా
నిత్యానంద పరంపరాతివిగలత్పీయూషధారాధరాః ।
బ్రహ్మాండాది కటాహ మేవసకలం యద్భాసయాభాసతే
సేయం శ్రీపరమేశ్వరీ విజయతే నిత్య ప్రబోధోదయా॥

ఆధారము నాలుగు దళాలు ఉన్న పద్మము లింగస్థానానికి క్రిందగా, గుదస్థానానికి దగ్గరలో ఉంటుంది. దీని దళాలు ఎర్రగా ఉంటాయి. ఇది అధోముఖంగా ఉంటుంది. ఇక్కడ నాలుగుదళాలయందు వరద, శ్రీ, షండా, సరస్వతి అనబడు నాలుగుఅక్షరాలు, శక్తులరూపంలో ఉంటారు. ఈ దళాలు దక్షిణావృతంగా అంటే ఎడమ నుండి కుడికి ఉంటాయి. ఈ పద్మానికి మధ్య భాగంలో చతురస్రాకారమైన పృథివీమండలమున్నది. అది పీతవర్ణములో ఉంటుంది. ఈ మండలానికి ఎనిమిది దిక్కులందు ఎనిమిది శూలములు ఉంటాయి.

మూలాధారే ధరాచక్రం చతుష్కోణం ప్రియంవదే
పీతవర్ణం పరివృతం చాష్టశూలైః కులాచలైః॥

మూలాధారమందు పసుపువర్ణము కల చతురస్రాకారమైన పృథివీ మండలమున్నది.కులపర్వతములే అష్టశూలములుగా ఇక్కడ ఉన్నాయి. దీని యందు'లం' పృథివీ బీజమున్నది. 'లం' అనేదే ఇంద్ర బీజము. ఇది పచ్చని రంగుతో పెద్దపెద్ద చేతులతో వజ్రాయుధము ధరించి, ఐరావతమునధిరోహించి ఉన్నది. దాని అంకభాగమున శిశురూపంలో ఉన్న బ్రహ్మ ఉన్నాడు. అతడికి నాలుగు చేతులున్నాయి. అతడే ఇంద్రుడు అని యామళగ్రంథాలుచెబుతున్నాయి. ఇక్కడకు కొద్దిగా పైభాగాన ఉన్న స్వయంభూలింగానికి మూడున్నర వలయాలుగా చుట్టుకుని అధోముఖంగా కుండలినీశక్తి నిద్రిస్తూ ఉంటుంది.

కుండలిని తనముఖముచేత బ్రహ్మరంధ్రాన్ని కప్పి ఉంచుతుంది. కుండలిని తేజస్సు విద్యుత్తు లాగా ఉంటుంది. అది మదించిన తుమ్మెదలాగా ధ్వని చేస్తూ ఉంటుంది.

**స్వాధిష్ఠానము :**

"స్వాధిష్ఠానమనేక వైద్యుతినిభం బాలాంత షట్పత్రకమ్"

ఇదిమూలాధారానికి కొద్దిగా పై భాగాన ఆరుదళాలతో కూడిన పద్మము. అగ్ని తత్త్వాత్మకము. దీని అధిదేవత బ్రహ్మ. లలితా సహస్రం లో స్వాధిష్ఠానాన్ని గురించి ఈ విధంగా ఉంది.

"స్వాధిష్ఠానాంబుజగతా చతుర్వక్త్రమనోహరా
శూలాద్యాయుధ సంపన్నా పీతవర్ణాతిగర్వితా
మేదోనిష్ఠా మధుప్రీతా బంధిన్యాదిసమన్వితా
దధ్యన్నాసక్తహృదయా కాకినీ రూపధారిణీ"

మూలాధారానికి కొద్దిగాపై భాగాన లింగస్థానమునందు స్వాధిష్ఠాన చక్రమున్నది. దీనికి ఆరుదళాలున్నాయి. ఇది అగ్నితత్త్వాక మైనచక్రము.బకారమునుండి లకారము వరకు వర్ణక్రమంలో ఆరుశక్తులు పరివేష్టించి ఉండగా, దీని మధ్యలో కాకిని దేవత ఉంటుంది. ఈమె పేరు సిద్ధేశ్వరి. దేవగణాలలో గోవులను రక్షించటానికి సిద్ధగణ మున్నది. ఈగణములచే సేవింపబడే దేవి కాబట్టి ఈమెను సిద్ధేశ్వరి అంటారు. కాశీక్షేత్రంలో సర్వసిద్ధులు ప్రసాదించే సిద్దేశ్వరి అను ఒక దేవత కూడా ఉన్నది. స్వాధిష్ఠానంలో సిద్ధేశ్వరీ దేవి నాలుగు ముఖములు కలిగి శూలము, పాశము, కపాలము, అభయముద్రలను ధరించి పచ్చనిశరీర కాంతితో మిలమిలామెరుస్తూ, మిక్కిలి సౌందర్యము వలన అతిశయము కలిగినదియై, మేధస్సు అనుధాతు వునం ఉంటుంది. శిరస్సునందు ఉండేతెల్లని మృదువైనపదార్థమే మేధస్సు. దీనినే మెదడుఅంటారు. మధువుమేదోవృద్ధి కరము. అందుచేతఈమెకుమధువునందు ప్రీతిఎక్కువ. స్వాదిష్ఠానపద్మ కర్ణికలో సిద్ధేశ్వరీదేవి ఉండగాచుట్టూ ఆరుదళాలలోను

1. బంధిని
2. భద్రకాళి
3. మహామాయ
4. యశస్విని
5. రమా
6. లంబోష్ఠి

అనేశక్తులు ఉంటాయి. ఈదేవతకుపెరుగుతో కలిపిన అన్నమందు ఆసక్తిఎక్కువ. దీన్నే 'దధ్యోనం' అంటారు ఈచక్రాధిదేవత అయిన సిద్ధేశ్వరికి బీజము, న్యాసము, మ మంత్ర అన్నీ కకారసంకేతముగానే ఉంటాయి. కాబట్టి ఈమెను'కాకిన్యంబా' అని కూడా అంటారు యోగినీ న్యాసంలో కాకినీ ధ్యానము ఈవిధంగా ఉంది.

స్వాధిష్ఠానాఖ్యపద్మే రసదళలసితే వేదవక్త్రాం త్రినేత్రాం
హస్తాభ్యాం ధారయంతీం త్రిశిఖగుణ కలాపాభయాన్యాత్తగర్వాం।
మేదోధాతు ప్రవిష్టా మళిముదముదితాం బందినీముఖ్య యుక్తాం
పీతాం దధ్యోదనేష్టామభిమత ఫలదాం కాకినీం భావయామః ॥

ఆరుదళములు గల ఈపద్మంలోనాలుగుముఖములు, మూడుకనులు కలిగి, చేతులందు త్రిశూలము, పాశము, కపాలము, అభయముద్రలు ధరించి పసుపువర్ణముతో ప్రకాశించునది, మిక్కిలిసౌందర్యము చేతగర్వముకలది, మేదస్సుఅను ధాతువునందుండునది, మద్యముచేతపంతసించునది బంధిని మొదలగుశక్తులచేపరివేష్టింపబడినది, దధ్యన్నముమీద ఆసక్తికల కాకినీదేవతకు నమస్కరించుచున్నాను.

స్వాధిష్ఠాన దేవతా కాకినీ యుక్త బ్రహ్మస్వరూపిణ్యంబా
శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః.

శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలో స్వాధిష్ఠాన చక్రాన్ని ఈవిధంగా వర్ణించారు,

తవ స్వాధిష్ఠానే హుతవహ మధిష్ఠాయ నిరతం
తమీడేసంవర్తం జనని మహతీం తాం చ సమయాం।
యదాలోకే లోకాన్ దహతి మహతి క్రోధకలితే
దయార్ద్రా యాదృష్టిః శ్శిశిర ముపచారం రచయతి॥

స్వాధిష్ఠానము అగ్నిస్థానము. ఇక్కడ ఉండే అగ్నిని సంవర్తాగ్ని అంటారు. ఇక్కడ ఉండేశివుడు సంవర్తాగ్నియైలోకాలను దహించివేస్తుంటే దేవితనకరుణా దృక్కులతో ఆలోకాలను శమింపచేస్తూ ఉంటుంది. స్వాధిష్ఠానకమలము గురించి షట్చక్రని రూపణ లోఈవిధంగా ఉన్నది.

సిందూర పూరరుచిరారుణ పద్మమన్యత్
సౌషుమ్న మధ్యఘటితం ధ్వజమూలదేశే।
అంగచ్ఛదైః పరివృతం తటిదాభవర్ణై
ర్వార్ద్యైః స బిందులసితైశ్చ పురందరాం తైః॥
తస్యాంతరే ప్రవిలస్విశద ద్వి ప్రకాశ
మంభోజమండల మథో వరుణస్యతస్య।
అర్ధేందు రూపలసితం శర దిందు శుభ్రం

వంకార బీజమమలం మక రాధిరూఢమ్॥

తస్యాంక దేశకలితో హరి రేవపాయాత్

నీలప్రకాశరుచిర శ్రియమాదధానః ॥

పీతాంబరః ప్రథమయౌవన గర్వధారీ

శ్రీవత్సకౌస్తుభధరో ధృతవేదబాహుః॥

అత్రైవభాతి సతతం ఖలు రాకిణీసా

నీలాంబుజోదర సహోదర కాంతిశోభా।

నానాయుధోద్యతకరైర్లసితాంగ లక్ష్మీ

ర్దివ్యాంబరాభరణ భూషితమత్తచిత్తా॥

స్వాధిష్ఠానాఖ్యమేతత్సరసిజమమలంచింత యేద్యోమనుష్య

స్తస్యాహంకారదోషాదిక సకలరిపుః క్షీయతే దక్షిణేన।

యోగేశః సో ఽపి మోహాద్భుత తిమిర చయే భానుతుల్యప్రకాశో

గద్యైః పద్యైఃప్రబంధైర్విరచయతి సుధావాక్య సందోహలక్ష్మీః॥

స్వాధిష్ఠానము, ఆధారచక్రానికి కొద్దిగాపైభాగానలింగస్థానంలో సిధూరపురంగులో ఉంటుంది. దానికి ఆరు దళాలున్నాయి. వాటియందు బంధిని నుండి 'లంబోష్ఠి వరకు శక్తులు విద్యు ల్లతలలాగాప్రకాశిస్తుంటాయి. ఈమండలము అర్ధచంద్రాకారం లో ఉంటుంది. అయితే ఇది పద్మమువలె ఉంటుంది అని కొన్నిగ్రంధాలలో ఉంది. దీనికి అధిదేవత బ్రహ్మ.బీజము 'వం.' ఆధారస్వా ధిష్ఠానాలు రెండూ అంధకారబంధురాలు. ఐహికవాంఛాసక్తులైన కౌళులు ఇక్కడ ఉపాసన చేస్తారు, సమయులకు ఇక్కడ అధికారంలేదు.

మణిపూరకము :

రత్నాభం మణిపూరకం దశదళం డాద్యం ఫకారాంతకం

నాభిస్థానంలో పదిదళాలతో ప్రకాశించే పద్మాన్ని మణిపూరము అంటారు. ఇది జలతత్త్వాత్మక మైనది. దీనిలో ఆధారస్వాధిష్ఠానాలకు ప్రతీకగా పదిదళాలుంటాయి. లలితాసహస్రంలో దీన్నిగురించి ఈవిధంగా ఉంది.

మణిపూరాబ్జనిలయా వదనత్రయసంయుతా

వజ్రాధికాయుధోపేతా డామర్యాదిభిరావృతా

రక్తవర్ణా మాంసనిష్ఠా గుడాన్న ప్రీతమానసా

సమస్త భక్త సుఖదా లాకిన్యంబాస్వరూపిణీ॥

నాభిస్థానంలో పదిదళాలతో ప్రకాశించే చక్రాన్ని మణిపూరముఅంటారు. దీనికి పదిదళాలుంటాయి.

ఈపద్మముకర్ణికలో 'వయోవస్థా వివర్జితా' అనిపిలవబడు దేవత ఉంటుంది పదిదళాలలోను.

| | |
|---|---|
| 1. డామరి | 6. దాక్షాయణి |
| 2. ఢంకారిణి | 7. ధాత్రి |
| 3. ణామిరి | 8. నందా |
| 4. తామసి | 9. పార్వతి |
| 5. స్థాణ్వీ | 10. ఫట్కారిణి |

శక్తులు పరివేష్టించి ఉండగా మధ్యలో వయోవస్థా వివర్జితా అనబడుదేవత ఉంటుంది. ఈమెకు బాల్యము. కౌమారము, యౌవనము,మొదలైన శారీరకమైన అవస్థలు లేవు కాబట్టి ఆమెను వయోవస్థా వివర్జితా అంటారు. ఈమెఎల్లప్పుడు పదహారు సంవత్సరముల ప్రాయములోనే ఉంటుంది, నిత్యయౌవనవతి, చేతులయందు వజ్రము, శక్తి, దండము, అభయముద్రలు కలిగి, రక్తమువలె ఎర్రని కాంతితో, మాంసమునందు అభిమానము కలిగి ఉంటుంది. ఈదేవి మాంసము అనబడేధాతువు నందు అభిమానము కలిగి ఉంటుంది. శరీర పుష్టినిచ్చేది మాంసము ఈదేవతను అర్చిస్తే శరీరంలో మాంసవృద్ధి జరుగుతుంది. ఈమెకు గుడాన్నమునందు ప్రీతిఎక్కువ. ఈదేవతను పూజించి, గుడాన్నమునివేదన చేసినట్లైతే సమస్త సుఖాలు ప్రాప్తిస్తాయి అని చెప్పబడింది. అర్తులు, అర్థార్తులు, జిజ్ఞాసులు, జ్ఞానులు మొ॥ వలుగాగల అన్నిరకాల భక్తులకు సుఖములభిస్తుంది. ఈదేవత బీజము,న్యాసము మంత్రము అన్నీ ల కారసంకేతములుకాబట్టి ఈమెను'లాకిన్యంబా' అంటారు, యోగినీన్యాసంలో లాకినీ ధ్యానము:

దిక్పత్రే నాభిపద్మే త్రివదన విలసద్దంష్ట్రినీం రక్తవర్ణాం
శక్తిం దంభోళిదండామభయమపి భుజైర్ధారయంతీం మహోగ్రాం।
డామర్యాద్యైఃపరీతాం పశుజనభయదాం మాంసధాత్వైకనిష్ఠాం
గౌడాన్నాసక్తచిత్తాం సకల సుఖ కరీం లాకినీం భావయామః॥

మూడుముఖములు,కోరలుకలది, రక్తమువలె ఎర్రనిరంగుతో ప్రకాశించునది, మాంసమందుండునది,గుడాన్నమందు ప్రీతికలది,డామరిమొదలైన పదిమంది శక్తులచే పరివేష్టింపబడినది, అందరికీ సుఖములనిచ్చునది అయిన లాకినీశక్తికి నమస్కరిచు చున్నాను.

మణిపూరాధిష్ఠాన దేవతా లాకినీయుక్తవిష్ణుస్వరూపిణ్యంబా
శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

సౌందర్యలహరిలో శంకరులవారు మణిపూరచక్రాన్ని ఈవిధంగా వర్ణించారు

తటిత్వం తం శక్త్యా తిమిరపరిపంథిస్ఫురణయా
స్ఫురన్నానారత్నాభరణపరిణద్ధేంద్రధనుషమ్।
తమశ్శ్యామం మేఘం కమపి మణిపూరైకశరణమ్
నిషేవే వర్షం తం హరమిహిరతప్తం త్రిభువనమ్॥

మణిపూరమందున్న మేఘముశ్యామవర్ణముకలది. అంధకారము నుపోగొట్టు మెరుపు తీగలతో కూడినటువంటిది. ఇదినానావిధములైన రత్నములచేత తయారుచేయబడి ఉంటుంది. స్వాధిష్ఠానములోదగ్ధమైనలోకాలను మరలశివాశివులు పునరుత్పత్తి చేస్తుంటారు. మణిపూరముగురించి 'షట్చక్రనిరూపణ' లో ఈవిధంగా ఉన్నది.

తస్యోర్ధ్వే నాభిమూలే దశదళలసితే పూర్ణమేఘప్రకాశే,
నీలాంభోజప్రకాశై రుపహితజరరే డాదిఫాంతైః సచంద్రైః॥
ధ్యాయేద్వైశ్వానరస్థారుణమిహిరసమం మండలం తత్ త్రికోణం
త ద్బాహ్యేస్వస్తికాఖ్యైస్త్రిభిరభిల సితంతత్రవహ్నేః స్వబీజమ్॥
ధ్యాయేన్మేషాధి రూఢంనవతపన నిభం వేదబాహూజ్జ్వ లాంగం,
తత్క్రోడే రుద్రమూర్తి ర్నివసతి సతతం శుద్ధసిందూరరాగాః
భస్మాలిప్తాంగభూషాభరణసితవపుర్వృద్ధ రూపీ త్రినేత్రో
లోకానామిష్ట దాతాభయలసితకరః సృష్టి సంహార కారీ॥
అత్రాస్తేలాకినీ మా సకలశుభకరీ వేదబాహూజ్జ్వలాంగీ
శ్యామా పీతాంబరాద్యైర్వివిధవిరచనాలంకృతా మత్త చిత్తా।
ధ్యాత్వై తన్నాభిపద్మం ప్రభవతి నితరాం సుహృతా పాలనే వా,
వాణీతస్యాననాబ్జే నివసతి సతతం జ్ఞాన సందోహలక్ష్మీః॥

నాభిస్థానంలో పదిదళాలు గలపద్మము మేఘవర్ణము కలిగి ఉన్నది. దీనికర్ణికయందున్న లాకినీ దేవి డామరి,ఫట్కారిణి మొదలైన పదిశక్తులచే పరివృత అయి ఉన్నది, దీనికర్ణికలో అగ్నిమండలమైన త్రికోణము ఎర్రనిరంగులో ఉన్నది. ఇక్కడ అగ్ని బీజము మేష వాహనముపైన ఉన్నది. ఈబీజము యొక్క అంకభాగంలో సింధూరవర్ణము కల రుద్రమూర్తి ఉంటాడు. అతడు భస్మమురాచుకునితెల్లగా ఉంటాడు. త్రినేత్రుడు అభయ, వరదముద్రలు ధరించి ఉంటాడు ఈయన సృష్టిసంహారకారి. ఇక్కడ ఉన్న లాకినీదేవి నాలుగు చేతులతో, శ్యామవర్ణముకలిగి, పీతాంబరము, రకరకాల ఆభరణాలు ధరించి ఉంటుంది. ఈమెముఖమునసరస్వతీ దేవిపలే

జ్ఞానమయంగా ప్రకాశిస్తూ ఉంటుంది,
స్వాధిష్ఠానమణిపూరాలస్థానాలనుగురించి భిన్నాభిప్రాయాలున్నాయి. కొంతమంది ప్రకారము స్వాధిష్ఠానము అగ్ని స్థానము కాగా కొంతమంది ప్రకారము ఇదిజలస్థానము, కాబట్టి కొన్నిచోట్ల మణిపూరము అగ్నిస్థానము అని,మరికొన్నిచోట్ల జలస్థానము అని అంటారు.

**అనాహతము:**

పత్రైర్ద్వాదశభి స్త్వనాహతపురీహైమీకరాం తాన్వితాం

హృదయస్థానంలో పన్నెండుదళాలతో ఉండే వాయుతత్త్వాత్మకమైనచక్రాన్ని అనాహతము అంటారు, దీనిలో పణిపూరానికి ప్రతీకగాపది,విశుద్ధి, అజ్ఞాచక్రాలకు ప్రతీకగా రెండు మొత్తం పన్నెండు దళాలుంటాయి. ఇదిబంగారు రంగులో ఉంటుంది. లలితాసహస్రంలో దీన్నిగురించి ఈవిధంగా ఉన్నది.

అనాహతాబ్జనిలయా శ్యామాభా వదనద్వయా
దంష్ట్రోజ్వలా క్షమాలాదిధరా రుధిరసంస్థితా
కాళరాత్ర్యాదిశక్త్యౌఘవృతా స్నిగ్ధౌదనప్రియా
మహావీరేంద్రవరదా రాకిన్యంబాస్వరూపిణీ॥

హృదయస్థానంలో పన్నెండు దళాలతో విలసిల్లే పద్మాన్ని అనాహతం అంటారు. ఇది వాయుతత్త్వాత్మకమైనది, హతము (నాశనము) కానటువంటి ధ్వనిజనించేస్థలము అనాహతము. దీనికర్ణికలో 'వామదేవి' అనే దేవత ఉంటుంది.అతి సుందరమైన శరీరలావణ్యముకలది వామదేవి. సదాశివుని పంచవ్యూహములలో ఉత్తరము వైపున్నవాడు వామదేవుడు. అతనిశక్తి వామదేవి. ఈమెనల్లరంగు కలిగి ఉంటుంది. రెండు శిరస్సులు, పందికోరలవలె కోరలు కలిగి చేతులయందు అక్షమాల శూలము, కపాలము డమరుకము ధరించి ఉంటుంది రుధిరమునః అధిదేవత.

| | |
|---|---|
| 1. కాళరాత్రి | 7. ఛాయా |
| 2. ఖాతీత | 8. జయా |
| 3. గాయత్రి | 9. ఝుంకారి |
| 4. ఘంటాధారిణి | 10. జ్ఞానరూపా |
| 5. జ్ఞామిని | 11. టంకహస్తా |
| 6. చంద్రా | 12. ఠంకారిణి. |

అనుపన్నెండు శక్తులు ఈమెనుపరివేష్టించి ఉంటాయి. ఈమెస్నిగ్ధాన్నప్రియ, అనగా నేతితోతడిపిన

అన్నమునందు : ప్రీతి కలది. మహావీరేంద్రులు అంటే ఆత్మసాక్షాత్కారము పొందిన మహాత్ములు, శ్రీవిద్యోపాసకులలో శ్రేష్ఠఅనుభవించేవారు. అట్టివారికి వరములిస్తుంది. ఈమెయొక్క మంత్రము,లు. జాగ్రత్ స్వప్న సుషుప్తి అనబడే అవస్థాత్రయంలో తురీయాతీతము బీజము, కీలకము అన్నీ రకారసంకేతముగా ఉంటాయి కాబట్టి ఈమెను 'రాకిన్యంబా' అంటారు. యోగినీన్యాసంలో రాకినీదేవిధ్యానము ఈవిధంగా ఉన్నది.

హృత్పద్మే భానుపత్రే ద్వివదనలసితాం దంష్ట్రిణీం శ్యామవర్ణాం
చక్రం శూలం కపాలం డమరుమపి భుజైర్ధారయంతీం త్రినేత్రాం।
రక్తస్థాం కాళరాత్రి ప్రభృతి పరివృతాం స్నిగ్ధభక్తైకసక్తాం
శ్రీమద్వీరేంద్ర వంద్యామభిమత ఫలదాం రాకినీం భావయామః॥

హృదయస్థానమునున్న అనాహతము పన్నెండు దళములు, వాయుతత్త్వము హేమవర్ణముకలది. దీనికర్ణికలో ఉన్నరాకినీదేవత రెండు ముఖములు, మూడునేత్రములు, కోరలుకలిగిచేతులయందు అక్షమాల, శూలము, కపాలము, డమరుకము ధరించినది,నల్లనిరంగుకలది, రక్తమునందు ఉండునది, నేతితోకలిపిన అన్నమందు ప్రీతికలది, కాళరాత్రి మొదలు ఠంకారిణి వరకు పన్నెండు మంది శక్తులతో ఆవరింపబడినది, మహాపండితులచేనమస్కరింపబడునది అయిన రాకినీదేవికి నమస్కరిస్తున్నాను.

అనాహతాధిష్ఠానదేవతారాకినీ యుక్తరుద్రస్వరూపిణ్యంబా
శ్రీపాదుకాం పూజయామి తర్పయామినమః॥

సౌందర్యలహరిలో శంకరభగవత్పాదులవారు అనాహతపద్మాన్ని ఈవిధంగావర్ణించారు

సమున్మీలత్సంవిత్కమలమకరందైక రసికం
భజే హంసద్వంద్వం కిమపి మహతాం మానసచరం।
యదాలాపాదష్టాదశ గుణితవిద్యాపరిణతి
ర్యదాదత్తే దోషాద్గుణమఖిల మద్భ్యఃపయఇవ

అనాహతంలో శివశక్తులు రాజహంసల రూపంలో ఉంటారు. సాధకులు ఆహంసమిథునాన్నే ఆరాధిస్తారు. ఇక్కడ భగవతి శివశక్తి సంపుటమైన ఇరవైఆరవ తత్త్వము. ఈతత్త్వాన్ని సేవించేవాళ్ళు అష్టాదశవిద్యలయందు అనమానులవుతారు. అనాహతచక్రాన్ని గురించి షట్చక్రనిరూపణలో ఈవిధంగా ఉంది.

తస్యోర్ధ్వేహృదిపంకజం సులలితం బంధూక కాంత్యుజ్జ్వలం
కాద్యైర్ద్వాదశవర్ణకై రుపహితం సిందూరరాగాన్వితైః॥

ప్ర
నామ్నా ఽనాహతసంజ్ఞకం సురతరుం వాఛ్ఛాతిరిక్త దం
వాయోర్మండల మత్ర ధూమసదృశం షట్కోణ శోభాన్వితమ్॥
తన్మధ్యేపవనాక్షరం చ మధురం ధూమావలీధూసరం
ధ్యాయే త్పాణిచతుష్టయేన లసితం కృష్ణాధిరూఢంపరమ్।
తన్మధ్యేకరుణానిధాన మమలం హంసాభ మీశాభిధం
పాణిభ్యామభయం వరం చ విదధల్లోక త్రయాణామపి॥
అత్రాస్తే ఖలు కాకినీనవతటి త్పీతాత్రిణేత్రాశుభా
సర్వాలంకరణాన్వితా హితకరీ సమ్యగ్జనానాం ముదా।
హస్తైఃపాశకపాల శోభ నవరాన్ సంబిభ్రతీ చాభయ్॥
మత్తా పూర్ణ సుధారసార్ద్రహృదయా కంకాళమాలాధః
ఏతన్నీరజకర్ణికాంతర లసచ్ఛక్తిస్త్రికోణాభిధా
విద్యుత్కోటి సమానకోమల వపుః సాస్తేతదాంతర్గతః।
బాణాఖ్యః శివలింగ కోఽపికనకాకారాంగ రాగోజ్జ్వలా
మౌలౌ సూక్ష్మవిభేద యుఙ్మణిరివ ప్రోల్లాస లక్ష్మ్యాలయః॥
ధ్యాయే ద్యోహృది పంకజం సురతరుంశర్వస్య పీఠాలయం
దేవస్యానిలహీన దీపకలికా హంసేన సంశోభితమ్।
భానోర్మండల మండితాంతర లసత్కింజల్క శోభాధరం
వాచామీశ్వర ఈశ్వరోఽపి జగతాం రక్షావినాశోక్షమః॥

హృదయస్థానమునందు అనాహత పద్మమున్నది. అది బంధూకవర్ణము (మంకెనపువ్వు) కలది దానికి పన్నెండు దళాలున్నాయి. వాటిలో కాళరాత్రి నుంచి ఠంకారిణి వరకు శక్తులు ఆదళాలలో ఉంటాయి. ఈచక్రము సాధకులకోర్కెలను తీరుస్తుంది. దీనికర్ణికలో షట్కోణాకృతిగా ధూమర్ణములో వాయుమండలమున్నది యం బీజము. దీని వాహనము లేడి ఇక్కడకాకినీ దేవత ఉన్నది ఆమెపీతవర్ణము, మూడుకనులు కలిగి, నాలుగు చేతులయందు శూలము కపాలము అక్షమాల,డమరుకము ధరించిఉంటుంది పుర్రెలమాల మెడనుధరించి ఉంటుంది

## విశుద్ధిచక్రము:

కంఠస్థానంలో పదహారుదళాలతో ఉంటుంది. ఇది ఆకాశ తత్వాత్మకమైనది దీనిని గురించి లలితా సహస్రంలో ఈవిధంగాఉంది

విశుద్ధచక్రనిలయా రక్తవర్ణా త్రిలోచనా
ఖట్వాంగాదిప్రహరణా వదనైకసమన్వితా
పాయసాన్నప్రియాత్వక్స్థాపశులోకభయంకరీ
అమృతాది మహాశక్తిసంవృతా డాకినీశ్వరీ॥

కంఠస్థానానికి కొంచెందిగువన విశుద్ధ చక్రమున్నది. ఇది తెల్లనిరంగుగల పద్మము పదహారు దళాలుకలిగి ఉంటుంది. అచ్చులు మొత్తం ఈదళాలలో ఉంటాయి. అంతర్యాగపరులు అంటే సమయాచారులు ఈదళాలని పూజిస్తారు. ఈపద్మము కర్ణికలో వజ్రేశ్వరి ఉంటుంది. ఈమెను వాగీశ్వరీ అనికుడా అంటారు. మాతృకావర్ణములు ఇక్కడ నుండి ప్రారంభమవుతాయి, వజ్రేశ్వరి తెలుపుతో కూడిన ఎరువు (పాటలవర్ణము) తో ఉంటుంది. ఈమెకు మూడునేత్రములుంటాయి అవి చంద్రసూర్యాగ్నులకు, ఋగ్, యజు సామవేదాలకు, భూతభవిష్యద్వర్తమానాలకు, సత్వరజస్తమోగుణాలకు ప్రతీకలు. ఈమెనాలుగుచేతులయందు ఖట్వాంగము (కర్రకుగుచ్చబడినమానవునిపుర్రె) ఖడ్గము,త్రిశూలము,చర్మము ధరించి,ఒకే ముఖంకలిగి ఉంటుంది. ఈదేవిపాయసాన్నప్రియ. చర్మమను ధాతువునందు అభిమానము కలది. జ్ఞానహీనులు,అద్వైత భావనలేని వారు అయి పశువులతో సమానమైన జనులకు భయంకలిగిస్తుంది. పదహారుదళాలలోనువరుసగా.

| | |
|---|---|
| 1. అమృత | 9. కార |
| 2. ఆకర్షిణి | 10. ష |
| 3. ఇంద్రాణి | 11. ఏకపదా |
| 4. ఈశాని | 12. ఐశ్వర్యా |
| 5. ఉషఃకేశ | 13.ఓంకారి |
| 6. ఊర్ధ్వ | 14. ఔషధి |
| 7. ఋద్ధిద | 15. అంబికా |
| 8. ఋూకార | 16. అఃక్షరా |

అనబడేపదహారుశక్తులచేత పరివేష్టించబడిఉంటుంది. ఈదేవతకు బీజము న్యాసము,మంత్రసంకేతముగా డ కారముంటుంది కాబట్టి ఈమె డాకిని అంటారు. యోగినీన్యాసములో విశుద్ధచక్రముగురించి ఈవిధంగా ఉంది.

గ్రీవాకూపే విశుద్ధౌ. నృపదళకమలే శ్వేతవర్ణాం త్రినేత్రాం
హస్తైః ఖట్వాంగ ఖడ్గా త్రిశిఖ మపి మహాచర్మ సంధారయంతీం।
వక్త్రేణైకేన యుక్తాం పశుజనభయదాం పాయసాన్నైకసక్తాం
త్వక్స్థాం వందే2మృతాద్యైః పరివృతవపుషాం డాకినీం వీరవంద్యాం॥

కంఠస్థానమున విశుద్ధచక్రము పదహారుదళములుగల పద్మము. దీని యందు ఎర్రని రంగులో మూడుకనులు కలిగి ఖట్వాంగము, ఖడ్గము, త్రిశూల... ధరించి ఒకేముఖముతో పశువులనబడు అజ్ఞానులకు భయముకలిగించుచు, పాయసాన్నమునందు ప్రీతికలిగి,అమృతమొదలైన పదహారుమంది శక్తులతోపరివృతయై... డాకినీదేవికి నమస్కరించుచున్నాను.

విశుద్ధచక్రాధిష్ఠానదేవతా డాకినీయుక్త జీవేశ్వరస్వరూపిణ్యంబా
శ్రీపాదుకాంపూజయామి తర్పయామినమః ।

శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలో విశుద్ధచక్రాన్ని ఈవిధంగా వర్ణించారు

విశుద్ధౌతే శుద్ధస్ఫటిక విశదం వ్యోమజనకం
శివం సేవేదేవీమపి శివసమాన వ్యవసితాం।
యయోఃకాంత్యా యాంత్యా శ్శశికిరణ సారూప్య సరణే
ర్విధూతాం తర్ధ్వాంతా విలసతి చకోరీవ జగతి॥

విశుద్ధచక్రంలో స్ఫటికమువలె స్వచ్ఛమైనవాడు ఆకాశతత్త్వాత్మ...యిన శివుడు, అతనితోసమానమైన దేవి ఉంటారు. ఇక్కడశివాశివులు శుద్ధస్ఫటికాలవలె...కా...గా ఉంటారు. ప్రాణాయామంచెయ్యటంవల్ల కాంతిని కోల్పోయిన షోడశకళలకు శివాశివులశరీర కాంతులచేమళ్ళీ ప్రకాశము కలుగుతుంది అంటే సాధకుడి అజ్ఞానము ...బడుతుంది. విశుద్ధచక్రము గురించి షట్చక్రనిరూపణలో ఈవిధంగా ఉన్నది.

విశుద్ధాఖ్యం కంఠేసరసిజమమలం ధూమధూమ్రావభాసం
స్వరైః సర్వైః శోణైర్దళపరిలసితైర్దీపితం దీ ప్తబుద్ధేః ।
సమాస్తే పూర్ణాంతేప్రథితతమనభోమండలంవృత్తరూపం
హిమచ్ఛాయా నాగోపరిలసితతనోః శుక్ల వర్ణాంబరస్య॥
భుజైః పాశాభీత్యంకుశవరలసితైః శోభితాంగస్యతస్య
మనోరం కేనిత్యం నివసతిగిరిజాభిన్న దేహో హిమాభః॥
త్రినేత్రఃపంచాస్యో లలితదశభుజో వ్యాఘ్రచర్మాం...
సదా పూర్వో దేవః శివ ఇతి చ సమాఖ్యానసిద్ధః ప్రసిద్ధః॥
సుధాసింధోః శుద్ధా నివసతి కమలే సాకినీ పీతవస్త్రా
శరం చాపం పాశం సృ...పి దధతీ హస్తపద్మై...
సుధాంశోః సంపూర్ణం శశపరిరహితంమండలం కర్ణికాయాం

మహామోక్షద్వారం శ్రియ మభిమతశీలస్య శుద్ధేంద్రియస్య॥
ఇహ స్థానే చిత్తం నిరవధి వినిధాయాత్మసంపూర్ణ యోగః
కవిర్వాగ్మీజ్ఞానీ స భవతి నితరాం సాధకః శాంతచేతాః॥
త్రికాలానాం దర్శీ సకలహితకరో రోగశోకప్రముక్త
శ్చిరంజీవీ జీవీ నిర పధివిపదాం ధ్వంసహంసప్రకాశః॥

కంఠస్థానమున పదహారు దళములు కలిగిన విశుద్ధి చక్రమున్నది. దీని దళములయందు అమృతామొదలు అఃక్షరా వరకు స్వరరూపు లైన శక్తులున్నాయి. దీనికర్ణికయందు వృత్త రూపంలో ఉన్న వియన్మండలంము చంద్రబింబమువలె ప్రకాశిస్తుంది. దీనికి బీజము హం ఆకాశ బీజము. దీనికి.(అబీజమునకు) నాలుగుచేతులున్నాయి. వాటియందు పాశము, అంకుశము, వరద, అభయముద్ర లుంటాయి. అబీజమందు ఐదుముఖములు, మూడుకనులు.పదిచేతులు కలిగి వ్యాఘ్రచర్మధారియైన సదాశివుడుంటాడు. ఈ చక్రము నకు అధిదేవత డాకిని. యోగాభిలాషులగువారికిది మోక్షద్వారము,

**అజ్ఞాచక్రముః**

హంక్షేత్యక్షరపద్మపత్ర యుగళం రత్నో పమాజ్ఞాపురీం

భ్రూమధ్యభాగంలో రెండుదళాలు కలిగిన చక్రాన్ని అజ్ఞాచక్రము అంటారు. ఈదళము లయందు హం, క్షం వర్ణములుంటాయి. లలితాసహస్రంలో అజ్ఞాచక్రంగురించి ఈవిధంగా ఉన్నది,

అజ్ఞాచక్రాబ్జనిలయా శుక్లవర్ణా షడానవా
మజ్జాసంస్థా హంసవతీముఖ్యాశక్తిసమన్వితా
హరిద్రాన్నైకరసికా హాకినీరూపధారిణీ

కనుబొమల మధ్యగలచక్రాన్ని అజ్ఞాచక్రము అంటారు. దీనిలో ఆధార, స్వాధిష్ఠానాలకు ప్రతీకగా రెండు దళాలుంటాయి. ఇదిమనస్తత్వాత్మకమైన చక్రము. దీనికర్ణికయందు గలదేవి సిద్ధమాత. పుట్టుకతోనేజ్ఞానవైరాగ్యములుకలసిద్ధులకుతల్లి, నమస్కరించినంత మాత్రంచేతనే భక్తులకోర్కెలుతీర్చు వరదాయిని. భృకుటిస్థానము గంగ యమున సరస్వతుల సంగమము, ఇడపింగళసుషుమల సంగమము. కూటత్రయము, నాదత్రయము ఇది త్రిపురానివాసస్థానము. శరీరంలోని ఇంద్రియాలకు ఇక్కడనుండి ఆజ్ఞలు జారీ అవుతాయి. అందుకనే దీనిని అజ్ఞాచక్రమన్నారు. ఇక్కడ సిద్ధమాత తెల్లనిశరీరచ్ఛాయతో, ఆరుముఖములుకలిగి ఉంటుంది కాబట్టి ఈమెను కుమారస్వామిశక్తిగా భావించారు. ఈ దేవత ఎముకలలోని మజ్జ యందు ఉంటుంది. ఈ చక్రములోని రెండుదళాలయందు హంసవతీ, క్షమావతీ అనుశక్తులుంటాయి,

ఈరెండింటినీ ఉచ్ఛ్వాస నిశ్వాసలుగా భావించాలి. ఈరెండూ ప్రముఖశివ ...య శక్తులు, అందుకే 'ముఖ్యశక్తినమన్వితా' అనిచెప్పటంజరిగింది. ఈమెకు హరిద్రాన్నము నందు ప్రీతి. ఈదేవత బీజము, న్యాసము, కీలకము, మంత్రము హ కారసంకేతములు. అందుకే ఈమెను 'హాకినీ' అంటారు,యోగినీ న్యాసములో హాకినీ ధ్యానము ఈవిధంగా ఉన్నది.

భ్రూమధ్యే బిందుపద్మే దళయుగకలితే వర్ణశుక్లం కరాబ్జై
ర్బిభ్రాణాం జ్ఞానముద్రాం డమరుక కమ లాక్ష మాలాంకపాలం ।
షడ్వక్త్రాధారమధ్యాం త్రినయన లసితాం సంహ ...వత్యాది యుక్తాం
హారిద్రాన్నైకసక్తాం సకల శుభకరీం హాకినీం భావయామః ॥

అజ్ఞాచక్రంలో తెల్లనిరంగుతో ఆరుముఖములు, మూడు కనులతో చేతులయందు కపాలము, అక్షమాల, డమరుకము, జ్ఞానముద్ర ధరించినది, మజ్జయందుండునది, హంసవతి క్షమావతి అనుశక్తు లచేపరివృత అయినది, హరిద్రాన్నమందుమక్కువ కలది, సకలసుఖములను ఇచ్చునది అయినహాకినీదేవికి నమస్కరించుచున్నాము.

ఆజ్ఞా చక్రాధిష్ఠానదేవతా హాకినీయుక్త పరమాత్మ
స్వరూపిణ్యంబా శ్రీపాదుకాంపూజయామినమః

సౌందర్యలహరిలో శంకరులవారు ఆజ్ఞాచక్రాన్ని ఈవిధంగావర్ణించారు.

తవాజ్ఞా చక్రస్థం తపనశశికోటి ద్యుతిధరం
పరం శంభుం వందే పరిమిళితపార్శ్వం పరచితా
యమారాధ్యన్.భక్త్యా రవిశశిరుచీనామ విషయే
నిరాలోకే లోకే నివసతి హి భాలోకభువనే॥

ఆజ్ఞాచక్రంలో శివాశివులు కోట్లకోలది సూర్యచంద్రులకాంతులతో ప్రకాశిస్తుంటారు. లొల్ల లక్ష్మీధరుడు 'కర్ణావసస్తుతి'లో

ఆజ్ఞాత్మక ద్వీదళపద్మగతేతదాసీం విద్యున్నిభే రవిశశిప్రయుతోత్కటాభే
ఒడగ స్థలప్రతిఫలత్కరదీపజాలి వత్ర్ణా ంసకలికేకమలాయతాక్షి.

అజ్ఞాచక్రస్వరూపమగుద్వీదళపద్మమందున్న ఓదేవీ, మెరుపుతీగవలె పది లక్షలసూర్య చంద్రులలకు మించినకాంతితో, విశాలమైన నేత్రములు ప్రకా... మనస్సున్నావు.

షట్చక్రనిరూపణలో అజ్ఞాచక్రాన్ని గురించి ఈవిధంగా ఉంది.

అజ్ఞానాంబుజం తద్ధిమకరసదృశం ధ్యానధామప్రకాశం
హక్షాభ్యాం వైదలాభ్యాం పరిలసితవపుర్నేత్ర పత్రంసుశుభ్రాం।

తన్మధ్యే హాకినీ సా శశి సమధవలావక్త్రషట్కం దధానా
విద్యాం ముద్రాం కపాలాం డమరుజలవటీం బిభ్రతీ శుద్ధచిత్తా॥
ఏతదత్పద్మాంతరాలేనివసతి చ మనః సూక్ష్మరూపంప్రసిద్ధం
యోనౌతత్కర్ణికాయా మితరశివపదం లింగ చిహ్నాప్రకాశం,।
విద్యున్మాలావిలాసం పరమకుల దం బ్రహ్మసూత్ర ప్రబోధం
వేదానామాదిబీజంస్థిరతర హృదయశ్చింతయే త్తత్క్రమేణ॥
ధ్యానాత్మా సాధకేంద్రో భవతి పరపురే శీఘ్రగామీ మునీంద్రః।
సర్వజ్ఞః సర్వదర్శీసకలహితకరః సర్వశాస్త్రా ర్థవేత్తా।
అద్వైతాచారవాదీ విలసతి పరమాపూర్వసిద్ధి ప్రసిద్ధో
దీర్ఘాయుః సోఽపికర్తా త్రిభువనభవనే సంహృతౌ పాలనే చ॥
తదంతశ్చ క్రే ఽ స్మి న్నివసతి సతతం శుద్ధ బుద్ధ్యాంతరాత్మా
ప్రదీపాభజ్యోతిః ప్రణవవిరచనారూపవర్ణప్రకాశః।
తదూర్ధ్వే చంద్రార్ధ స్తదుపరివిలసద్బిందురూపమకార
స్తద్యూర్ధ్వంనాదోఽసౌ జలధవళసుధాధారసంతానహాసీ ॥
ఇహస్థాణే లీనే సుసుఖసదనే చేతసి పురం
నిరాలంబా బధ్వాపరమగురుసేవా సువిదితామ్।
తవభ్యాసాద్యోగీ పవనసుహృదాం పశ్యతి కణాన్
తత స్తన్మధ్యాంతః ప్రవిలసితరూపానపి సదా॥
జ్వలద్దీపాకారాం తదను చ నవీనార్క బహుళ
ప్రకాశం జ్యోతిర్వా గగనధరణీ మధ్యమిళితం।
ఇహస్థానే సాక్షాద్భవతి భగవన్ పూర్ణవిభవే
ఽవ్యయః సాక్షీ వహ్నే : శశిమిహిర యోర్మండల ఇవ॥
ఇహస్థానే విష్ణో రతుల పరమామోదమధురే
సమారోప్య ప్రాణం ప్రముదితమనాః ప్రాణనిధనే।
పరం నిత్యం దేవం పురుషమజమాద్యం త్రిజగతాం
పురాణం యోగీ। : ప్ర ద్ర శతి చ వేదాంతవిదితమ్॥

అజ్ఞాచక్రము భ్రూమధ్యమున ఉన్నది ఇది శరీరంలోని అన్ని అ వయవాలకు అజ్ఞ నిచ్చుస్థానము. ఇదే గురువు యొక్క అజ్ఞ లభించుస్థానము, దానికి రెండుదళాలున్నాయి. అక్కడ ఉన్న అక్షరములు తెల్లనిరంగులో ఉంటాయి.

ఆజ్ఞాచక్రం తదూర్ధ్వేతు శుక్లం ద్విదళమండితం
కర్పూరహారలసితం మనో ౽ధిష్ఠితరంజితమ్

అని 'సమ్మోహనతంత్రం' లోచెప్పబడింది. దీనిలో ఆరుముఖములతో హాకినీశక్తి ఉన్నది, ఆమెతనచేతులందు పుస్తకము, అక్షమాల, కపాలము, డమరుకము, వరదఅభయముద్రలు ధరించినది. ఇది మనస్తత్త్వాత్మకమైనచక్రము. ఈచక్రమునందు శివుడువిద్యుత్‌కాంతులతో ప్రకాశించుచున్నాడు, ఇక్కడబీజము 'ఓం' ఇక్కడ ఉపాసన చేయు సాధకుడు జ్ఞానాత్ముడవుతాడు. సర్వజ్ఞుడై, సర్వదర్శి అయిన మునీంద్రుడు, అందరిక్షేమం కోరేవాడు,బ్రహ్మాద్వైతి అవుతాడు. సృష్టిస్థితిలయాలు కూడ చేయకలుగుతాడు. ఈచక్రంలో త్రికోణమున్నది. అత్రికోణంలో ప్రణవానికి ఆధారమైన (అ+ఉ) అక్షరాలుంటాయి. అది శుద్ధబుద్ధి. దానిమీద బిందురూపంలో 'మ' కారము ఉంటుంది.

యోగి అయిన సాధకుడు యోనిముద్రతోబంధించుకుని, పరమాత్మ స్వరూపుడైనగురువువలన ఈబంధనముతెలుసుకొని మనస్సును లయముచెయ్యాలి. అది ఆనందనిలయము సిద్ధాసనములో ఉండి యోనిముద్రప్రదర్శించాలి. సాధకుడు పద్మాసనంలోకూచుని ఎడమకాలిమడమతో గుదస్థానాన్నిమూయాలి. కుడి కాలును ఎడమకాలి మీద ఉంచాలి. అప్పుడుశరీరము,మెడ,తల,నిటారుగావుంచి మూతిని కాకిముక్కు వలెచేసి గాలి లో పలకుపీల్చి కుంభించాలి. బొటనవ్రేళ్ళతోముక్కు రంధ్రాలను మూసి,మిగిలిన వ్రేళ్ళతో నోటిని మూయాలి. ఇంద్రియాలను వదలివేసి అంటే మనసును శరీరంనుంచి వేరుచేసి మంత్ర పునశ్చరణచెయ్యాలి. ఆస్థితిలో మనస్సుకు ప్రాణానికి ఐక్యత చేకూరుతుంది.. యోనిముద్రవలన మనస్సుకు ఏకాగ్రతవస్తుంది. హంస అనేది జీవాత్మ జీవాత్మయొక్క అంశను ప్రాణము. ఈప్రాణముయొక్క ప్రభావముచేతనే మనస్సు చలిస్తుంది. హంసను అంటే జీవాత్మను గనక నిరోధించినట్లైతే ఏకాగ్రత సిద్ధిస్తుంది. అయితే ఖేచరీముద్రతోకుడా ఏకాగ్రతలభిస్తుంది. తరువాత యోగిదీపాకృతి గలజ్యోతిని చూడగలుగుతాడు. అదిబాలభానుడి వలె ప్రకాశిస్తూ ఉంటుంది. ఇక్కడభగవత్సాక్షాత్కారముకలుగుతుంది. ఆయన అవ్యయుడు. సృష్టి స్థితి లయకారకుడు. అదిశివశక్తి తత్త్వము. యోని, ఖేచరీముద్రలను ఇచ్చటచూపటం జరిగింది.

సహస్రారము.

తస్మాదూర్ధ్వమధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం
నిత్యానందమయీ సదా శివపురీ శక్తేనమస్కాత్వతం॥'

సహస్రారపద్మము బ్రహ్మరంధ్రానికి కొంచెందిగువన వేయిదళాలతో ఉంటుంది. అదినిత్యానందమయ మైనశివపురము. లలితాసహస్రంలో దీన్నిగురించి ఈవిధంగాచెప్పటం జరిగింది

సహస్రపద్మస్థా సర్వవర్ణోపశోభితా
సర్వాయుధధరా శుక్లసంస్థితా సర్వతోముఖీ
సర్వౌదనప్రీతిచిత్తా యాకిన్యంబాస్వరూపిణీ

షట్చక్రాలకుపైన, బ్రహ్మరంధ్రందగ్గర ఉండేచక్రాన్ని సహస్రదళపద్మము అంటారు. దీనికర్ణికలో యశశ్వినియనేదేవతఉంటుంది. సిద్దేశ్వరి, సిద్ధవిద్య, సిద్ధమాతా అనిచెప్పబడు ఈపరమేశ్వరి సకలప్రపంచానికి సిద్ధిప్రదయశస్సు అమెగొప్పదైన యశస్సుకలది. అందుకనే సహస్రారంలో ఉన్నఈదేవిని 'యశశ్విని' అంటారు ఈమెనే 'మేధాదేవి' అనికుడాఅంటారు. సహస్రారంలో ఉండే ఈదేవి ఎరుపు, తెలుపు, పసుపు, నలుపు,నీలము మొదలైన అన్నిరంగులతోనూకలసి చిత్రమైన కాంతితో ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ హేతువుచేత ఆమె 'సర్వవర్ణేమహాదేవీ సంధ్యావిద్యేసరస్వతి' అనిచెప్పబడుతోంది. అమృతామొదలుక్షమావతివరకు యాభైశక్తులచేతపరివృతయై అకారాదిక్షకారాంతము వర్ణక్రమంలో అనులోమవిలోమాలుగా ఒక్కొక్కసారికివంద చొప్పున పదివృత్తాలలోను వేయివందిశక్తులుంటారు. ఇక్కడదేవితన చేతులయందుఅన్ని రకాల అయుధాలను ధరించి ఉంటుంది. ఈమెశుక్లమను ధాతువునందుంటుంది. అన్నిదిక్కులకు ముఖములు కలిగిఉంటుంది. మంత్రశాస్త్రంలో బీజము, మంత్రము, కీలము, అన్నీ య కారసంకేతములు. అందుచేతనే ఆదేవిని 'యాకిన్యంబా' అంటారు. యోగిని వ్యాసంలో సహస్రారం గురించి ఈ విధంగా ఉంది.

ముండవ్యోమస్థపద్మే దశశతదళకే కర్ణికా చంద్ర సంస్థాం
రేతో నిష్ఠా సమస్తాయుధకలితకరాం సర్వతో వక్త్రపద్మామ్।
ఆదిక్షాంతార్ణ శక్తిప్రకర పరివృతాం సర్వవర్ణాం భవానీం
సర్వాన్నాసక్తచిత్తాం పరశివరసికాం యాకినీం భావయామః॥

బ్రహ్మరంధ్రానికి దిగువగా సహస్రారమున్నది. దీనికి వేయిదళాలున్నాయి. దీనికర్ణిక చంద్రమండలము. ఇక్కడ ఉండేదేవిపేరు యాకిని. ఆమేపరమేశ్వరి. శుక్లధాతువు కధిపతి. సర్వాయుధములు ధరించి, అన్నిరకాల భక్ష్యములందు ప్రీతికలిగి, అన్నిదిక్కులకు ముఖములుకలిగి ఉంటుంది. ఈమెను అకారమునుండిక్షకారము వరకు గల యోగినీగణముసేవిస్తూ ఉంటుంది, ఇది ఆత్మతత్వాత్త కమైన కమలము. యాకినీ దేవత మంత్రస్వరూపంఈవిదంగా ఉంటుంది.

యోహమస్మి బ్రహ్మాహమస్మి। అహమస్మి। బ్రహ్మాహమస్మి। తత్త్వమసి బ్రహ్మాహమస్మి। సోహం ప్రజ్ఞానస్మి సోహం బ్రహ్మాహమస్మి। ఆత్మైవేదగ్ం సర్వం। బ్రహ్మైవేదగ్ం సర్వం। సర్వమేతద్బ్రహ్మ। సర్వంఖల్విద బ్రహ్మ। బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి ॥

సౌందర్యలహరిలో శంకరభగవత్పాదులవారు సహస్రదళపద్మాన్ని ఈవిధంగా వర్ణించారు.

మహీంమూలాధారే కమపిమణిపూ రే హుతవహం
స్థితంస్వాధిష్ఠానే హృదిమరుత మాకాశ ముపరి।
మనః ?2పిభ్రూమధ్యే సకలమపి భిత్వాకులపథం
సహస్రారేపద్మే సహరహసి పత్యావిహరసే॥

షట్చక్రాలుదాటినతరువాత సహస్రదళపద్మంలో భగవతి పరమశివునితో విహరిస్తూ ఉంటుంది. సహస్రారం గురించి షట్చక్రనిరూపణలో ఈవిధంగా ఉంది.

లయస్థానం వాయో స్తదుపరిచ మహానాదరూపం శివార్థం
నిరాకారం శాంతం వరదమభయం శుద్ధి బుద్ధి ప్రకాశమ్।
యదా యోగీ పశ్యేద్గురుచరణయుగాంభోజసేవా సుశీల
స్తదావాచాం సిద్ధిః కరకమలతలే తస్యభూయాత్ సదైవ॥

యోగిఆజ్ఞాచక్రముదాటిన తరువాత మహానాదాన్ని దర్శిస్తాడు. అతడికివాక్సుద్ధికలుగుతుంది. మహానాదము నాగలి రూపంలో ఉంటుంది అది శాంతమైనది. వరప్రదాయని, అభయ ప్రదాయని, శుద్ధబుద్ధి ప్రకాశమైనది. వాయువుకు మహానాదము లయస్థానము.

తదూర్ధ్వే శంఖిన్యానివసతిశిఖరే శూన్యదేశే ప్రకాశం
విసర్గాధః పద్మం దశశతదళం పూర్ణచంద్రాతిశుభ్రమ్
అధోవక్త్రం కాంతం తరుణరవికలాకాంతి కింజల్కపుంజం
లకారాద్యై వర్ణై ప్రవిలసితవపుః కేవలానందరూపమ్ః

ఆశూన్యమందు, విసర్గకు క్రిందగా సహస్రదళ పద్మమున్నది. పూర్ణ చంద్రుని లాగా ప్రకాసిస్తూ ఉంటుంది. అది అధోముఖంగా ఉంటుంది. దాని కాంతి కిరణాలు సూర్యకిరణాలవలె ప్రకాశిస్తుంటాయి. అక్కడ అకారాది వర్ణ వర్ణములు ఉన్నాయి. అదికేవలానంద రూప మైనది.

సమాప్తే తస్యాంతః శశిపరిరహితః శుద్ధసంపూర్ణచంద్రః
స్ఫురజ్యోత్స్నాజాలః పరమరసచయ స్నిగ్ధ సంతానహాసీ।
త్రికోణం తస్యాంతఃస్ఫురతి చ సతతం విద్యుదాకారరూపం
తదంతః శూన్యం తత్సకల సురగణైః సేవితంచాతిగుప్తమ్॥

సహస్రదళపద్మంలో కళంకములేనటువంటి పూర్ణచంద్రుడున్నాడు. ఆ చంద్రమండలము మధ్యన త్రికోణమున్నది. దానియందు మహాశూన్యమున్నది. దానిని దే  లు రహస్యంగా సేవిస్తుంటారు.

సుగుప్తం తద్యత్నా దతిశయపరమామోద సంతానరాశైః
పరంకదం సూక్ష్మం సకల శశికలాశుద్ధరూప ప్రకాశమ్ ।
ఇహ స్థానే దేవః పరమశివసమాఖ్యానసిద్ధః ప్రసిద్ధః
స్వరూపీసర్వాత్మారసవిరసమితో ఽజ్ఞాన మోహాంధహంసః॥

ఆశూన్యము చాలా రహస్యమైనది. అతి ప్రయత్నము మీద గాని దానిని పొందలేరు. అది పరమామోదమైన సంతానరాశి. పరమశివుడు ఇక్కడే ఉంటాడు. ఆయన సర్వాత్మ స్వరూపి. అజ్ఞానమును, మోహమును పోగొడతాడు.

శివస్థానం శైవాః పరమపురుషం వైష్ణవగణా।
లపంతీతి ప్రాయో హరిహరపదం కేచిదపరే।
పదం దేవ్యా దేవీచరణయుగ లాంభోజరసికా।
మునీంద్రా అప్యన్యే ప్రకృతిపురుషస్థాన మమలమ్॥

శైవులీస్థానాన్ని శివస్థానమని, వైష్ణవులు పరమపురుషస్థానమని, మిగిలినవారు హరిహర స్థానము అని, ప్రకృతి పురుషుల స్థానమని, దేవీ భక్తులు దేవీస్థానమని అంటారు.

ఇదం స్థానం జ్ఞాత్వా నియతనిజచిత్తే నరవరౌ
నభూయాత్ సంసారే పునరపి న బద్ధస్త్రిభువనే।
సమగ్రాశాక్తః స్యాన్నియమమనసస్తస్యకృతినః
సదాకర్తుంఖగతిరపి వాణీ సునిమలా॥

సాధకుడికి భగవానుడు సుధాధారాసారముచే ఆత్మజ్ఞానము కలిగిస్తాడు. అప్పుడు సాధకుడు జీవాత్మ పరమాత్మల సమైక్యము సాధించి సర్వేశ్వరుని లాగా పరమహంస అవుతాడు. శైవులీస్థానాన్ని శివస్థానమని, వైష్ణవులు పరమపురుషస్థానమని, మిగిలినవారు హరిహర స్థానము అని, ప్రకృతి పురుషుల స్థానమని, దేవీ భక్తులు దేవీస్థానమని అంటారు.

ఈస్థానాన్ని తెలుసుకున్న సాధకుడికి పునర్జన్మలేదు. ఈ లోకంతో బంధము ఉండదు.అతనికి పాపపుణ్యాలు లేవు. సంసారబంధనాలు ఉండవు. అతనికి ఇష్టార్థసిద్ధి కలుగుతుంది. ఇక్కడ షోడశీకళ ఉంటుంది. బాలభానునివలె ప్రకాశిస్తూ ఉంటుంది. తామర తూడులోని దా  ములాగా సన్ననైనది. ఆమె భగవతి. జ్ఞానదాత్రి. త్రిభువనజనని. ఆమె యందు

నిత్యమైన శివపదము ఉన్నది. అది నిత్యానందమైనది. జ్ఞాన రూపమైనది. దీనినే బ్రహ్మము, హంసము, విష్ణుపదము,ఆత్మ జ్ఞానము, మోక్ష పదము అంటారు. ఇదే పరమపదము. ఇచటకు చేరిన యోగికి సాయుజ్యం లభిస్తుంది.
(షట్చక్రాలు, వాటిలో ఉండే దేవతల చిత్రాలకు నాచే వ్రాయబడిన, శ్రీవిద్యారహస్యం చూడండి.)

## శ్రీచక్రనిరూపణము

21 చక్రస్యాపి మహేశ్యాన భేదలేశోఽపిభావ్యతేవిబుధైః।
అనయో స్సూక్ష్మకారాపరైవ సా స్థూలయోశ్చ కాపి భిదా॥

శ్రీచక్రానికి, పరదేవతకు ఏమాత్రమూ భేదము లేదు.

పందొమ్మిదవ సూత్రంలో విద్యా దేవతలకు భేదము లేదని చెప్పబడింది. ఇప్పుడు ఆ మంత్ర దేవతయే పరాస్వరూపముగా ఉన్నదనీ, ఆశక్తి స్థూల, సూక్ష్మ అను రెండు రూపాలుగా శ్రీచక్రాకారము పొందినదనీ అందుచేతనే పరాశక్తికీ, శ్రీచక్రానికీ భేదము లేదనీ చెప్పబడుతోంది.

శ్రీచక్రదేవతకు స్థూల, సూక్ష్మ అను రెండు ఆకృతులున్నాయి. సూక్ష్మరూపంలో ఉన్న తేజోమయ బిందువు పరిణమించి స్థూలాకారములైన త్రికోణాది చక్రాకృతి పొంది ఉన్నది. సూక్ష్మరూపంలో ఉన్న పరాశక్తి, స్థూలాకారంలో ఉన్న శ్రీచక్రాంతర్గత బిందు రూపం పొందుతున్నది. కాబట్టి స్థూల సూక్ష్మాలయిన శ్రీచక్రబిందువుకూ, పరాశక్తికీ భేదం లేదు.

### శ్రీచక్ర స్వరూపము :

త్రికోణైరష్టారం త్రిభిరపి దశారం సముదభూ
ద్దశారంభూగేహాదపిచ భువనాశ్రం సమభవత్।
తతోఽభూ న్నాగారం నృపతిదళమస్మా త్త్రివలయం
చతుర్ద్వాః ప్రాకారత్రితయమిదమేవాంబ శరణమ్ ॥

ఈ శ్లోకంలో గౌడపాదాచార్యులవారు శ్రీచక్ర స్వరూప స్వభావాలను వివరిస్తున్నారు. శ్రీచక్రంలో శక్తిచక్రమైన త్రికోణమునుండి మిగిలిన శక్తిచక్రాలు విస్తరించి ఉన్నాయి. మొదటగా బిందువు, త్రికోణము, అష్టకోణము, దశకోణములు రెండు, చతుర్దశారము, అష్టదళము, షోడశదళము, భూపురత్రయములతో ఉన్న చక్రాన్ని శ్రీచక్రం అంటారు. ఇందులో షోడశదళం తరువాత త్రివలయాలు ఉంటాయి.

చి

శ్రీచక్రాన్ని గురిం  శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలో

చతుర్భి శ్రీకంఠై శ్శివయువతిభిః పంచభిరపి
ప్రభిన్నాభి శ్శంభోర్నవభి రపి మూలప్రకృతిభిః
చతుశ్చత్వారింశ ద్వసుదళకళాశ్రత్రివలయ
త్రిరేఖా స్సార్థం తవశరణకోణాః పరిణతాః

నాలుగు శివచక్రాలతోను, ఐదు శక్తిచక్రాలుతోను తొమ్మిది మూల ప్రకృతికలతోను, శ్రీచక్రము శివాశి  కు నిలయమై ఉన్నది. శ్రీచక్రంలో బీజాక్షరాలు ఉండవు. ఇది కేవలం రేఖా నిర్మితము.

బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ
మన్వస్ర నాగదళ షోడశపత్రయుక్తం
వృత్తత్రయంచ ధరణీ సదనత్రయంచ
శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయాః

శ్రీచక్రంలో బిందువు, త్రికోణము, అష్టకోణము, దశకోణయుగ్మము, చతుర్దశ కోణము, అష్టదళము, షోడశదళము, వృత్తత్రయము, భూపురత్రయము ఉంటాయి. ఇదే విషయాన్ని చాలా చోట్ల చెప్పటం జరిగింది. శ్రీచక్రాన్ని గురించి భైరవయామళం లో ఈ విధంగా చెప్పబడింది.

చతుర్భిశ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః
శివశ్శక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః

నాలుగు శివచక్రాలు, ఐదు శక్తిచక్రాలు వెరసి తొమ్మిదిచక్రాలతో శ్రీచక్రము శివశక్తుల స్వరూపమై ఉన్నది.

త్రికోణమష్టకోణం చ దశకోణ ద్వయంతథా
చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచచ ॥

దీనిలో త్రికోణము, అష్టకోణము, దశకోణములు రెండు, చతుర్దశ కోణము అను ఐదుశక్తిచక్రాలు. శక్తి చక్రాలన్నీ కోణాకారంలోనే ఉంటాయి.

బిందు శ్చాష్టదళం పద్మం, పద్మం షోడశ పత్రకమ్
చతురశ్రంచ చత్వారి, శివచక్రాణ్యనుక్రమాత్ ॥

బిందువు,అష్టదళము, షోడశదళము, భూపురము అను నాల ు శివ చక్రాలు. ఈ రకంగా శ్రీచక్రంలో మొత్తం తొమ్మిదిచక్రాలు ఉన్నాయి.

శ్రీచక్రము మొత్తము తొమ్మిది చక్రాల సమూహమై ఉన్నది. దీనినే 'నవయోన్యాత్మకము ' అంటారు. ఈ నవయోనులు నవధాతువులకు ప్రతీకలు. కామికాతంత్రంలో చెప్పినట్లుగా

త్వగసృఙ్మంస మేధోఽస్థి ధాతవ శ్శక్తి మూలకాః
మజ్జా శుక్ల ప్రాణ జీవ ధాతవశ్శివ మూలకాః

చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముక(వు)ః అను ఐదుధాతువులు శక్తిమూలకాలు. మజ్జ, వీర్యము, ప్రాణము జీవము అనే నాలుగు ధాతు ు శివ మూలకాలు.

నవధాతు రయందేహో నవయోని సముద్భవః
దశమీ యోని రేకైవ పరాశక్తి స్తధీశ్వరీ ॥

ఈ దేహము నవయోనుల వలన పుట్టి నవధాతు మయమై ఉన్నది. దీనిలో పదవ ధాతువు పరమేశ్వరి.

ఏవం పిండాండ ముత్పన్నం తద్వద్బ్రహ్మాండ ముద్భవౌ
పంచభూతాని శాక్తాని మాయాదీని శివస్యతు ॥
మాయాచ శుద్ధ విద్యాచ మహేశ్వర సదాశివౌ
పంచవింశతి తత్త్వాని తత్రైవాంతర్భవంతితే ॥

పంచభూతాలు శక్తిసంబంధాలు. మాయాదులు శివసంబంధాలు. ఇవన్నీ కలసి ఇరవైఐదు తత్త్వాలై, నవయోనులందు అంతర్భావము పొందుతున్నాయి. అవిః-

| | |
|---|---|
| 1. పంచభూతాలు | 5 |
| 2. తన్మాత్రలు | 5 |
| 3. జ్ఞానేంద్రియాలు | 5 |
| 4. కర్మేంద్రియాలు | 5 |
| 5. మాయ,శుద్ధవిద్య, మహేశ్వరుడు,సదాశివుడు | 4 |
| 6. మనస్సు | 1 |
| | --- |
| మొత్తం తత్త్వాలు | 25 |

ఈ తత్త్వాలు ఇరవైఐదు కాదు యాభై ఒకటి అని, ముప్పైఆరు అని, కొందరి వాదన.

(దీనికి వివరణ నాచే వ్రాయబడిన శ్రీవిద్యారహస్యము లో శ్రీచక్రము -తత్త్వాలు అనె వ్యాసంలొ ఇవ్వబడింది.)

ఈ ఇరవైఐదు తత్త్వాలు నవయోనులందు అంతర్భావం పొందుతున్నాయి గనకనే శ్రీచక్రాన్ని బ్రహ్మాండాకారంగా వర్ణించటం జరిగింది.

శ్రీచక్రం త్రిపురసుందర్యా బ్రహ్మాండాకార మీశ్వరీ
పంచభూతాత్మకం చైవ తన్మాత్రాత్మక మేవచ ॥
ఇంద్రియాత్మక మేవంచ మనస్తత్త్వాత్మకంతథా
మాయాది తత్వరూపంచ తత్త్వా తీతంచ బైందవమ్ ॥
అహం దేవీ నచాన్యోऽస్మి బ్రహ్మైవాహం నశోకభాక్
సర్వంఖల్విద మేవాహం నాన్యదస్తిసనాతనమ్ ॥

శ్రీచక్రంలో కోణాల సంఖ్య మొత్తం నలభైమూడు. అది ఏవిధంగా అంటే

| అసలు ఉండేవి | | కంటికికనుపించేవి | |
|---|---|---|---|
| చతుర్దశారంలో | 14 | చతుర్దశారంలో | 14 |
| బహిర్దశారంలో | 10 | బహిర్దశారంలో | 10 |
| అష్టకోణంలో | 8 | అష్టకోణంలో | 8 |
| త్రికోణంలో | 3 | త్రికోణంలో | 1 |
| | --- | | --- |
| మొత్తం కోణాలు | 45 | మొత్తం కోణాలు | ‚43 |

ప్రస్తారమును బట్టి శ్రీచక్రాన్ని గీసేటప్పుడు త్రికోణంలోని క్రింది రెండు కోణాలు అష్టకోణంలో అంతర్గతమౌతాయి. కాబట్టి త్రికోణంలో ఒక కోణమే కనిపిస్తుంది. అందుచేత శ్రీచక్రంలోని కోణాల సంఖ్యను లెక్క పెడితే నలభైమూడు వస్తుంది. బిందువు తో కలిపితే నలభైనాలుగు అవుతాయి. శ్రీచక్రంలోని అవరణలను, కోణాలను ప్రక్క పటంలో విపులంగా చూపటం జరిగింది. ఇక్కడ శివచక్రాలు, శక్తి చక్రాలు ఒక దానితో ఒకటి అంతర్భావం పొందుతున్నాయని భైరవయామళం లో చెప్పబడింది.

**త్రికోణే బైందవం శ్లిష్టం, అష్టారేऽష్టదళాంబుజమ్**
**దశారయోష్షో డశారం భూగృహం భువనాశ్రకే ॥**

**1. త్రికోణమున - బిందువు**
**2. అష్టకోణమున - అష్టదళ పద్మము**

3. దశారయుగ్మమున - షోడశదళము

4. చతుర్దశారమున - భూపురము చేరుతున్నాయి.

శైవానామపి శాక్తానాం చక్రాణాంచ పరస్పరమ్
**అవినాభావ సంబంధం యో జానాతి స చక్రవిత్॥**

శివచక్రములకు, శక్తిచక్రములకు అవినాభావ సంబంధమున్నది. ఆ సంబంధము నెరిగిన వాడే చక్రవిదుడు. శ్రీచక్రంలో ఇరవై నాలుగు సంధులు, ఇరవై ఎనిమిది మర్మాలు ఉన్నాయి.

ద్విరేఖా సంగమస్థానం సంధి రిత్యభిధీయతే
త్రిరేఖా సంగమస్థానం మర్మ మర్మవిదో విదుః ॥

రెండు రేఖలు కలిసినచోట సంధి అనీ, మూడురేఖలు కలిసిన చోట మర్మస్థానము అనీ చెప్పబడింది. చంద్రజ్ఞానవిద్యలో చెప్పబడినట్లుగా

మన్వశ్ర ద్విదశారాష్టకోణవృత్త చతుష్టయమ్
అష్టావింశతి మర్మాణి చతుర్వింశతి సంధయః ॥

అనగా చతుర్దశారము, దశారయుగ్మము, అష్టకోణముమొదలైన శక్తి చక్రాల యందు ఇరవైనాలుగు సంధులు, ఇరవైఎనిమిది మర్మస్థానాలు ఉన్నాయి. కాని ఆ చక్రములు గీసి లెక్కించగా ఇరవైనాలుగు మర్మస్థానాలు మాత్రమే ఉంటాయి. అయితే శివచక్రాలకు సంగమస్థానం లేకపోయినప్పటికి, వాటిని కూడా మర్మస్థానాలుగానే పరిగణించాలి. అప్పుడు మర్మస్థానాల సంఖ్య ఇరవైఎనిమిది అవుతుంది. ఈ రకంగా శ్రీచక్రంలో నలభైమూడు కోణాలు, ఇరవైనాలుగు సంధులు, ఇరవైఎనిమిది మర్మస్థానాలు ఉన్నాయి.

శ్రీచక్రాన్ని రెండురకాలుగా గీయటం జరుగుతుంది. 1.సృష్టి క్రమము 2.సంహార క్రమము

**1.సృష్టి క్రమము :--** ఇది సమయాచార చక్రము. దీనిలో నలభైమూడు కోణాలు, ఇరవైనాలుగు సంధులు, ఇరవైఎనిమిది మర్మ స్థానాలు ఉంటాయి. దీనిలో ఐదు కోణములు క్రిందవైపుకూ, నాలుగు కోణములు పై వైపుకూ ఉంటాయి. బిందువు త్రికోణం మధ్యన ఉంటుంది.

**2.సంహార క్రమము :--** ఇది కౌళాచార చక్రము. దీనిలో నాలుగు కోణాలు క్రింది వైపుకూ, ఐదు కోణాలు పై వైపుకూ ఉంటాయి.బిందువు త్రికోణం మధ్యన ఉంటుంది. దీనిల

కోణములకు సంఖ్యా నియమంలేదు. ఇరవైనాలుగు సంధులు, ఇరవైఎనిమిది మర్మములు మాత్రం ఉంటాయి.

ఈ రెండు చక్రములందు శివచక్రాలు ఒకే విధంగా ఉంటాయి.

శ్రీచక్రలేఖనంలో బిందువు నుండి మొదలు పెట్టి భూపురం వరకు గీసినట్లైతే సృష్టిచక్రం అని, భూపురంతో మొదలు పెట్టి బిందువు వరకు గీసినట్లైతే సంహారచక్రం అంటారు.

ప్రస్తారమును బట్టి శ్రీచక్రాన్ని మూడు రకాలు గా విభజించవచ్చు.

1. భూప్రస్తారము 2. మేరు ప్రస్తారము 3. కైలాస ప్రస్తారము. ఇవే కాక మేరువు, కూర్మ ప్రస్తారాదులు కూడా ఉన్నాయి. ఈ విషయము సౌదర్యలహరిలోని 11వ శ్లోకంలో వివరించబడింది.

బీజాక్షరయుతం చక్రం । యతీనా ముత్త మోత్తమం
బీజాక్షర విహీనంతు గృహస్థానాం ప్రశస్తకం ॥

పైన చెప్పిన మూడు రకాల శ్రీచక్రాలలోను బీజాక్షరములు గలది యతుల దగ్గర ఉండటం శ్రేయస్కరము. బీజాక్షరములు లేని మొదటి రెండూ గృహస్థులకు ప్రశస్తమైనవి. కాగా శక్తిసంగమతంత్రంలో

బీజం వినాతు నిర్జీవం । శవవత్పరికీర్తితం
బీజయుక్తం భవేద్యంత్రం । నిశ్శ్వస్తంసిద్ధిదాయకం ॥
శ్రీచక్రం బీజసంయుక్తం । నిశ్శ్వస్తం పరమేశ్వరీ
బీజహీనంతుయచ్చక్రం । తచ్చక్రం సిద్ధిదంనచ ॥

శ్రీచక్రంలో బీజాక్షరాలు లేకపోతే అది నిర్జీవం అవుతుంది. అందుచేత బీజాక్షరాలులేని శ్రీచక్రపూజ సిద్ధించదు అని చెప్పబడింది.

---

## బిందుమండలము

22. మధ్యం చక్రస్య స్యాత్పరామయం బిందుతత్వమేవేదం।
ఉచ్ఛూనం తచ్చ యదా త్రికోణరూపేణ పరిణతం స్పష్టం॥

శ్రీచక్రముయొక్క మధ్యలో ఉన్న బిందువు పరాశక్తిస్వరూపము. ఆ బిందువు ఏకాలమందు వికసనము పొందుచున్నదో, ఆ కాలమున స్పష్టమగునటులుగా పరిణమించుచున్నది. ఆ బిం[illegible] శ్రీచక్రంలోని తొమ్మిదిచక్రాలకు, మాతృకలకు కూడా కారణ స్వరూపమవుతు[illegible].

ఈ జగత్తు అంతా నామరూపాత్మకంగా ఉన్నది. దీనిలో (౨౦) ము శక్తి భాగము. ఇది శబ్ద బ్రహ్మాయని చెప్పబడుతోంది. ఆశబ్దానికి మూలం మాతృక. (అం ఈ మాతృక 1. పరా 2. పశ్యంతీ 3. మధ్యమా 4. వైఖరీ అనే నాలుగు రూపాలు కలిగి ఉన్న సవ దులో మొట్టమొదటిదైన పరాస్వరూపము ఈబిందువే. వాక్కుకు ప్రథమరూపం కోరిక. సహ స్రారంలో పుడుతుంది. శ్రీచక్రంలోని బిందువు సహస్రారంలోనే ఉన్నది. "బైందవమ్ బ్ర హ్మరంధ్రంచ" .ఈరకంగా వాక్కుకు ప్రథమ స్థానమైన పరాశక్తి, శ్రీచక్రంలోని బిందువులో రెండూ సహస్రారంలోనే ఉన్నాయి కాబట్టి బిందువే పరాశక్తి అని చెప్పబడుతోంది.

శ్రీచక్రము తొమ్మిదిచక్రముల సమూహము. అందుకే దీన్ని నవచక్రాత్మకము అంటారు. అవి వరుసగా

1. త్రైలోక్యమోహన చక్రము - భూపురము
2. సర్వాశాపరిపూరక చక్రము - షోడశదళము
3. సర్వసంక్షోభణ చక్రము - అష్టదళము
4. సర్వసౌభాగ్యదాయక చక్రము - మన్వస్రము
5. సర్వార్థ సాధకచక్రము - బహిర్దశారము
6. సర్వరక్షాకరచక్రము - అంతర్దశారము
7. సర్వరోగహరచక్రము - అష్టకోణము
8. సర్వసిద్ధిప్రద చక్రము - త్రికోణము
9. సర్వానందమయ చక్రము - బిందువు.

శ్రీచక్రాన్ని రెండు రకాలుగా వ్రాయటం లేదా గీయటం జరుగుతుంది. అవి 1. సృష్టిక్రమము 2. సంహార క్రమము.

1. సృష్టిక్రమము:- ఇది సమయాచార చక్రము, ఇందులో 28 మర్మస్థానాలు, 24 సంధులు, 43 కోణాలు ఉంటాయి.

> అష్టావింశతి మర్మాణి చతుర్వింశతి సంధయః
> ద్విరేఖా సంగమస్థానం సంధి రిత్యభిధీయతే
> త్రిరేఖా సంగమస్థానం మర్మ మర్మవిదో విదుః

రెండు రేఖలు కలసిన చోట సంధి అనీ, మూడు రేఖలు కలసినచోట మర్మస్థానమని అంటారు. కానీ శ్రీచక్రాన్ని గీసి లెక్కబెట్టగా మర్మస్థానాలు 24 ఉంటాయి. అయితే నవ చక్రాలకు సంగమస్థానం లేకపోయినప్పటికీ వాటినీ మర్మస్థానాలుగానే లెక్కించాలని చంద్రజ్ఞానవిద్య యందు చెప్పబడింది. ఆ ప్రకారము లెక్కపెట్టిన మొత్తం మర్మస్థానాలు 24+4=28 అవుతాయి.

ఈ పద్ధతిలో ముందుగా బిందువును, తరువాత త్రికోణము అష్టకోణము ఈ ప్రకారం శ్రీచక్రాన్ని గీయటం జరుగుతుంది శ్రీచక్రం పూర్తయిన తరువాత 5 కోణాలు క్రిందివైపుకూ, 4 కోణాలు పైవైపుకూ ఉంటాయి.

2. సంహారక్రమము:- ఇది కౌళాచారచక్రము. దీనిలో కోణాలకు సంఖ్యానియమంలేదు. ఈపద్ధతిలో ముందు భూపురము, తరువాత షోడశదళము, అష్టదళము. ఈ ప్రకారం శ్రీచక్రాన్ని గీసి చివరకు బిందువును ఉంచుతారు.

కార్యసిద్ధికి కౌళాచారము, మోక్షప్రాప్తికి సమయాచారము చెప్పబడ్డాయి. అయితే తుచ్ఛమైన ఐహిక సుఖాలకన్నా, శాశ్వతానందాన్నిచ్చే మోక్షమార్గమే శ్రేయస్కరమని విద్యారణ్యులు, గౌడపాదులు, శంకరభగవత్పాదులవంటి వారు నొక్కి వక్కాణించారు. అందుచేతనే కౌళమతం ఖండించబడింది.

సమయమతం ప్రకారము శ్రీచక్రలేఖనంలో ముందుగా బిందువును ఉంచుతారు. దానిని ఆధారంగా చేసుకునే మిగిలిన చక్రాలు గీయటంజరుగుతుంది. కాబట్టి శ్రీచక్రంలోని తొమ్మిది చక్రాలకు బిందువేఆధారము అని చెప్పబడింది. ఈబిందువే పరమాత్మ స్వరూపము.

ఋతమాత్మా పరంబ్రహ్మ సత్యమిత్యాదికాబుధై:
కల్పితా వ్యవహారార్థం యస్య సంజ్ఞా మహాత్మన:

బ్రహ్మజ్ఞానులు ఈ బిందువును ఋతమని, ఆత్మఅని, పరబ్రహ్మఅని, సచ్చిదానందస్వరూపమని అంటారు. అసలు బిందువుకు నామరూపాలు లేవు. కాని దానిని గురించి చెప్పటానికి అంటే కేవలము వ్యవహారము కోసమే దీనిని ఈ విధంగా చెబుతారు. ఈబిందువునే సుధాసింధువు చంద్రమండలము, సహస్రారము అనికూడా అంటారు.

మాతృకలు (అక్షరాలు) ఉత్పత్తిఅయ్యే వరుసలో మొట్టమొదటిది బిందువు. ఈబిందువు అభివృద్ధిచెంది నాదముఅవుతుంది. ఈనాదమువల్లనే కళలు అంటే అన్ని అక్షరములు పుడుతున్నాయి. ఈరకంగా మాతృకలకు, శ్రీచక్రానికి కూడా బిందువే ఆధారమవుతున్నది.

---

## యోనిచక్ర నిరూపణము

23. ఏతత్పశ్యంత్యాది త్రితయనిదానం త్రిబీజరూపం చ।
వామా జ్యేష్ఠా రౌద్రీ చాంబికయా నుత్తరాంశ భూతా స్యు:

ఈ త్రికోణచక్రమే పశ్యంతి మొదలైన శక్తులు ఆవిర్భవించటానికి కారణము, వాగ్భవ, కామరాజ,

ఉపాదాన కారణము:- ప్రతి వస్తువుకు ఒక పదార్థము ఉండాలి. ఏదైనా వస్తువు తయారు ాలంటే, ముందుగా ముడిపదార్థము కావాలి. ఉదా॥కుండకు మట్టి, ఆభరణాలకు గారము పదార్థము.

నిమిత్తకారణము :- వస్తువు తయారు చెయ్యటానికి కర్త ఒకడుండాలి. ఉదా॥ కుండలు యారుచెయ్యడానికి కుమ్మరి, ఆభరణాలు చెయ్యటానికి కంసాలి.

ిలో ప్రకాశాంశ ఉపాదన కారణము. విమర్శాంశ నిమిత్త కారణము.

పైన చెప్పిన రెండింటినీ 'కారణద్వయము' అంటారు. ఈ రెండింటికీ మధ్యన ఉండేది ్యమా' అనబడుతోంది. పశ్యంతి అనబడే త్రికోణముయొక్క మూడు రేఖలయందు ్తము కాని మాతృకా వర్ణాలున్నాయి. అవి ఎప్పుడైతే స్పష్టమవుతాయో, అప్పుడు అది వైఖరీశక్తి బడుతుంది.

వాక్కుయొక్క రూపాలయిన పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీలు విత్తనంలో వృక్షము, ఫలాలు ఏవిధంగా కనిపించకుండా ఉన్నాయో, ఆవిధంగా పరాబిందువైన పరమాత్మలో ఉన్నాయి. ఇక్కడ పరా అనేది బీజము. పశ్యంతి - అంకురము, మొలక

విత్తనం మొలకెత్తినప్పుడు అది ఫలానా వృక్షమని చెప్పటానికి వీలుండదు. అలాగే ్రచక్రంలోని పశ్యంతీ వాక్కుకు రూపం ఉండదు. ఇది కేవలం వాయువు. అవ్యక్తమైనది. టే చెప్పటానికి వీలు లేనటువంటిది. గోవు ప్రసవించేటప్పుడు ముందుగా బిడ్డయొక్క తల ుటకు వస్తుంది. ఆతలను చూసినంత మాత్రంచేతనే అది ఆడా, మగా అని చెప్పటానికి వీలు ు. అది ఏరంగులో ఉంటుందో కూడా తెలియదు. కేవలం ఒక దూడ అన్న విషయం త్రమే తెలుస్తుంది. మిగిలిన ఏ విషయాలు తెలియవు. ఇది అవ్యక్త స్థితి. ఈ రకంగానే ్యంతీ వాక్కు అవ్యక్తముగా ఉంటుంది. దీనికి వర్ణవిభజన లేదు.

ిశక్తుల స్వరూపము:- వామా, జ్యేష్ఠా, రౌద్రీ, అంబికా, పశ్యంతీ, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, ంతా అనే వారు నవశక్తులు.

ామానామ స్వాంతస్థిత ప్రపంచ వమనాద్విశ్వజనయిత్రీ శక్తి:

ష్ఠానామ సర్వమంగళకారిణీ శక్తి:రౌద్రీనామ సర్వరోగవిద్రావిణీ సమస్తేష్టఫలదాయినీ శక్తి:

బికానామ సర్వాతిశాయి పరిపూర్ణరూపస్వాత్మ స్ఫురణావలోకన చతురాశక్తి:

ఛాజ్ఞాన క్రియాశక్తయస్తు ప్రాసక్త పశ్యంతీ మధ్యమావైఖరీ రూపా శాంతానామ నిరంశచిద్రూపేతి తవ్యం."

శ్రీచక్రంలో ఊర్ధ్వ ముఖంగాను, అథోముఖంగాను మొత్తం తొమ్మిది శక్తులుంటాయని ్బడింది. అవి.

1. వామా
2. జ్యేష్ఠ
3. రౌద్రీ
4. అంబికా
5. పశ్యంతీ
6. ఇచ్ఛా
7. జ్ఞాన
8. క్రియా
9. శాంతా

వీటిలో మొదటి ఐదు అధోముఖంగాను, తరువాతి నాలుగు ఊర్ధ్వ ముఖంగాను ఉంటాయి. ఈ తొమ్మిది శక్తులు, 10 పరాశక్తి, 11. కామకళ. ఈ పదకొండు శక్తుల స్వరూపమైన పశ్యంతి (త్రికోణము) కార్యము. పరాశక్తి స్వరూపమయిన బిందువు కారణము. ఈ రెండింటికీ భేదము లేదు

## కూటత్రయము

25. ఏవం కామకలాత్మా త్రిబిందుతత్త్వస్వరూపవర్ణమయీ
సేయం త్రికోణరూపం యాతా త్రిగుణస్వరూపిణీ మాతా॥

కామకలాత్మకము, రక్త, శుక్ల, మిశ్రమము అనబడు బిందుత్రయము యొక్క తత్త్వ స్వరూపము, మూలకూటత్రయ వర్ణరూపము, త్రిగుణాత్మకము, చరాచర జగత్తు నిర్మాత, అయిన త్రిపురాశక్తి యోని (త్రికోణ) చక్రాకారము పొంది ఉన్నది. శ్రీచక్రంలో ప్రధానమైన చక్రాలు రెండు. వీటిలో మొదటిది సర్వకారణమైన బిందువు. ఇది ఇరవైఐదు తత్త్వముల స్వరూపమై ఉన్నది. ఆ తత్త్వాల:

| | | |
|---|---|---|
| 1. పంచభూతాలు | - | 5 |
| 2. తన్మాత్రలు | - | 5 |
| 3. జ్ఞానేంద్రియాలు | - | 5 |
| 4. కర్మేంద్రియాలు | - | 5 |
| 5. మనస్సు | - | 1 |
| 6. మాయ, శుద్ధవిద్య మహేశ్వరుడు, సదాశివుడు | - | 4 |
| మొత్తం తత్త్వాలు----- | | 25 |

ఈ బిందువును ఇదివరకే నిరూపించటం జరగింది. ఇప్పుడు యోనిచక్రమనబడే త్రికోణము వివరించబడుతోంది.

త్రికోణానికి మూడువైపులా ప్రకాశ, విమర్శ, మిశ్రమ బిందువులున్నాయి. మధ్యన ఉన్నది సంవిద్బిందువు. దీనికి మూడు వైపులా ఉన్నరేఖలు అవ్యక్త స్వరూపమయి, తేజోమయమైనటువంటి మాతృకలు, పంచదశీమహామంత్రంలో ఉన్న వాగ్భవ, కామరాజ, శక్తి కూటాలు. షోడశ నిత్యల స్వరూపమైన స్వరాలు ( పదహారు అచ్చులు). ఈ కోణబిందువులు:

1. మండల త్రయము - చంద్ర సూర్యాగ్ని మండలాలు
2. గుణత్రయము - సత్వరజస్తమోగుణాలు
3. బీజత్రయము - వాగ్భవకామరాజ శక్తిబీజాలు
4. శక్తి త్రయము - ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు
5. మూర్తి త్రయము - బ్రహ్మ విష్ణు మహేశ్వరులు
6. త్రిపుటి - జ్ఞాతృజ్ఞాన జ్ఞేయాలు

ఈ రేఖలు మూడు సమిష్టిగా కామకళాస్వరూపములయి ఉన్నవి.

అకారము ప్రకాశాంశ, బ్రహ్మ బీజము, చంద్రమండల స్వరూపము. హకారము విమర్శాంశ, అగ్నిమండలము. అకారహకార వర్ణముల కలయికయే అహమనే ఆత్మమంత్రము. ఈ వర్ణద్వయ సామరస్యమే కామకలళా స్వరూపము. హంసయుగళమే శివశక్తుల రూపమైన పరమాత్మ, త్రికోణంలోని బిందువు ప్రకాశాంశ, అకార స్థానము. త్రికోణము విమర్శాంశ, హకార స్థానము. శివశక్తుల మేళనమే సర్వకారణము. ఇదే శ్రీచక్రంలోని బిందువు. అందుచేతనే ఈ బిందువు పరాస్వరూపము, కామకళ, పరమాత్మ, పరబ్రహ్మస్వరూపము, సచ్చిదానంద స్వరూపము అని చెప్పబడుచున్నది.

సాదకుడు అసలు తనస్వరూపం ఏమిటి? అనే విషయం తెలుసుకోవాలి. అదే స్వస్వరూపజ్ఞానము. పిండాండము, బ్రహ్మాండము, శ్రీచక్రము అనే మూడు సమాన ధర్మాలు కలిగి ఉన్నాయి. చతుర్దశభువనాత్మకమైన బ్రహాండాన్ని గురించి విచారణ చెయ్యటం కష్టమైనపని. అందుచేత ప్రత్యక్షంగా కనిపించే శ్రీచక్రతత్వాన్ని గనక తెలుసుకున్నట్లైతే సాధకుడికి పిండాండ బ్రహ్మాండాల గురించి తెలుస్తుంది. తద్వారా స్వస్వరూప జ్ఞానము, జీవన్ముక్తి కలుగుతాయి.

కలిగిన

సృష్టి ఆవిర్భావసమయంలో బిందువు అద్వితీయమైనటువంటి అకారం బ్రహ్మ వస్తువుగా ఉన్నది. దీని తత్వాన్ని తెలుసుకోవటం మనకు చేతకాని పని. అయినప్పటికీ లోకానుభవంవల్ల బ్రహ్మజ్ఞానులు బిందువు గురించి కొంతవరకు చెప్పగలిగారు. తైత్తిరీయం లో

**సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ**

బ్రహ్మపదార్థము సత్యమైనది, ఎల్లప్పుడు ఉండే ప్రకాశ ధర్మంకలది, దేశకాలభేదములు లేనిది.

**ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్**

ఆనందమే బ్రహ్మస్వరూపము. ఆనందము అంటే శాశ్వతమైన ఆనందం. నిత్య నిరవధిక సుఖం. అంతేకాని క్షణికానందంకాదు. సుఖమనేది భూమాస్వరూపము. 'భూమా' అనేది కళ్ళకు కనిపించదు చెవులకు వినిపించదు. ఇది అఖండాకారం కలిగిన వస్తువు. నిత్య నిరవధిక సుఖస్వరూపము. ఇదే ఆత్మ. పరబ్రహ్మ. ఇదే బిందువు. ఈరకంగా సత్యజ్ఞానానందాది లక్షణాలుకల పరమాత్మనుంచి రజ్జువునందు సర్పభ్రాంతి కలిగి నట్లుగా సత్వరజస్తమోగుణాలతో కూడిన మూల ప్రకృతి ఆవిర్భవించింది.

శ్రీచక్రంలోని మధ్య బిందువు శివశక్తి సామరస్యరూపమైన పరమాత్మ. ఈ బిందువుయొక్క కాంతికిరణాలు, బిందువు చుట్టూ చేరి చంద్ర సూర్యాగ్నులు లాగా, త్రికోణాకారంగా, శ్వేతరక్త నీల వర్ణాలతో, త్రిగుణాత్మకమై, వామాది శక్తులకాస్పదమైన మూల ప్రకృతి అనబడే పశ్యంతీ శక్తి అవిర్భవించింది. అదే త్రికోణము. ఈ త్రికోణము కార్యమని, బిందువు కారణమని, కార్యకారణాలకు భేదంలేదని చెప్పబడింది. బిందు రూపంలో ఉన్న పరాశక్తే, పశ్యంతి మొదలైన శక్తులన్నింటికీ కారణమవుతున్నది.

కుండకు మట్టి ఉపాదానకారణము. కుమ్మరి నిమిత్తకారణము. అలాగే ఈ సృష్టికి శివుడు ఉపాదకారణము కాగా శక్తి నిమిత్త కారణమనే భ్రాంతి కలుగుతుంది. అది నిజంకాదు. శివశక్తుల మేళనమే బిందువు. వీరిద్దరికీ భేదం లేదు. ఇద్దరూ వేరుకాదు. సృష్టికి వీరిద్దరూ ఉపాదాన కారణమే అవుతున్నారు. పరబ్రహ్మ ఒక్కడే. అతడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు. ఆయన బిందువుగా ఉన్నాడు. ఈయనకు రూపభేదము, లింగభేదము లేవు. అటువంటి స్థితిలో అనుత్తరానందంకోసం ఈ సృష్టిచేయదలచిన వాడై తాను రెండు బాగాలుగా విడిపోయాడు. ఆ భాగాలే 1. ప్రకాశాంశ 2. విమర్శాంశ. వీటిలో

ప్రకాశాంశ కామేశ్వరుడు. విమర్శాంశ కామేశ్వరి. వీరే వ్యవహారికంలో శివశక్తులుగా పిలవబడుతున్నారు. వీరిద్దరికీ భేదంలేదు. ఇద్దరూ ఒకటే. అలాంటప్పుడు సృష్టికి ఇద్దరూ కారణమే అవుతారు కాని వీరిలో ఎక్కువ తక్కువలు ఎలా ఉంటాయి? అందుచేత సృష్టికి ఇద్దరూ ఉపాదానకారణమే.

ఉపాదానం త్రిధాభిన్నం వివర్తి పరిణామిచ,।
ఆరంభకం చ తత్రాద్యో న నిరంశే ప్రకాశినా॥
ఆరంభవాదినో ऽन్యస్మా దన్యస్యోత్పత్తి మూచిరే।
తంతో: పటస్య నిష్పత్తే ర్భిన్నౌ తంతుపటౌ ఖలు॥
అవస్థాంతరితాపత్తి రేకస్య పరిణామితా।
స్యాత్క్షీరం దధి మృత్కుంభ స్సువర్ణం కుండలం యథా॥

వేదాంతులు ఉపాదాన కారణాన్ని మూడు రకాలుగా చెప్పారు.

1. ఆరంభకము

2. పరిణామము

3. వివర్తము

1. ఆరంభవాదుల ప్రకారము తంతువు పటానికి అంటే దారము వస్త్రానికి కారణము. దారము, బట్ట అనే ఈ రెండు, భిన్న రూపాలలో ఉంటాయి. బట్టకు కారణమైన దారము పూర్వమున్న రూపాన్ని వదిలి కొత్త రూపాన్ని పొందుతున్నది. అంటే వస్తువు పూర్వపు రూపాన్ని వదలి కొత్త రూపం పొందుతుంది.

2. పరిణామ వాదుల ప్రకారము ఒకే వస్తువు ఇంకొక వస్తువుగా మార్పు చెందుతుంది. ఉదాహరణకు పాలు పెరుగుగాను, మట్టి కుండగాను, బంగారము ఆభరణాలుగాను మారుతాయి. పాలు ఎప్పుడైతే పెరుగుగా మారిపోయినాయో అప్పుడు దానికి పాలు అనే పేరుపోయి పెరుగు అనే పేరు వస్తుంది.

3. వివర్తవాదుల ప్రకారము ఒకే వస్తువు మరియొక వస్తువుగా కనిపిస్తుంది ఇదిరజ్జుసర్ప భ్రాంతి. తాడు అలానే ఉంటుంది. కాని చూసే వారికి అది పాము అనే భ్రాంతికలిగిస్తుంది. ఇది కేవలం భ్రాంతి మాత్రమే. ఇక్కడ తాడు తాడుగానే ఉంటుంది. అది ఏరకమైన మార్పు చెందదు. ఇదే విధంగా శుక్తి రజతములు (ముత్యపుచిప్ప వెండి వలె కన్పించుట) స్థాణుపురుషులు (రాయిమనిషిగా అంటే అచేతనము చేతనముగా కన్పించటము)

ఆరంభ, పరిణామ వాదాలు రెండూ సాంశములు కాబట్టి నిరంశయమయిన బ్రహ్మ వస్తువునందు ఇవి వర్తించవు. ఆకాశం నీలంగా ఉన్నది అంటారు. కాని నిజానికి ఆకాశం నీలంగా ఉండదు. దానికి నీలిరంగు కల్పించబడింది. అలాగే నిరంశమయిన ఆత్మయందు జగత్తు కల్పించబడింది.

శ్రీచక్రంలో ఉన్న బిందువు ఆత్మరూపమైన ఆనందస్వరూపము. నామరూపాలు

విమర్శాంశలు. వీటిలో 'రూపాన్ని' గురించి వివరించటానికి పరదేవతశారీర వృక్ష రూపంగా ఉంది. దీనిలో ఉన్న ఊర్ధ్వబిందువు, శ్రీచక్రబిందువు ఒకటే. అలాగే 'నామాన్ని' వివరించటానికి మాతృకా శ్రీచక్రాలు కల్పించబడ్డాయి. శారీర వృక్షంలో పంచభూతాలు బిందుమండలాలుగా చూపబడ్డాయి. అవి శ్రీచక్రంలో యోనిచక్రాల సంకేతాలు. శారీరవృక్షంలో ఉన్న ఊర్ధ్వ బిందువులు నాలుగు 1. పరమాత్మ 2. అవ్యక్తము 3. మహత్తత్వము 4. అహంకారము. యోనిచక్రంలో ఉన్న బిందువులు 1. పరా 2. పశ్యంతీ 3. మధ్యమా, 4. వైఖరులు. కాబట్టి శారీరవృక్షము, శ్రీచక్రము ప్రకాశ విమర్శాంశలు కలిగి ఉన్నాయి.

శ్రీచక్రంలో ఉన్న బిందువు సచ్చిదానంద రూపము. ఆబిందువునుంచి వచ్చే కాంతికిరణాల వలన కలిగిన యోనిచక్రము పశ్యంతీ రూపము. ఈ బిందువు, యోని చక్రము రెండూ మిగిలిన చక్రాలకు, పిండాండ బ్రహ్మాండాలకు ఆస్పదములు ( నెలవు)గా ఉన్నాయని చెప్పబడింది.

## పశ్యంత్యాది భేదములు

26. ఏకా పరా తదన్యా నామాదివ్యష్టిమాతృసృష్ట్యాత్మా।
తేన నవాత్మా జాతా మాతా సా మధ్యమాభిధానాభ్యాం॥

సర్వకారణమైనది, బిందురూపమైనది అయిన ఆ పరాశక్తి ఏకాకారంగా ఉంటున్నది. ఈ పరాశక్తి ఏకారణంచేత నవశక్తుల స్వరూపమైనదో, ఆ కారణంచేతనే పశ్యంతీ శక్తి నవయోన్యాత్మకమైనది. మధ్యమా అనే శక్తి కూడా రెండువిధాలుగా ఉన్నది.

ఈ శ్లోకంలో శ్రీచక్రము నామాత్మక విమర్శాంశ విచారణలో ఏకరూపబహురూపత్వము, శివశక్తులకు సమానకారణత్వము వివరించబడుతున్నాయి.

శ్రీచక్రానికి మధ్యన ఉన్న త్రికోణ, బిందువులు శివశక్తులు. బిందువు యొక్క అధిష్ఠాత్రి పరా అనే పేరుకలది. శివశక్తుల సామరస్య మండలమే పరాస్వరూపము. ఇక్కడ శివశక్తులకు రూపభేదం లేదు. లింగభేదంలేదు. బిందువు తేజోమయము, ఏకాకి, సర్వవ్యాపి. దీనినుంచే సర్వము సృష్టించబడింది. ఇదే సర్వకారణము. ఈ బిందువునుంచి వచ్చిన కాంతికిరణాలవలన పశ్యంతీ శక్తి అయిన త్రికోణము ఏర్పడింది. వీటిలో బిందువు శివస్వరూపము కాగా త్రికోణము శక్తి రూపము. జగత్తును సృష్టించటానికి మాతా పితరులు ఇద్దరూ కారణమే. అలాగే బిందు త్రికోణాలు సమాన కారణాలు. ఈ రెండూ బింబ ప్రతిబింబాలు. వీటిలో బిందువు శుద్ధబ్రహ్మము, త్రికోణము శబల బ్రహ్మము.

శ్రీచక్రాన్ని గీసేటప్పుడు బిందువు నుండి చతుర్దశారందాకా గీస్తారు. ఆ తరువాత దశాలు వృత్తాలు, భూపురము గీయబడతాయి. చతుర్దశారం దాకా గీసి లెక్కపెట్టినట్లయితే అధోముఖంగా అంటే క్రింది వైపుకు ఐదు కోణాలు, ఊర్ధ్వముఖంగా అంటే పైవైపుకు నాలుగు కోణాలు ఉంటాయి. మధ్యలో బిందువు ఉంటుంది. ఈ బిందువుకు దేనితోనూ సంబంధం ఉండకుండా విడిగా ఉంటుంది. అందుకే దీన్ని ఏకాకి అంటారు. బిందువుయొక్క కాంతి కిరణాలతో త్రికోణం ఏర్పడుతోంది. ఆ త్రికోణం వల్లనే మిగిలిన చక్రాలు వామాదిశక్తులు అన్నీ ఏర్పడుతున్నాయి.

శబ్దము ఉత్పత్తి కావటానికి బిందువే మొదటి అవస్థ. ఆ బిందువు వల్లనే త్రికోణము, దానిలో నాదము ఉత్పత్తి అవుతున్నాయి. ఇది రెండవ అవస్థ. ఇక్కడ ఉత్పన్నమైనటువంటి పశ్యంతీ నాదాన్నుంచే నవనాదాలు ఉద్భవిస్తున్నాయి. అందుచేత, నవనాదాలకు, నవయోనులకు వామాది నవశక్తులకు, పశ్యంతీ చక్రమే కారణము. జగత్తు అనబడే మహా వృక్షానికి బిందువే బీజము, త్రికోణమే అంకురము అని చెప్పబడింది.

## మధ్యమా స్వరూపము

27. ద్వివిధాహి మధ్యమా సా సూక్ష్మా స్థూలాకృతి స్తథా సూక్ష్మా
నవనాదమయీ స్థూలా నవవర్గాత్మా చ భూతలిప్యాఖ్యా॥

మధ్యమావస్థ రెండు రకాలుగా ఉన్నది.

1. సూక్ష్మమధ్యమ 2. స్థూలమధ్యమ. వీటిలో సూక్ష్మమధ్యమ నవనాదములు కలది. స్థూల మధ్యమ నవవర్గులు కలది.

వాక్కుకు మూలస్థానము లేదా బీజము బిందువు. లేదా సహస్రారము. తరువాత ఆధార చక్రంలో వాయువు ఉత్పత్తి అవుతుంది. ఇది రెండవ స్థానము పశ్యంతి. ఇది అవ్యక్తమైన వాక్కు. పరా, పశ్యంతీల మధ్యమావస్థగా ఉన్నదానిని సూక్ష్మమధ్యమ అంటారు. ఇది నవనాదమయి. నవనాదముల వివరాలు:-

1. చిణినాదము
2. చిణి చిణి నాదము
3. ఘంటానాదము
4. శంఖనాదము
5. తంత్రీ నాదము
6. వేణు నాదము
7. భేరీ నాదము
8. మృదంగ నాదము
9. మేఘ నాదము.

సాధకుడు షణ్ముఖీ ముద్రతో తన చెవులను బంధించుకొని జాగ్రత్తగా వినినట్లైతే ఓంకారము మొదటగా 'చిణి' అని వినిపిస్తుంది. తరువాత ఆ శబ్దము హెచ్చి చిణి చిణి అని ఘోష పెడుతుంది. ఆ తరువాత ఘంటానాదములాగా వినిపిస్తుంది. ఆ ఘంటానాదము క్రమముగా విజృంభించి శంఖనాదముగా మారుతుంది. అది అతి మనోహరంగా మారి వీణమీటి నట్లుగా వినిపిస్తుంది. తరువాత వీణానాదము నిర్మలమై వేణు నాదము అవుతుంది. ఆ తరువాత అరిషడ్వర్గాలను జయించిన చిహ్నంగా భేరీ నాదము మ్రోగుతుంది. తరువాత విజయోత్సవ చిహ్నంగా రమణీయమైన మృదంగ నాదము, ఆ తరువాత ఆనంద వర్షపాతము జరుగుచున్నట్లు మేఘనాదము వినిపిస్తుంది. క్రమంగా ఈ నాదాలన్నీ పరానాదముతో కలిసిపోతాయి. ఆ స్థితిలో సాధకుని యొక్క మనస్సు, ప్రాణములు నాద బిందుకళలతో లీనమై పోతాయి. దీనినే తురీయావస్థ, ఉన్మని, అని అంటారు. ఈ అవస్థలో సాధకుడి యొక్క జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు పనిచేయటంమాని వేస్తాయి. బాహ్యప్రపంచముతో సాధకుడికి ఏ మాత్రం సంబంధం ఉండదు. మనస్సు సంకల్ప కారణము. కనుక ఏ విషయమైనా సంకల్పం చేస్తుంది. దాన్ని ఇంద్రియాలు ఆచరణలో పెడతాయి. తురీయావస్థలో ఇంద్రియాలతో పాటుగా సంకల్ప కారణమైన మనస్సు కూడా పనిచేయటం మానివేస్తుంది. మనస్సు లేనటువంటి స్థితి కాబట్టే దీనిని అమనస్కయోగము అంటారు. ఇదే రాజయోగము.

ఆధారచక్రంలో అవ్యక్తంగా ఉన్న పశ్యంతీ వాక్కు స్వాధిష్ఠాన మణిపూరాలు దాటి అనాహతం చేరుతుంది. ఇక్కడ కొంత వరకు రూపు సంతరించుకుంటుంది. విశుద్ధి చక్రంచేరే సరికి స్పష్టమైన స్వరంతో వైఖరీ వాక్కుగా బయటకు వస్తుంది. ఇప్పుడు పశ్యంతీ, వైఖరీల మధ్య స్థానంలో అవ్యక్తంగా ఉన్న వాక్కు పూర్తిగా వ్యక్తమయ్యే స్థితికి చేరుకుంటుంది. **కాబట్టి దీనిని స్థూల మధ్యమ అంటారు. ఇది తొమ్మిది వర్గులు కలిగి ఉంటుంది. అవి ఏవనగా అచ్చులు పదహారు. వీటిలో హ్రస్వములు. ఒకవర్గు, దీర్ఘములు వర్గు కవర్గు అంటే అచ్చులు రెండు వర్గులుగా ఉన్నాయన్నమాట. మిగిలినవి - 3. కవర్గు, 4. చ ,, 5. టవర్గు 6. తవర్గు, 7. పవర్గు, 8. యవర్గు, 9. శవర్గు.**

**స్థూలమధ్యమలో వాక్కుకు స్పష్టమైన లిపి, ఉచ్చారణ కలిగి ఉంటుంది.**

# కార్యాకారణ భేదభావము

28. ఆద్యా కారణ మన్యా కార్యం త్వనయోర్యతస్తతో హేతోః।
సైవేయం నహి భేద స్తాదాత్మ్యం హేతుహేతుమతోరిష్టం॥

ఏ కారణంచేత నవనాదాత్మకమైనటువంటి సూక్ష్మమధ్యమ కారణంగాను, నవవర్గాత్మకమైన స్థూలమధ్యమ కార్యంగాను అవుతున్నదో అదే కారణంచేత నవనాదాత్మకమైన సూక్ష్మమధ్యమ నవవర్గాత్మకమైన స్థూలమధ్యమ అవుతున్నది. ఈ రెంటికీ భేదంలేదు. ఇవి రెండూ కారణ కార్యాలు. ఈ రెండింటికీ తాదాత్మ్యమున్నది.

మధ్యమవాక్కు సూక్ష్మ, స్థూల అని రెండు రకాలుగా ఉన్నదని చెప్పటం జరిగింది. సహస్రారమందుద్భవించిన ఇచ్ఛచేత ఉద్భవించిన పరావాక్కు పశ్యంతీ, మధ్యమా, వైఖరులుగా రూపాంతరము చెందుతున్నది. పరావాక్కు కేవలము బీజము. పశ్యంతి అంకురము. బీజమైన పరావాక్కు రూపాంతరము చెంది పశ్యంతి, అయింది. ఇది సూక్ష్మమధ్యమ. ఆ తరువాత అదే వాక్కు అనాహతచక్రందాకా ప్రయాణం చేసి కొత్తరూపాన్ని సంతరించుకుంటోంది. పశ్యంతీ వాక్కు అవ్యక్తమైనది. మధ్యమావాక్కు వ్యక్తమైనది కాదు కాని, దాదాపుగా ఒక ధ్వనిని, లిపిని సంతరించుకుంటుంది. ఇది ఎక్కడినుంచో మళ్ళీ క్రొత్తగా రాదు. పశ్యంతి నుంచి పైకి వచ్చిన వాయువే, సూక్ష్మమధ్యమ యొక్క రూపాంతరమే. అందుచేతనే సూక్ష్మమధ్యమ. స్థూలమధ్యమగా ఆకృతి పొందుతున్నది. అని చెప్పబడుతోంది. వీటిలో సూక్ష్మమధ్యమ కారణంకాగా, స్థూలమధ్యమ కార్యం. ఇప్పుడు నవనాదమయమైన సూక్ష్మమధ్యమ, నవవర్గాత్మకమైన స్థూలమధ్యమగా రూపాంతరం చెందింది. కారణ కార్యాలనబడే ఈ సూక్ష్మ స్థూలాలకు భేదం లేదు. అలాగే పశ్యంతీ, మధ్యమా, వైఖరీలు కూడా అన్నీ ఒకటే. వీటి మధ్య భేదం లేదు. ఇవన్నీ పరాస్వరూపాలే. పరావాక్కు ఆత్మస్వరూప బిందువు. కాబట్టి ఆత్మకు, వైఖరీ బీజాలకు భేదంలేదు.

---

# అష్టకోణ చక్రము (వైఖరీశక్తి)

29. శషసపవర్గమయం తద్వసుకోణం మధ్యకోణవిస్తారః
నవకోణం మధ్యం చేత్యస్మిన్ చిద్దీపదీపితే దశకే॥

శషస అనే మూడు వర్ణాలు, పవర్గ, అంటే పఫబభమ మొత్తం ఎనిమిది వర్ణాల

స్వరూపం కలిగిన అష్టకోణక్రము, త్రికోణము యొక్క కాంతి కిరణములచేతనే ఉత్పన్నమైనది. బిందువు, త్రికోణము, అష్టకోణంలోని ఎనిమిది కోణములు మొత్తం పది. ఈ దశకమందు పరంజ్యోతి ప్రకాశిస్తున్నది.

శ్రీచక్రం మధ్యలో ఉన్న ఆత్మస్వరూపమైన బిందుమండలము యొక్క తేజస్సువలన యోనిచక్రము (త్రికోణము) పుట్టింది. ఆ తరువాత ఆ బిందువు, యోనిచక్రముల కాంతి కిరణముల వలన అష్టకోణము కలిగింది. బిందురూపంలో ఉన్న పరంజ్యోతి తేజస్సు అవ్యక్తమైనటువంటి మాతృకా రూపమైన మూడు రేఖలుగా పరిణమించింది. మూడు రేఖలయొక్క కోణాలయందు మూడు బిందువులు, మధ్య ఒక బిందువు చేరి త్రికోణంగా పరిణమించింది. ఆ బిందు యోనుల తేజస్సువలన అంటే మాతృకా రూపమైన తేజస్సుతో ఎనిమిది వర్ణాలు స్ఫుటములై (శషసపఫబభమ) ఎనిమిది కోణాలుగా ఉన్నాయి. ఈ ఎనిమిది కోణాలు, బిందువు, త్రికోణము మొత్తం పది వస్తువులు పరమాత్మరూపమైన చిత్కళ అనే దీపం వల్ల ప్రకాశిస్తున్నాయి. వసుకోణానికి స్వాధిష్ఠానచక్రంతో ఐక్యత చెప్పబడింది.

---

## దశారయుగ్మము

30. తచ్ఛాయాద్వితయ మిదం దశారచక్రద్వయాత్మనా వితతం
తటచకవర్గచతుష్టయవిలసనవిస్పష్టకోణవిస్తారమ్॥

బిందువునుండి త్రికోణము దానినుండి అష్టకోణము వచ్చినాయి. ఈ మూడింటి తేజస్సువల్ల దశారద్వయము వచ్చింది. ఇందులో త,ట, వర్గులు అంతర్దశారము కాగా చ,క,వర్గులు బహిర్దశారముగా ప్రకాశిస్తున్నాయి.

ఇంతవరకు చెప్పినదాన్నిబట్టి బిందు త్రికోణ వసుకోణములు ఉత్పన్నమయినాయి. వీటిలో బిందువు ప్రకాశాంశ. కాగా త్రికోణ, అష్టకోణాలు విమర్శాంశ. ఈ మూడింటి తేజస్సు వల్ల దశారద్వయము ఏర్పడింది. వీటిలో ప్రకాశాంశ తేజస్సువల్ల అంతర్దశారము, విమర్శాంశ తేజస్సు వల్ల బహిర్దశారము వచ్చినాయి. వీటిలో త,ట వర్గులు అంటే తథదధన టఠడఢణ అనే పది వర్ణాలు అంతర్దశారంలోని కోణాలుగాను, చ,క వర్గులు అంటే చఛజఝఞ, కఖగఘఙ అనే పది బీజాలు బహిర్దశారంలోని కోణాలుగాను ఉన్నాయి. శ్రీచక్రంలోని కోణాలను షట్చక్రాలతో పోల్చినప్పుడు అంతర్దశారానికి ------ మణిపూరంతోను, బహిర్దశారానికి -------- అనాహతంతోను ఐక్యత చెప్పబడింది.

# చతుర్దశారము

31. ఏతచ్చక్రచతుష్కప్రభాసమేతం దశారపరిణామః
ఆదిస్వరగణగతచతుర్దశవర్ణమయం చతుర్దశారఽ మిదం॥

పైన చెప్పిన నాలుగు చక్రముల కాంతితోకూడిన దశారచక్రపరిణామము అకారాది పధ్నాలుగు అక్షరముల స్వరూపమై చతుర్దశారము అవుతున్నది.

బిందువు, త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము అనే నాలుగు చక్రముల కాంతి పుంజము, దశారచక్రపరిణామము అయిన చతుర్దశారము ఉత్పన్నమవుతున్నది. త్రికోణంలో అంకుర రూపంలో అవ్యక్తంగాఉన్న అకారాది పధ్నాలుగు అక్షరాలు, స్ఫుటరూపములై ఈ చక్రములోని పధ్నాలుగు కోణాలలోను ఉంటున్నాయి. శ్రీచక్రంలోని కోణాలను షట్చక్రాలతో పోల్చినపుడు చతుర్దశారము - విశుద్ధి చక్రంతో ఐక్యత పొందుతున్నది. బీజరూపంలో ఉన్న పరావాక్కు త్రికోణంలో పశ్యంతిగా మారి అవ్యక్తమైనదిగా ఉంది, అక్కడనుండి ఊర్ధ్వంగా ప్రయాణంచేసి, విశుద్ధి చక్రంచేరి స్పష్టమైనరూపాన్ని, ఉచ్చారణను సంతరించుకుని వైఖరీ అని పిలవబడుతుంది.

---

# స్పష్టవైఖరీ స్వరూపము

32 .పరయా పశ్యంత్యాఽపిచ మధ్యమయా స్థూలవర్ణరూపిణ్యా
ఏతాభి రేకపంచాశదక్షరాత్మికా వైఖరీ జాతా॥

పరా, పశ్యంతీ, నవవర్గాత్మకమైన స్థూలమధ్యమ అను ఈ మూడు శక్తులచే యాభైఒక్క అక్షరములుగా గల వైఖరీ శక్తి ఉన్నది.

బిందువు మొదలు చతుర్దశారము వరకు ఉన్న చక్రాలు ఉత్పత్తి కావటానికి కారణము బిందువు. కార్యము త్రికోణము. అలాగే పరా, పశ్యంతీ, స్థూలమధ్యమా అనే మూడు శక్తుల వలన వైఖరీ శక్తి ఉద్భవించింది. దాని వల్ల అకారాది క్షకారాంతము యాభైఒక్క అక్షరాలు వ్యవహారయోగ్యమై అంటే రూపము, ఉచ్చారణాశక్తి, నామము కలిగినవై 'వైఖరి' అనే స్ఫుటమైన అక్షర పంక్తి ఉత్పన్నమైనది. ఆశక్తి ఈ ఐదుచక్రాల రూపంలోను ప్రకాశిస్తున్నది.

ఈ యాభైఒక్క అక్షరాలలోను బిందువు, విసర్గ, య, ర, ల, వ, ళ, క్ష అనే ఎనిమిగి అక్షరాలు కనిపించటంలేదు. వాటిపరిణామము ఈ విధంగా ఉన్నది. అక్షరాల వ్యక్తతకు మొట్టమొదటి రూపము బిందువు. ఆ బిందువికసనమే విసర్గ. తరువాత అకారాది స్వరాలు, కకారాది వర్ణాలు వచ్చినాయి. ఇది వైఖరీ ఉత్పత్తి క్రమము. బిందు విసర్గలను అకారాది స్వరాలకు ముందు చెప్పటం ఇబ్బంది కరంగా ఉంటుంది కాబట్టి పద్నాలుగు అచ్చుల తరువాత వాటిని అం, అః అని చెప్పటం జరుగుతోంది. కాని ఇవి స్వరాలకు అంటే అచ్చులకు ముందుగానే ఉన్నాయని గుర్తుంచుకోవాలి. పదహారు అచ్చులలోను హ్రస్వములు ఎనిమిది ప్రకాశాంశ, దీర్ఘములు ఎనిమిది విమర్శాంశ అని ముందే చెప్పబడింది. ఈ అచ్చులలోని బిందువు శ్రీచక్రంలోని బిందువే. విసర్గ యోనిచక్రాంతర్గతము. 'లళయోరభేదః' అనే సూత్రాన్ననుసరించి ళ కారము ల కారములోనే కలసి ఉన్నది. క్ష కారము క, షల యొక్క మిశ్రమము సర్వత్ర వ్యాపించి ఉన్నది.

ఇంక మిగిలింది య,ర,ల,వ, వైఖరీ మాతృకయందు

య కారము ---- వాయురూపముగా

ర కారము ----- అగ్ని రూపముగా

ల కారము ----- పృధ్వీరూపముగా

వ కారము ------ అమృత మయంగా షోడశదళ

కమలము ప్రకాశిస్తున్నది. ఈ రకంగా వైఖరీ మాతృకాశక్తి ఏర్పడింది.

---

## అష్టదళ, షోడశదళ పద్మాలు

33. కాదిభి రష్టభి రుపచిత మష్టదళాబ్జం చ వైఖరీ వర్ణైః
స్వరగణసముదిత మేతద్వ్యష్టదళాంభోరుహంచ సంచింత్యమ్॥

అష్టదళము ఎనిమిది వర్గులచేత, షోడశ దళము పదహారు స్వరములచేత కూడి ఉన్నది.

బిందువు దగ్గరనుండి చతుర్దశారము వరకు ఉన్న చక్రాలన్నీ పశ్యంతీ, మధ్యమం, వైఖరీస్వరూపాలు. ఇందు చేతనే శ్రీచక్రములోని కోణచక్రాలన్నీ విమర్శాత్మకాలవుతున్నాయి. అష్టదళ, షోడశదళ పద్మాలు ప్రకాశాంశలు. విమర్శాత్మకమైన కోణచక్రాలు పశ్యంతాది శక్తిరూపాలు. ప్రకాశాత్మకమైన అష్టదళపద్మము, షోడశదళపద్మములు కూడా పశ్యంతీ, మధ్యమా, వైఖరీ స్వరూపాలే. అష్టదళపద్మములోని ఎనిమిది దళాలలోను అ,క,చ,ట,త,ప,య,శ అనే ఎనిమిది వర్గులు ఉన్నాయి. అలాగే షోడశదళ పద్మములోని పదహారుదళాలలోను పదహారు అచ్చులు ఉన్నాయని చెప్పబడుతోంది.

# వృత్త భూపురాలు

34. బిందుత్రయమయతేజ స్త్రితయవికారస్థితాని వృత్తాని
భూబింబత్రయ మేత త్పశ్యంత్యాదిత్రిమాతృవిశ్రాంతిః॥

శ్రీచక్రమందున్న మూడువృత్తాలు రక్త, శుక్ల, మిశ్రమ బిందుమయ మయిన చంద్ర, సూర్యాగ్నుల తేజస్సు, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ శక్తుల స్వరూపమే భూపురత్రయము.

శ్రీచక్రము గీసేటప్పుడు ముందుగా బిందువు తరువాత త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము చతుర్దశారము, అష్టదళము, షోడశదళము, తరువాత వృత్త త్రయము, భూపురత్రయము ఉండాలని చెప్పబడింది.

## 1. శ్రీచక్రంలో వృత్తాలు:

బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ
మన్వస్రనాగదళ షోడశ పత్రయుక్తం
వృత్తత్రయంచ ధరణీ సదనత్రయంచ
శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయాః॥

ఈ శ్లోకం ప్రకారము శ్రీచక్రంలో వృత్తత్రయం షోడశదళానికి, భూపురత్రయానికిమధ్యనఉన్నది.

బిందు త్రికోణ కాష్టావతారయుగ లోకకోణ వృత్తయుతం
వసుదళవృత్త, కళాదళవృత్త త్రిమహీగృహం భజే చక్రమ్॥

ఈ శ్లోకం ప్రకారము శ్రీచక్రంలో వృత్తాలు చతుర్దశారం తరువాత ఒకటి, అష్టదళం తరువాత ఒకటి, షోడశదళం తరువాత ఒకటి ఉన్నాయి.శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలో

చతుర్భి శ్రీకణ్ఠై శ్శివయువతిభిః పఞ్చభిరపి
ప్రభిన్నాభి శ్శమ్భో ర్నవభిరపి మూలప్రకృతిభిః
చతుశ్చత్వారింశ ద్వసుదళ కలాశ్రత్రివలయ
త్రిరేఖాభి స్సార్థం తవ శరణకోణాః పరిణతాః॥

శ్రీచక్రాన్ని వివరిస్తూ షోడశారముతరువాతనే వృత్తత్రయం ఉండాలని తీర్మానించారు. శ్రీవిద్యకు మూలపురుషుడుగా చెప్పబడే గౌడపాదాచార్యులవారుతమ సుభగోదయస్తుతిలో,

త్రికోణైరష్టారం త్రిభిరపి దశారం సముదభూ

ద్దశారం భూ గేహాదపిచ భువనాశ్రం సముదభూత్

తతో ఽభూన్నాగారం నృపతిదళ మస్మా త్రివలయం

చతుర్ద్వాః ప్రాకారత్రితయ మిదమేవాంబ శరణమ్॥

ఈ శ్లోకంప్రకారము శ్రీచక్రంలో త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము, చతుర్దశారము అనేవిశక్తి చక్రాలు కాగా అష్టదళము, షోడశదళము, వృత్తత్రయము భూపురము అనేవి శివచక్రాలు. ఇక్కడ వృత్తత్రయము షోడశదళము తరువాతనే ఉన్నది.

'కామకళావిలాసము" లోని 34వసూత్రంలో వృత్త భూపురాలను వివరిస్తూ

బిందుత్రయమయ తేజస్త్రితయ వికారస్థితాని వృత్తాని,

భూబింబత్రయమేతత్పశ్యంత్యాది త్రిమాతృ విశ్రాంతిః ॥

శ్రీచక్రోద్ధారకశ్రుతిలో "వృత్తత్రయంచ ధరణీస్థదనత్రయంచ" అనిచెప్పబడింది శ్రీచక్రలేఖనంలో షోడశదళకమలంతరువాత వృత్తత్రయము, తరువాత భూపురత్రయముగీయట మనేది శిష్టపరంగా ఉన్నది.

కొంతమంది వృత్తాలు విడివిడిగా ఉంటాయని, అలాగనక లేకపోయినట్లైతే అష్టదళము, షోడశదళములనుగీయటంసాధ్యంకాదని, అందుచేత వృత్తాలు విడివిడి గానేఉండాలని వాదిస్తున్నారు కాని ఇదిసరికాదు. కామకళావిలాసంలో వృత్తత్రయాన్నిగీయటాన్నే ఇక్కడ 'వృత్తాని' అనటంజరిగింది. ఈ వృత్తత్రయము పశ్యంతి రూపమైన యోనిచక్రస్థ కోణబిందువగు రక్త,శుక్ల, మిశ్ర బిందువులతేజస్సు, సూర్యచంద్రాగ్ని మండలములు ఈవృత్తత్రయంగా ఉన్నాయని చెప్పబడింది.

పైశ్లోకాలు పరిశీలించినట్లైతే శ్రీచక్రంలోని వృత్తత్రయము షోడశదళం తరువాతనే ఉందని కొందరు, కాదు మూడువృత్తాలు విడివిడిగా ఉన్నాయని కొందరుచెప్పినట్లుగా తెలుస్తోంది. ఈవ్యాఖ్యలకు తంత్రాలు కూడాకొంతవరకుదోహదం చేశాయి. శ్రీచక్రాన్నిమానవదేహంతో పో ల్చినప్పుడు వృత్తత్రయాన్ని గురించెప్పటంజరిగింది.

వృత్తత్రయం చ ఊరుభ్యాం పధ్భ్యాం భూపురత్రయమ్" అనిచెప్పటం వల్ల శ్రీచక్రంలోని వృత్తత్రయము మానవదేహంలోని ఊరుద్వయంతో పోల్చబడింది. అంటే మూడు వృత్తాలు ఒకేచోట ఉన్నాయన్న మాట. కాని వేరొకతంత్రంలో ఈ రకంగా చెప్పబడింది.

వక్షౌతు ప్రథమవృత్తం, నాభ్యామష్టదళాంబుజమ్

కట్యాం ద్వితీయవలయం, స్వాధిష్ఠానే కలాశ్రకమ్

తస్యాధస్తాత్ తృతీయం, మూలాధారే చతురస్రకం

| | | |
|---|---|---|
| కుక్షిభాగము | - | ప్రథమవృత్తము |
| నాభి | - | అష్టదళము |
| కటిభాగము | - | ద్వితీయవృత్తము |
| స్వాధిష్ఠానము | - | షోడశదళము |
| స్వాధిష్ఠానంక్రింద | - | తృతీయవృత్తము |
| మూలాధారము | - | చతురస్ర ప్రథమరేఖ |

దీనినిబట్టి మూడువృత్తాలు విడివిడిగా అష్టదళముపైన ఒకటి, అష్టదళము తరువాత ఒకటి, షోడశదళము తరువాత ఒకటి ఉన్నాయని తెలుస్తోంది.

అలాగే శ్రీచక్రాన్ని షట్చక్రాలతో సమన్వయ పరచేటప్పుడు గ్రంధిత్రయాన్ని వృత్తత్రయంతోపోల్చటంజరిగింది. పంచదశీమహామంత్రంలోని హ్రీంకారాలు గ్రంధిత్రయంతోపోల్చ బడ్డాయి. గ్రంధిత్రయము వృత్తత్రయంతో పోల్చబడింది. గ్రంధిత్రయంకాని, వృత్తత్రయంకాని ఒకచోటకాకుండా విడివిడిగా ఉంటాయి కాబట్టి శ్రీచక్రంలో వృత్తత్రయం కూడా విడివిడిగా ఉండాలనేది వీరి వాదన. ఇవన్నీ సంప్రదాయభేదాలు. అయితే కొంతమంది మాత్రం ఇదితప్పు అని మొండిగావాదిస్తూ, తమవాదనకు బలంచేకూరటానికి అనేకనిదర్శనలు శాస్త్రపరమైనవికూడా చెబుతున్నారు, ఇక్కడగుర్తించవలసిన విషయం ఏమంటే ప్రతివాదన కూతగిన ఆధారం ఉంటుంది, కాబట్టి శుష్కవాదనలు కట్టిపెట్టి,భిన్న సంప్రదాయాలున్నపుడు గురు సంప్రదాయాన్నేపాటించాలనే ఆర్యోక్తిని అనుసరించాలి.

శ్రీచక్రంలో వృత్తాలు ఎన్ని ఉన్నప్పటికీ అవి ఎక్కడ ఉన్నప్పటికీ ఒక్క గౌడ పాదులుతప్ప, మిగిలినవారెవరూ వాటిని నవావరణలలోచేర్చలేదు, వాటికిపూజలేదు, చాలాగ్రంథాలలో చక్రసంజ్ఞ కూడా ఇవ్వబడలేదు. అందుచేత వృత్తాలను శ్రీచక్రనిర్మాణంలో ఒక భాగంగానే గుర్తించాలి. బహుశః ఆయాచక్రాలలో ఉండే దేవతల పరిధి, నిర్ణయించి ఉంచటానికే ఈవృత్తాలు ఏర్పరచి ఉంటారని పుష్పగిరి పీఠ ఆస్థాన విద్వాంసులు శ్రీ ఇంద్రకంటి విశ్వనాధంగారు అంటున్నారు. కాని శ్రీచక్రంలోని మూడు వృత్తాలు, పంచదశీ మహామంత్రంలోని మూడు హ్రీంకారాలకు ప్రతీకలుగా చెప్పబడుతున్నాయి. శ్రీ ?కు ప్రస్థానత్రయంగా చెప్పబడే

1. సౌభాగ్య భాస్కరము (లలితాసహస్రనామావళికివ్యాఖ్య)
2. వరివస్యారహస్యము
3. సేతుబంధము. లనువ్రాసిన భాసురానందులవారు తమ 'వరివస్యారహస్యము' అనేగ్రంథంలోని 99,100 శ్లోకాలలోశ్రీచక్రము, పంచదశీమహమంత్రమునుండి పుట్టింది అన్నారు.

కత్రితయా దీకారా ద్బిందు ర్జాత స్తదగ్రిమే చక్రే
హృల్లేఖాభిస్త త్పరచక్రత్రితయం హకారాభ్యామ్॥
ఏకారేణచ తత్పరచక్రే జాతే సకారాభ్యామ్
చ[illegible]శ్రాది లకారై రేవం విద్యాక్షరేణ చక్రజనిః॥

పంచదశీ మహామంత్రము (శ్రీవిద్య) నందలి

| | | |
|---|---|---|
| 1. మూడు క కారములు, ఈకారమువలన | - | శ్రీచక్రంలోని బిందువు, |
| 2. మూడుహ్రీంకారములవలన | - | త్రికోణము, అష్టకోణము |
| 3. రెండు హకారములు,ఏకారమువలన | - | అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము |
| 4. రెండుసకారములవలన | - | అష్టదళము, షోడశదళము |
| 5. మూడులకారములవలన | - | భూపు[illegible]యముపుట్టినాయి. |

ఇక్కడవృత్తత్రయము దేనివలన పుట్టినదనేవిషయం చెప్పలేదు.

ఈ రకంగా శ్రీచక్రంలోని వృత్తత్రయం మీదభిన్నాభి ప్రాయాలున్నాయి. అవి నవావరణలో చేర్చబడలేదు, వాటికి పూజకూడా లేదు. అందుచేత, వాటి మీదచర్చకు తావియ్యకుండా, ఈవిషయంలో గురుసంప్రదాయాన్ని పాటించటమే మంచిది.

**2. శ్రీచక్రంలో కోణాలు :**

శ్రీచక్రంలో మొత్తం 45 కోణాలు ఉంటాయి. అవి:

| | | |
|---|---|---|
| త్రికోణంలో | - | 3 |
| అష్టకోణంలో | - | 8 |
| దశారయుగ్మంలో | - | 20 |
| చతుర్దశారంలో | - | 14 |
| | | ----- |
| మొత్తం కోణాలు | | 45 |
| | | ----- |

కాని చక్రాన్ని గీసేటప్పుడు త్రికోణంలోని రెండు కోణాలు అష్టకోణంలో కలిసిపోతాయి. అంచేత నలభైమూడు కోణాలు మాత్రమే లెక్కకు వస్తాయి. బిందువుతో కలిపితే నలభైనాలుగు అవుతాయి. [illegible]గా 24 సంధులు, 28 మర్మస్థానాలు ఉంటాయి. శ్రీచక్రంమీద మరిన్ని వివరాలకు [illegible] సూత్రము చూడండి'

ఈ రకంగా ప్రకాశ విమర్శాంశలైన కామేశ్వరీ, కామేశ్వరులకు నిలయమై శ్రీచక్రము విరాజిల్లుతున్నది.

శ్రీచక్ర లేఖనంలో భిన్న పద్ధతులున్నాయని ముందే చెప్పటం జరిగింది. యంత్రంలో బీజాలు వ్రాసేప్పుడు ఎవరి పద్ధతి వారుగా అనుసరిస్తున్నారు.

3. శ్రీచక్రంలో బీజాక్షరాలుః-

**1. బిందువు** - ఓం ఈం ఈం నమః

**2. త్రికోణము** - వామావర్తముగా

1. ఐం క్లీం సౌః అని కొందరు,

2. పంచదశీ కూటత్రయము అని

3. బాలా మంత్రంతో సంపుటి చేసిన పంచదశీ మహామంత్ర కూటత్రయమని

ఐం క ఏ ఈ ల హ్రీం। క్లీం హసకహల హ్రీం। సౌః సకలహ్రీం అని అంటారు.

**3.అష్టకోణము :-** ప్రదక్షిణముగా 1. అకారాది అష్టవర్గులు అని కొందరు

2.యరలవశషసహ అని కొందరు

3. అచ్చులలో హ్రస్వములు ఎనిమిది అని కొందరు

**4. అంతర్దశారము** :- వామావర్తంగా మయరలవశషసహక్ష అని కొందరు

క, చ వర్గులు అని ఇంకొందరు

**5. బహిర్దశారము** :- ప్రదక్షిణ క్రమంలో ట,త,వర్గులు అని కొందరు,

ణ,త,థ,ద,ధ,న,ప,ఫ,బ,భ అని ఇంకొందరు,

**6. చతుర్దశారము** :- అగ్రకోణము నుంచి వామావర్తముగా ప, ఫ, బ, భ, మ,

య, ర, ల, వ, శ, ష, స, హ, క్ష, అని కొంతమంది,

క,ఖ,గ,ఘ,ఙ, చఛ,జఝ,ఞ, ట,ఠ,డ,ఢ అని మరి కొందరు,

**7. అష్టదళము** :- అ ఇ ఉ ఋ ఏ ఓ అం అని కొందరు,

క నుండి శ వర్గు దాకా ఏడు,లం, క్షం

ఎనిమిదవ వర్గు అని మరికొందరు

**8. షోడశదళము** :- అకారాది స్వరాలు పదహారు

**9. వృత్తత్రయము** :- బాలా బీజములు ప్రదక్షిణముగా

**10. భూపురముః-** 1. మూడవ రేఖలో - ద్రాం ద్రీం క్లీం బ్లూం సఃక్రోం హ్స్ఫ్రేం హ్సౌః ఐం

2. రెండవ రేఖలో - బ్రాహ్మీ మాహేశ్వరీ మొదలైన అష్టమాతృకా శక్తులు

3. మొదటి రేఖలో అష్టసిద్ధులు

అసలు శ్రీచక్రంలో బీజాక్షరాలుండాలా అన్నప్పుడు, బీజాక్షరాలున్న శ్రీచక్రాన్ని యతులు మాత్రమే పూజించాలి. అవి లేని దానిని గృహస్థులు పూజించాలి అని తంత్రాలు చెబుతుండగా శక్తి సంగమ తంత్రంలో బీజములేని చక్రం శవంతో సమానమని చెప్పబడింది. ఈ విధంగా శ్రీచక్ర లేఖనలో భిన్న సంప్రదాయాలున్నప్పుడు గురుసంప్రదాయాన్నే పాటించాలనేది ఆర్యోక్తి.

### 4.శ్రీచక్రము - షట్చక్రాలు:

శ్రీచక్రంలో శివచక్రాలు నాలుగు శక్తిచక్రాలు ఐదు మొత్తం తొమ్మిది చక్రాలు వున్నాయి. మానవ దేహంలో షట్చక్రాలున్నాయి. ఈ షట్చక్రాలకు శ్రీచక్రంతో ఐక్యతనే నాదబిందుఐక్యత అంటారు. ఇక్కడ నాదము అంటే శ్రీచక్రము. బిందువు అంటే షట్చక్రాల సమూహము. ఈవిషయాన్ని భైరవయామళంలో ఈవిధంగా చెప్పాచు.

**త్రికోణ మష్టకోణం చ దశకోణద్వయం తథా**
**మనుకోణం చతుష్కోణం, కోణచక్రాణిషట్క్రమాత్॥**
**మూలాధారంతథాస్వాధిష్ఠానం చ మణిపూరకమ్।**;॥
**అనాహతం విశుద్ధాఖ్య మాజ్ఞాచక్రంవిదు ర్బుధా**

త్రికోణము మొదలైన చక్రాలన్నీ ఆధారాది షట్చక్రాలతో ఐక్యత పొందుతున్నాయి. శ్రీచక్రంలోని తొమ్మిది చక్రాలు మానవదేహంలోని షట్చక్రాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

| శ్రీచక్రంల బింతొమ్మిది చక్రాలు | మానవ దేహంలోని షట్చక్రాలు |
|---|---|
| 1. ‌దువు | 1. మూలాధారము |
| 2. త్రికోణము | 2. స్వాధిష్ఠానము |
| 3. అష్టకోణము | 3. మణిపూరము |
| 4. అంతర్దశారము | 4. అనాహతము |
| 5. ఒ చర్దశారము | 5. విశుద్ధచక్రము |
| 6. అష్టశారము | 6. ఆజ్ఞాచక్రము. |
| 7. ‌్రదళము | 7. సహస్రారము |
| 8. షోడశదళము | |
| 9. భూపురత్రయము | |

శంకరభగవత్పాదుల వారి పరమగురువైన గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలో నాదబిందుఐక్యతను ఈ విధంగా చెప్పారు.

**త్రికోణం చాధారం, త్రిపుర తనుతే ‌ష్టార మనఘే**
**భవేత్స్వాధిష్ఠానం, పునరపి దశారమ్ మణిపురమ్**
**దశారం తే సంవిత్కమల, మథ మన్వస్ర క్రముమే**
**విశుద్ధం, స్యాదాజ్ఞాశివ ఇతి తతో బైందవగృహమ్॥**

| | | |
|---|---|---|
| 1. ఆధారచక్రానికి | - | త్రికోణంతో ఐక్యత |
| 2. స్వాధిష్ఠానానికి | - | అష్టకోణంతో ఐక్యత |
| 3. మణిపూరానికి | - | అంతర్దశారంతో ఐక్యత |
| 4. అనాహతానికి | - | బహిర్దశారంతో ఐక్యత |
| 5. విశుద్ధచక్రానికి | - | చతుర్దశారంతో ఐక్యత |
| 6. ఆజ్ఞాచక్రానికి | - | అష్టదళము, షోడశదళములతో ఐక్యత |
| 7. సహస్రారానికి | - | చతుర్ద్వారసహితమైన భూపురంతో |
| 8. స్వాధిష్ఠానానికి పైభాగంలో | - | బ్రహ్మగ్రంధి<br>ప్రథమవృత్తము |
| 9. అనాహతానికి పైభాగంలో | - | విష్ణుగ్రంధి<br>ద్వితీయవృత్తము |
| 10. ఆజ్ఞాచక్రానికి పైభాగంలో | - | రుద్రగ్రంధి<br>తృతీయవృత్తము |

ఇదికౌళచారుల సమన్వయము అని కొందరి వాదన. కొందరుసమయ మతస్థుల ప్రకారము శ్రీచక్రము - షట్చక్రాల ఐక్యత ఈ విధంగా ఉంటుంది

| | | |
|---|---|---|
| 1. మూలాధారానికి | - | భూపురంతో ఐక్యత |
| 2. స్వాధిష్ఠానానికి | - | చతుర్దశారంతో ఐక్యత |
| 3. మణిపూరానికి | - | బహిర్దశారంతో ఐక్యత |
| 4.అనాహతానికి | - | అంతర్దశారంతో ఐక్యత |
| 5. విశుద్ధచక్రానికి | - | అష్టకోణంతో ఐక్యత |
| 6. ఆజ్ఞాచక్రానికి | - | త్రికోణంతో ఐక్యత |
| 7. సహస్రారానికి | - | బిందువుతో ఐక్యత |
| 8. రుద్రగ్రంధి | - | ప్రథమవృత్తముతో ఐక్యత |
| విష్ణుగ్రంధి | - | ద్వితీయవృత్తముతో ఐక్యత |
| 10. బ్రహ్మగ్రంధి | - | తృతీయవృత్తముతో ఐక్యత |

ఈరకంగా గనక చూచినట్లైతే, పరదేవతకు ప్రతిరూపంగా మనం పూజించే శ్రీచ[illegible]ను, మానవ దేహము,రెండూ ఒకటేకాని వేరుకాదు. అందుకనే శ్రీచక్రపూజ -విశ్వమానవాళి పూజ అనిచెప్పబడింది.

**శ్రీచక్రస్యచత్వారి ద్వారాణి చతుర్వేదరూపాణి**

**ద్వారప్రవేశనేవనైభవతి పరదేవతాసాక్షాత్కారః**

శ్రీచక్రముయొక్క నాలుగు ద్వారాలు,నాలుగు వేదాలకు ప్రతీకలు. ఆద్వారములందు గనక ప్రవేశించినట్లైతే పరదేవత సాక్షాత్కారం జరుగుతుంది. ఆద్వారాలలో ప్రవేశించాలంటే, సాధకుడు ప్రాణాయామంచేసి, కుండలినీ శక్తిని నిద్రలేపాలి. అప్పుడు, అది ఊర్ధ్వముఖంగా బయలుదేరి షట్చక్రాలను, గ్రంధిత్రయాన్ని దాటిసహస్రారం చేరుతుంది. అప్పుడుసాధకునకు పరదేవతాసాక్షాత్కారము జరుగుతుంది.

## 5. శివ శక్తి చక్రాలు :

శివచక్రాలకు, శక్తి చక్రాలకు అవినాభావ సంబంధమున్నది. అది తెలిసిన వాడే చక్రవిదుడు. శ్రీచక్రములోని చక్రాలకు, మానవదేహంలోని షట్చక్రాలకు అవినాభావసంబంధమున్నదని ముందే చెప్పబడింది. శ్రీచక్రంలో త్రికోణస్వరూపణి శక్తి, బిందుస్వరూపుడు శివుడు. 'తంత్రరాజము' లోచెప్పినట్లుగా శ్రీచక్రములోని నాలుగుద్వారాలు నాలుగు వేదాలకు ప్రతీకలు. ఆద్వారములందుగనక ప్రవేశించగలిగినట్లైతే పరదేవత సాక్షాత్కారమౌతుంది. లలితా త్రిశతి ఫలశ్రుతి లోశ్రీచక్రాన్ని ఈవిధంగా చెప్పటం జరిగింది.

నతేషాం సిద్ధిదా విద్యా కల్పకోటిశతై రపి।
చతుర్భిశ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః॥
నవచక్రై శ్చసంసిద్ధం శ్రీచక్రం శివయోర్వపుః।
త్రికోణ మష్టకోణంచ దశకోణద్వయం తథా॥
చతర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచ చః।
బిందు శ్చాష్టదళం పద్మం పద్మం షోడశపత్రకమ్॥
చతురస్రంచ చత్వారి శివచక్రాణ్యనుక్రమాత్।
త్రికోణే బైందవం శ్లిష్టం అష్టారేష్టదళాంబుజమ్॥
దశారయో షోడశారం భూగృహం భువనాశ్రకే।
శైవానామపి శాక్తానాం చక్రాణాం చ పరస్పరమ్॥
అవినాభావ సంబంధం యో జనాతి సచక్రవిత్
త్రికోణరూపిణీ శక్తి ర్బిందురూపపరః శివః ॥

శ్రీచక్రము శివాశివులయొక్కశరీరము.అందులో కోణములన్నీ శక్తి చక్రాలు, బిందువు అష్టదళము, షోడశదళము, భూపురము శివచక్రాలు. శివ శక్తి చక్రాలకు అవినా భావసంబంధమున్నది. అది ఈ క్రింది విధంగా ఉంటుంది.

1. త్రికోణానికి - బిందువుతోఐక్యము.

2. అష్టకోణానికి - అష్టదళంతో ఐక్యము

3. దశారయుగ్మముకు - షోడశదళముతో ఐక్యము

4. భూపురత్రయముకు - చతుర్దశారముతో ఐక్యము.

ఈ రకంగా శివశక్తి చక్రాల సంకేతమునెరిగిన వాడే చక్రవిదుడు. అతడే చక్రసంకేతమును తెలియగలుగుచున్నాడు. త్రికోణస్వరూపిణి శక్తి, బిందురూపుడు శివుడు. ఈవిషయం తెలియని వారికి ఎన్నిజన్మలకైనామంత్రము సిద్ధించదు. శ్రీచక్రంలోని శివశక్తి చక్రాల అవినాభావ సంబంధాన్ని భైరవయామళంలో వివరించటం జరిగింది.

త్రికోణే బైందవంశ్లిష్టమష్టారే ఽష్టదళాంబుజమ్।
దశారయోష్షోడశారమ్ భూగృహంభువనాశ్రకే॥

ఇదేవిషయాన్ని గౌడపాదులవారు తమసుభగోదయస్తుతిలో ఈవిధంగా అన్నారు.

త్రికోణే వృత్తత్రితయ, మిభకోణే వసుదళం
కళాశ్రం మిశ్రారే భవతి భువనాశ్రే చ భువనమ్।
చతుశ్చక్రం శైవం నివసతి భగే శాస్తిక ముమే
ప్రధానైక్యం షోఢాభవతిచ తయో: శక్తిశివయో:॥

గౌడపాదులవారు శ్రీచక్రంలో బిందువుకు బదులుగా వృత్తత్రయాన్ని చెబుతున్నారు. మొత్తం మీద నాలుగు శివచక్రాలు, ఐదు శక్తిచక్రాలు ఉన్నాయన్నారు. అవి ఒక దానితో ఒకటి ఈవిధంగా అంతర్భావంపొందుతున్నాయి.

1. త్రికోణముతో - వృత్తత్రయము

2. అష్టకోణముతో - అష్టదళము

3. దశారయుగ్మంతో - షోడశదళము

4. చతుర్దశారంతో - భూపురము

ఇక్కడ శక్తి త్రికోణరూపిణి, శివుడు బిందురూపుడు ఇది అర్ధనారీశ్వరతత్త్వానికి ప్రతీక. అర్ధనారీశ్వరుడు అంటే ఒకే మూర్తిలో ఎడమభాగం దేవిఅని, కుడిభాగం ఈశ్వరుడు అనీకాదు. శివశక్తులు, అప్రకృతి పురుషులు మమైకంచెందటమే అర్ధనారీశ్వర తత్త్వము. అంటే ఏదో ఒకభాగంలో కాకుండా అణువణువులోను సగభాగం స్త్రీ అయితే మిగిలినసగభాగం పురుషుడు, ఈవిషయమే శ్రీచక్రంలోని శివ, శక్తి చక్రాల ఐక్యత చెప్పటంద్వారా మరొకసారినిరూపించటం జరిగింది. ఇది భారతీయకుటుంబ వ్యవస్థకుప్రతీక.

**6. సూక్ష్మచక్రాలు :** సాధన చేసేటప్పుడు కుండలినీ శక్తిని ఆధారచక్రం నుండి సహస్రారం వరకు తీసుకొని వెళ్ళి భగవద్దర్శనము చెయ్యాలి. శరీరంలో షట్చక్రాలున్నాయని చెప్పబడింది. అయితే సాధకుని భ్రూమధ్యభాగము నుండి సహస్రార మధ్యభాగము వరకు సూక్ష్మ చక్రాలు అని చెప్పబడే తొమ్మిది చక్రాలున్నాయి. అవి వరుసగా క్రింద నుంచి పైకి

1. చంద్రమండలము
2. అర్ధచంద్రాకారము
3. రోధిని
4. నాదము
5. నాదాంతము
6. శక్తి
7. వ్యాపిక
8. సమనా
9. ఉన్మని

వీటిలో శ్రీచక్రంలో గల తొమ్మిది చక్రాలు సామరస్యము పొందుతున్నాయి. ఈ సూక్ష్మ చక్రాలు గురించి ఈ విధంగా చెప్పబడింది.

ఆజ్ఞాంతం సకలాప్రోక్తం తతస్సకలనిష్కళం
ఉన్మన్యంతం పరే స్థానే నిష్కలం చ తథా స్థితం ॥
దీపాకారార్ధమాత్రశ్చ లలాటవృత్య ఇష్యతే ।
అర్ధమాత్ర స్తదాకారాః పాదమాత్ర స్తదూర్ధ్వతః ॥
జ్యోత్స్నా కారో తదర్ధాంశో రోధినీ తస్యవిగ్రహో ।
బిందుద్వయాంతరాళస్థో సేవారూపో మణిప్రభః ॥
కలాంశో ద్విగుణాంశశ్చ నాదాంతో విద్యుదుజ్జ్వలః ।
హలాకారస్తు సవ్యస్తబిందుయుక్తో విరాజతే ॥
శక్తిర్వామ స్తబిందూద్య త్సిరాకారా తథా పునః ।
వ్యాపికా బిందువిలసత్రికోణాకారతాం గతా ॥
బిందుద్వయాంతరాళస్థ ఋజు రేఖామయీ పునః ।
సమనా బిందువిలసదృజురేఖా తథోన్మనీ ॥
శక్త్యాదీనాం వపుస్స్ఫూర్ణద్వాదశాదిత్య సన్నిభం ।
చతుష్షష్టి స్తదూర్ధ్వం తద్ద్విగుణం ద్విగుణం తతః ॥
శక్త్యాదీనాం తు మాత్రాంశో మనోన్మన్యాస్తథోన్మనీ ।
దేశకాలావచ్ఛిన్నం తదూర్ధ్వం పరమం మహత్ ॥
విసర్గసుందరం తత్తు పరానందవిఘూర్ణితమ్॥

అయితే సూక్ష్మ చక్రాల స్థానములను గురించి భిన్నాభిప్రాయాలు కూడా ఉన్నాయి.

వీటి ప్రకారము

1. చంద్ర మండలము
   అర్ధ చంద్రమండలము(అజ్ఞాచక్రానికి పైన ఉన్నది)
2. రోధిని (బోధిని)
3. నాదము (అర్ధచంద్రమువలె ఉంటుంది)
4. నాదాంతము (మహానాదము హలాకారములో ఉంటుంది. దీనిలోనే శక్తి, వ్యాపిక ఉంటాయి)
5. సమన (దీనినే అజ్ఞ అని కూడా అంటారు.)
6. ఉన్మని (ఉన్మని చేరిన వారు తిరిగి రావటం లేదు అని చెప్పబడుతోంది.

సూక్ష్మ చక్రాల గురించి వివిధ తంత్రాలలో వివిధ రకాలుగా చెప్పబడినప్పటికీ ఈ సూక్ష్మ చక్రాలన్నీ కూడా తంత్ర సమ్మతములే.సాధకుడు ఒక్కొక్క చక్రము అధిగమించి పైకి వెడుతున్న కొద్దీ, క్రమేణా కొన్ని తత్త్వాలు వదలుకుంటూ వెళ్ళాలి. ఆ వివరాలు ఈ విధంగా ఉంటాయి.

| | | |
|---|---|---|
| 1. మూలాధారము నందు | -- | పాద, గంధ,అఘ్రాణ తత్త్వములు |
| 2. స్వాధిష్ఠానమునందు | -- | ప్రాణి, జిహ్వా, రస తత్త్వములు |
| 3. మణిపూరమునందు | -- | గుద, దర్శన, రూప తత్త్వములు |
| 4. అనాహతమునందు | -- | లింగ, స్పర్శ, త్వక్ తత్త్వములు |
| 5. విశుద్ధ చక్రమునందు | -- | శ్రవణ, శబ్ద, వాక్ తత్త్వములు |
| 6. అజ్ఞా చక్రమునందు | -- | అహంకారము, బుద్ధి. |

ఈ రకంగా ఉన్మనీ సంచారానికి వెళ్ళేప్పటికి ఆత్మ ఒక్కటే మిగులుతుంది.

తంత్రశాస్త్రాల ప్రకారం సూక్ష్మచక్రాలలో బీజన్యాసము కూడా చెప్పబడింది. ఆ బీజన్యాసము ఈ క్రింది విధంగా ఉన్నది.

| సూక్ష్మచక్రము | బీజము |
|---|---|
| 1. చంద్రమండలము | అం, ఆం, సౌః నమః |
| 2. అర్ధచంద్రమండలము | ఐం, క్లీం, సౌః నమః |
| 3. రోధిని | హ్రీం, క్లీం, సౌః నమః |
| 4. నాదము | హైం,హ్క్లీం, హ్సౌః, నమః |
| 5. నాదాంతము | హైసం, హ్క్లుం, హ్సౌః,నమః |
| 6. శక్తి | హ్రీం, క్లీం, బ్లేం, నమః |

| | |
|---|---|
| 7. వ్యాపిక | హ్రీం, శ్రీం, సౌః నమః |
| 8. సమన | హ్సైం,హ్స్క్లీం, హ్సౌః నమః |
| 9. ఉన్మని | క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీం।<br>స కల హ్రీం। నః |
| 10. బ్రహ్మ రంధ్రము<br>( మహా బిందువు.) | శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం<br>క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీం।<br>స కల హ్రీం। సౌః ఐం క్లీం హ్రీం శ్రీం నమః॥ |

7.భావనోపనిషత్తు పూర్తి పాఠము

ఓం శ్రీగురుః పరమకారణ భూతాశక్తిః తేననవరంధ్రరూపోదేహః నవచక్రంరూపం శ్రీచక్రం వారాహీపిత్రురూపా, కురుకుళ్ళావళిదేవతామాతా ॥ పురుషార్థాస్సాగరాః . దేహోనవరత్న ద్వీపః త్వగాదినప్తధాతుభిరనేకైస్సంయుక్తా సంకల్పాః కల్పతరవః తేజఃకల్పకోద్యానం రసనయాభావ్యమానా మధు రామ్లతిక్త కటుకషాయలవణరసాష్షడృతవ క్రియాశక్తిపీఠంకుడలినీ, జ్ఞానశక్తిర్గృహ, ఇచ్ఛాశక్తిర్మహాత్రిపురసుందరీ క్రియాశక్తిపీఠం కుడలినీ,జ్ఞానశక్తిర్గృహ, ఇచ్ఛాశక్తిర్మహాత్రిపురసుందరీ జ్ఞాతాహోతా జ్ఞానమర్ఘ్యం, జ్ఞేయగ్ంహవిః జ్ఞాతృజ్ఞానజ్ఞేయానామభేదభావనగ్ం శ్రీచక్రపూజనమ్ నియతి సహిత శృంగారాదయో నవరసా అణిమాదయః కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్య పుణ్యపాప మయా బ్రాహ్మ్యాద్యష్టశక్తయః ఆధారనవకం ముద్రాశక్తయః పృథివ్యప్తేజోవాయ్వాకాశ శ్రోత్రత్వక్ చక్షుస్జిహ్వా ఘ్రాణవాక్పాణి పాదపాయూపస్థ మనోవికారా షోడశశక్తయః వచనా దానాగమన విసర్గానందహానో పాదానోపేక్షా బుద్ధ యోనంగ కుసుమాది శక్త యోష్టౌ అలంబుసా, కుహూ,విశ్వోదరీ,వరుణా,హస్తిజిహ్వా, యశస్వతీ, అశ్వనీ,గాంధారీ,పూషా,శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగళా,సుషుమ్నా,చేతి,చతుర్దశనాడ్యః సర్వసంక్షోభిణ్యాది చతుర్దశ దేవతా: ప్రాణాపాన, వ్యానో,దాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయా దశవాయవ స్సర్వసిద్ధిప్రదాది దేవ్యో బహిర్దశారదేవతాః ఏతద్వాయుదశక సంసర్గో పాధి భేదేన రేచకపూరక శోషక దాహక ప్లావకామృతమితి ప్రాణముఖ్యత్వేన పంచవిధోస్తి మనుష్యాణాం మోహకో దహఖో భక్ష్య భోజ్య లేహ్య చోష్య పేయాత్మకం చతుర్విధమన్నం పాచయంత్యేతాః దశధనకలానర్వజ్ఞత్వా ద్యంతర్దశారదేవతాః శీతోష్ణ సుఖదుఃఖేచ్ఛా సత్వరజస్తమోగుణా వశిన్యాది శక్త యోష్టౌ శబ్ద స్పర్శ రూప రస గంధాః పంచతన్మాత్రా పంచపుష్పబాణాః మన ఇక్షుధనుః వశ్యోబాణః రాగఃపాశో ద్వేషోంకుశః అవ్యక్త మహత్తత్వాహంకారాః కామేశ్వరీ, వజ్రేశ్వరీ, భగమాలిన్యోంతస్త్రికోణాగ్రదేవతా పంచదశతిథి రూపేణ కాలస్య పరిమాణావలోకనం పంచదశనిత్యాః శ్రద్ధానురూపాధీర్దేవతాతయోః కామేశ్వరీ సదానంద ఘనాపూర్ణా స్వాత్మైకరూపాదేవతా సలిలమితి సౌహిత్యకరణగ్ం సత్వమ్ కర్తవ్యమకర్తవ్య మౌదాసీన్యమితి

వివేకభావనాయుక్త ఉపచారః అస్తి నాస్తీతి కర్తవ్యతా అనుపచారః బాహ్యాంతఃకరణానాం రూపగ్రహణ యోగ్యతాస్త్విత్యావాహనమ్ తస్యబాహ్యాంతఃకరణానామేకరూప ' విషయ గ్రహణమాసనమ్' రక్త శుక్ల పదైకీకరణం పాద్యమ్ ఉజ్జ్వల దామోదానుసంధానమర్ఘ్యమ్ స్వచ్ఛంస్వతస్సిద్ధ మిత్యాచమనీయమ్ చిచ్చంద్రమయీ సర్వాంగస్రవణగ్ంస్నానమ్ చిదగ్ని స్వరూప పరమానందశక్తిస్ఫురణం వస్త్రం ప్రత్యేకగ్ం సప్తవింశతిధా భిన్నత్వేనేచ్ఛాజ్ఞాన క్రియాత్మక బ్రహ్మ గ్రంధి మద్రసతంతు బ్రహ్మనాడీ బ్రహ్మసూత్రమ్ స్వవ్యతిరిక్తవస్తు సంగరహిత స్మరణంవిభూషణమ్ సత్సంగపరిపూతా సుస్మరణంగంధః సమస్త విషయాణాం మనసః స్థైర్యేణా నుసంధానం కుసుమమ్ తేషామేవ సర్వదాస్వీకరణంధూపః పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వలన సచ్చిదుల్కాకాశదేహో దీపః సమస్తయాతాయాత వర్జనం నైవేద్యమ్ అవస్థాత్రయైకీకరణం తాంబూలమ్ మూలాధారాది బ్రహ్మబిల పర్యంతం, బ్రహ్మరంధ్రాదిమూలాధారపర్యంతం గతాగత రూపేణ ప్రాదక్షిణ్యమ్ తురీయావస్థా నమస్కారః దేహశూన్య ప్రమాతృతా నిమజ్జనం బలిహరణమ్ సత్యమస్తికర్తవ్య మకర్తవ్య మౌదాసీన్య నిత్యాత్మ విలాపనగ్ంహోమః స్వయం తత్పాదుకా నిమజ్జనం పరిపూర్ణధ్యానమ్ ఏవం ముహూర్తత్రయం భావనయా యుక్తో భవతి, తస్య దేవతాత్మైక్యసిద్ధిః చింతితకార్యాణ్యయత్నేన సిధ్యంతి స ఏవ శివయోగీతి కధ్యత ఇత్యుపనిషత్

౮. చతుర్థైక్యము:

కళా నాదో బిందు : క్రమశ ఇహ వర్ణాశ్చ చరణం
షడబ్జ ంచాధార ప్రభృతిక మమీషాం చ మిలనమ్।
తదేవం షోఢైక్యం భవతి ఖలు యేషాం సమయినాం
చతుర్ధైక్యం తేషాం భవతి హి సపర్యా సమయినామ్ ॥

కళ, నాదము,బిందువు అనే మూడు. చరణము అంటే చక్రము, వర్ణాలు, షట్చక్రాలను కలపటమే షడ్విధైక్యము అంటారు. కాని కొందరు సమయులు నాలుగు విధముల ఐక్యము (చతుర్విధైక్యము) మాత్రమే తీసుకోవాలి అంటారు.

1.షోడశ నిత్యలకు - మూలమంత్రానికి ఐక్యము
2.మూలమంత్రానికి - యాభై అక్షరాలతో ఐక్యము
3.యాభై అక్షరాలకు - చంద్రసూర్యాగ్నుల కళాత్మత్వము
4.చంద్రసూర్యాగ్నులతో - త్రిఖండత్వము.

వీటిని చతుర్విధైక్యము అంటారు.

నాలుగు దళాలు కలిగిన ఆధారచక్రాన్ని స్వాధిష్ఠానంతో అంతర్భూతం చేసి కౌలులు ఉపాసిస్తారు. ఆధారస్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. అక్కడ సమయులకు పూజలేదు. సమయులు మణిపూరం చేరిన దేవిని మాత్రమే పూజిస్తారు. ఇది సమయమతరహస్యము. షట్చక్రాలలో పంచభూతాలు, మనస్సు కలిసి ఉన్నాయి.

1. పిండాండ బ్రహ్మాండ ఐక్యాను సంధానము
2. షట్కమలాను సంధానము
3. పంచవిధ సామ్యముల అనుసంధానం
4. షడ్విధైక్యానుసంధానము చేత పిండాండము బ్రహ్మాండము వలె ప్రకాశిస్తుంది. ఇది యోగ శాస్త్ర రహస్యము. అందుకని యోగి అయినవాడు చతుర్విధైక్య సంధానము చెయ్యాలి అని చెప్పబడింది.

పిండాండ బ్రహ్మాండ యోరైక్యం లింగ సూత్రాత్మనోరపి
స్వాపావ్యాకృతయో రైక్యం క్షేత్రజ్ఞపరమాత్మనో :

1. పిండాండ బ్రహ్మాండములకు ఐక్యము
2. సూక్ష్మ శరీరానికి సూత్రాత్మకు ఐక్యము
3. స్వాపావ్యాకృతులకు ఐక్యము
4. క్షైతజ్ఞపరమాత్మలకు ఐక్యము. దీని వివరణ ఏమంటే,

1. పిండాండ బ్రహ్మాండాలకు ఐక్యము అంటే తెలుస్తుంది.
2. లింగ సూత్రాలకు ఐక్యము. ఇక్కడ, లింగాత్మ అంటే లింగ శరీరము. పదకొండు ఇంద్రియాలు గల గణము. సూత్రాత్మ అంటే బ్రహ్మాండం అంతా అర్చిరాది మార్గాలలో తీసుకుని పోయేవాడు. ఈ ఇరువురికీ ఐక్యము.
3. స్వాపావ్యాకృతులకు ఐక్యము : స్వాపుడు అంటే సుషుప్త్యవస్థ పొందిన వాడు. సాక్షి ప్రాజ్ఞుడు. అవ్యాకృతుడు అంటే అవిద్యాశబలిత మగు బ్రహ్మ. ఈ ఇద్దరికి ఐక్యము.
4. క్షేత్రజ్ఞ పరమాత్ముమలకు ఐక్యము: క్షేత్రజ్ఞుడు అంటే జీవాత్మ. పరమాత్మ అంటే పరబ్రహ్మ స్వరూపము. ఈ ఇద్దరికీ ఐక్యము.

ఈ నాలుగు రకాల ఐక్యతను చతుర్విధైక్యము అంటారు. ఇది సంప్రదాయరహస్యము. కొందరు సమయాచారుల ప్రకారము

| | | |
|---|---|---|
| 1.ఆధారాది షట్చక్రాలకు | - | త్రికోణాది షట్చక్రాలకు |
| 2.బిందు స్థానానికి | - | సహస్ర కమలానికి |
| 3.బిందువుకు | - | శివునికి |
| 4.శ్రీచక్రానికి | - | మూలమంత్రానికి గల ఐక్యతనే |
| | | చతుర్విధైక్యము అంటారు. |

మరికొందరి మతము ప్రకారము

1. కళా మేళనము.

2. నాద చరణ మేళనము.

3. బిందు షట్చక్రమేళనము.

4. పై మూడింటికీ శివునితో మేళనములను చతుర్విధైక్యమంటారు. దీనినుంచే విశ్వమంతా వ్యాపించి ఉన్నది. దీని స్థానము సహస్రారము.

కళలు, నిత్యలు, తిథులు, స్వరములు అన్నీ పదహారు చొప్పున ఉన్నాయి. ఇవన్నీ పంచదశీ మహామంత్రంలో ఖండాలుగా ఉండి సోమ, సూర్య అనలాత్మకములుగా పిలువబడుతున్నాయి. వీటికి మూడు గ్రంథులున్నాయి. గ్రంథిత్రయమే హ్రీంకార త్రయము. హ్రీంకారము భువనేశ్వరి. భువనేశ్వరీ మంత్రాంర్గతమైన మూలమంత్రము శ్రీచక్రస్వరూపము. శ్రీచక్రం షట్చక్రాంతర్గతము. ఇది శ్రీవిద్యలో గల పంచైక్యము లని చెప్పబడింది.

బిందువునుండి వెలువడిన విశేషములే తత్త్వాలు. ఇవి ఇరవైనాలుగు అని, ముప్పైఆరు అనీ, యాభైఒకటి అని, అంటారు. బిందువు నుండి వెలువడిన శబ్ద పరిణామమే పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి అనేవి శ్రీచక్రంలో గల

| | | |
|---|---|---|
| 1.త్రికోణము | - | పర |
| 2.అష్టకోణము | - | పశ్యంతి |
| 3.దశార ద్వయము | - | మధ్యమ |
| 4.చతుర్దశారము | - | వైఖరి అని చెప్పబడింది. |

కాబట్టి శ్రీచక్రానికి నాద వ్యవహారము కలిగింది. కాబట్టి ఇంద్రియాలు, చంద్ర సూర్యాగ్ని మండలాలు, త్రిలోకాలు శ్రీచక్రంలో ఉన్నాయి. షట్చక్రాలకు శ్రీచక్రంతో ఐక్యత ఉంది. కాబట్టి శ్రీచక్రానికి నాదత్వ వ్యవహారము ప్రసిద్ధము అని చెప్పబడింది.

పిండాండము ద్రష్ట,బ్రహ్మాండము లోకము. బ్రహ్మాండము 2.పిండాండము 3. దేవతలు వీటికి ప్రతీకలుగా 1. బిందువు 2. నాదము 3. కళలు ఉన్నాయి.

అపుడు 1.బిందువు 2. బ్రహ్మాండము 3. నాదము 4. పిండాండము 5. కళలు 6. దేవతల తో కూడిన యంత్రం వస్తుంది. బిందువు పిండాండానికి ప్రతిబింబము. నాదము శ్రీచక్రము బ్రహ్మాండానికి ప్రతిబింబము. మంత్రము దేవతకు ప్రతిబింబము. ఇవన్నీ ఒకటే. వీటికి బేధాలు లేవు.

1. శ్రీచక్రంలో - బ్రహ్మాండము
2.మంత్రంలో - దేవత
3.బిందువులో - పిండాండము
4.పిండాండంలో - బ్రహ్మాండము
5.పిండాండమున - దేవత
6 పిండాండమున - బిందువు

వీటిని ఐక్యమొనర్చినట్లు భావిస్తే దాన్ని షడ్విధైక్యము అంటారు. బిందునాద కళలను దేవతతో ఐక్యమొనరిస్తే చతుర్విధైక్యమంటారు.

సాధ చతుర్విధైక్యము చేసినట్లయితే మణిపూరంలో దేవత చతుర్భుజగాను,షడ్విధైక్యము చేసినట్లయితే దశభుజగాను దర్శనమిస్తుంది. ఇది సమయమతరహస్యము.

## 9. రశ్మలు (కిరణములు)

త్రిఖండం తే చక్రం శుచిరవిశశాంకాత్మకతయా
మయూఖైః షట్త్రింశద్దశయుతతయా ఖండకలితైః!
పృథివ్యాదౌ తత్త్వే పృథగుదితవద్భిః పరివృతం
భవేన్మూలాధారా త్ప్రభృతి తవ షట్చక్రసదనమ్ !!

మాతృకా చక్రము అంటే శ్రీ చక్రము. అది సోమ, సూర్య, అనలాత్మకమయి మూడుఖండములుగా ఉన్నది. అగ్నికి నూటఎనిమిది జ్వాలలు. చంద్రునికి నూటముప్పైఆరు కళలు, సూర్యునికి నూటపదహారు కిరణములున్నాయి. ఈ మొత్తం కలిపి 360. ఈ ప్రకారం సోమసూర్యాగ్నులు పిండాండ, బ్రహ్మాండముల నావరించి తిరుగుచున్నారు. పిండాండ బ్రహ్మాండముల ఏకత్వము వలన, పిండాండము యొక్క ఆవృతి బ్రహ్మాండము యొక్క ఆవృతి అవుతున్నది అనేది పరమ రహస్యము.

చంద్రకళావిద్య అనే పేరుగల ఈవిద్య పదిహేనుతిథుల స్వరూపం కలద వటంచేత మూడువందలఅరవై కిరణములు రోజుల స్వరూపమై ఉన్నవి. వాటిన్నే సంవత్సరము అంటారు. కాలశక్తి స్వరూపమయిన ఆ సంవత్సరము ప్రజాపతి రూపమై ఉన్నది. ప్రజాపతి జగత్కర్త. ఈ కిరణములే జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయాలు కావిస్తూ ఉంటాయి.

మొత్తం మూడువందలఅరవై కిరణాలు డెబ్బైరెండువేల నాడీ మార్గంలో ప్రసరిస్తూ, సుధాధారలు వర్షింప చేస్తూ సాధకులకు తృప్తినిస్తాయి. ఈ కిరణాలకు పై భాగానదేవీపాదాలు ఉంటాయి.

ఈ విషయం భైరవయామళంలోని చంద్రజ్ఞాన విద్యలో చెప్పబడింది.

బహ్మాండం భాసయన్త స్తే పిండాండ మపిశాంకరి
దివా సూర్య : స్తథారాత్రౌ సోమో వహ్నిశ్చ సంధ్యయో : ॥
ప్రకాశయంతః కాలాంస్తే తస్మా త్కాలాత్మక స్త్రయః
షష్ట్యుత్తరం చ త్రిశతం దినాన్యేవచ హాయనమ్ ॥
హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రితి శ్రుతిః
ప్రజాప్రతి ర్లోకకర్తామరీచి ప్రముఖా న్మునీన్ ॥
సృజం త్యేతే లోక పాలాన్ తే సర్వే లోకరక్షకాః
సంహారశ్చ హరాయత్తః ఉత్పత్తి ర్భవనిర్మితా ॥
రక్షాతు మృడసంలగ్నా సృష్టిస్థితిలయే శివః
నియుక్తః పరమేశాన్యా జగ దేవం ప్రవర్తతే ॥

ఓ శాంకరీ! ఆ కిరణాలు పిండాండ బ్రహ్మాండములను కూడి ప్రకాశింప చేస్తున్నాయి. పగలు సూర్యుడు, రాత్రులందుచంద్రుడు, సంధ్యవేళయందుఅగ్ని ఆయా కాలములను ప్రకాశింప చేస్తున్నారు. మూడువందలఅరవై రోజులైతే ఒక సంవత్సరము. ప్రజాపతి సంవత్సర స్వరూపుడు. అతడే మరీచి మొదలైన మునులను సృష్టిస్తున్నాడు. వీరందరూ లోకరక్షకులే. జగత్తు యొక్క సృష్టిని భవుడు, రక్షణ మృడుడు, లయము హరుడు చేస్తున్నారు. వీరందరినీ పరమేశ్వరి ఆయా పనులకు నియమించింది.

త్రిఖండాలు అంటే మూడుఖండాలు. అవి ఇచ్ఛ, జ్ఞాన, క్రియా శక్తులు. జాగ్రత్ స్వప్న, సుషుప్తి అనే అవస్థలు, సత్వ, రజస్ తమో గుణాలు, విశ్వ, తైజస ప్రాజ్ఞలని గుర్తించాలి.

ఈ కిరణాలన్నీ మూలాధారాది షట్చక్రములలో ఉన్నాయి. షట్చక్రాలే నిలయంగా ఉన్న పరాశక్తి స్వరూపమే శ్రీచక్రము. సోమసూర్యాగ్నులకు ప్రతీకలుగా మూడు ఖండాలు ఉన్నాయి. నాదము అంటే శ్రీచక్రము. కళ అంటే రశ్మి. కళామంత్రాల సమ్మేళనే శ్రీచక్రము. షట్చక్రాల్లో భూమికి ఇరవైఆరు, జలమునకు యాభైరెండు, అగ్నికి అరవైరెండు, వాయువునకుయాభైఒకటి, ఆకాశానికి డెబ్భైరెండు, మనస్సునకు అరవైనాలుగు రశ్ములున్నాయి. కాలాత్మకమైన రశ్ములు పరాశక్తి యొక్క చరణముల నుండి పుట్టినవి. ఈ రకంగా గౌడపాదాచార్యులవారు ఈ శ్లోకంలో రశ్ములను వివరించారు.

శతంచాష్టావహ్నేః శతమపికళాః షోడశ రవేః
శతంషట్త్రింశత్సోమమయూఖా శ్చరణజాః!

య ఏతే షష్టిశ్చ త్రిశతమభవం స్త్వచ్చరణజాః
మహానౌని షట్శాన్నాం న హి తవ శివే కాలకలనా !!

గతంలో చెప్పినట్లుగా సోమ సూర్య అగ్నిఖండాలలో మొత్తం మూడువందల అరవై కిరణాలున్నాయి. షట్చక్రాలు ఈ మూడుఖండాలలోనే ఉన్నాయి. అంటే ఒక్కొక్క ఖండానికి రెండేసి చక్రాలు చొప్పున విభజించబడ్డాయి. కాబట్టి ఆ ఖండాలకు ఉన్నకిరణాలుకూడా ఈ చక్రాల మధ్య విభజించబడ్డాయి. అగ్నిజ్వాలలునూటఎనిమిది. అగ్నిస్థానాలు మూలాధార మణిపూరాలు. అందుచేత ఈ జ్వాలలు ఆధారచక్రంలో యాభైఆరు, మణిపూరంలో యాభైరెండు ఆవరించి ఉంటాయి. సూర్యకిరణాలు నూటపదహారు సూర్యస్థానాలుగా చెప్పబడేవి స్వాధిష్ఠాన అనాహతాలు. అందువల్ల స్వాధిష్ఠానంలోఅరవైరెండు, అనాహతంలో యాభైనాలుగు కిరణాలుంటాయి. అదే విధంగా చంద్రకళలు నూటముప్పైఅరు. విశుద్ధి చక్రంలో డెభైరెండు, అజ్ఞా చక్రంలో అరవైనాలుగు కళలుంటాయి. ఈ కిరణములు మొత్తం మూడువందలఅరవై కలిస్తే ఒక సంవత్సరం. పరాశక్తికి కాలోపహరణం లేదు. కౌళమతస్థులకు అధార స్వాధిష్ఠానాలే పూజనీయాలు కాబట్టి మిగిలిన చక్రాలతో పనిలేదు. అందుచేత కాల నిర్ణయము వారి మతంలో లేదు. కాలాత్మశక్తి అయిన శుద్ధ విద్యనే చంద్రకళావిద్య అంటారు. నిత్యలు కళా స్వరూపాలు, కళలు తిథుల స్వరూపాలు. పదిహేనుతిథులు ఒక పక్షము. రెండు పక్షములు ఒక మాసము. పన్నెండు మాసములు ఒక సంవత్సరము అంటే 360 రోజులు. కాబట్టి నిత్యల గమనం వల్ల సంవత్సరం ఏర్పడుతోంది.

## 10. సుధాసింధువు:

మహిమాన్విత అయిన ఆ దేవి ఎక్కడ ఉంటుందో శంకరులవారు సౌందర్యలహరి లోని 'సుధా సింధోర్మధ్యే' అన్న ఎనిమిదవ శ్లోకంలో చెప్పారు.

సుధాసిన్ధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చిన్తామణి గృహే।
శివాకారే మఞ్చే పరమశివపర్యఙ్కనిలయామ్
భజన్తి త్వాం ధన్యాః కతిచన చిదానన్దలహరీమ్ ॥

క్షీర సముద్ర మధ్యమునందున్న మణి ద్వీపమున కల్పవృక్షములవనములచే చుట్టు కొనబడిన కదంబ వృక్షముల ఉద్యానవనమునందు చింతామణి గృహమునందు, శివాకార మంచమున శివపర్యంక మందున్నదై సచ్చిదానంద తరంగరూపమగు నిన్ను కొందరు ధన్యులు

మాత్రము సేవించుచున్నారు. (అందరికీ నీసేవ సామాన్యముగా లభింపదని భావము). ఇదే విషయాన్ని వామకేశ్వరతంత్రం, భైరవయామళం, బహురూపాష్ట కాలలో ఈ విధంగా చెప్పారు.

బిందుస్థానం సుధా సింధుః పంచయోన్య స్సురద్రుమాః ।
తత్రైవ నీపశ్రేణీచ, తన్మధ్యే మణిమంటపం॥
తత్ర చింతామణికృతం దేవ్యా మందిర ముత్తమమ్।
శివాత్మకే మహామంచే మహేశానోపబర్హణే॥
అతిరమ్యతరే తత్ర కశిపుశ్చ సదాశివః ।
భృతకాశ్చ చతుష్పాదా మహేంద్రశ్చ పతద్గ్రహః ॥
తత్రాస్తే పరమేశానీ మహాత్రిపురసుందరీ ।
శివార్కమండలంభిత్వా, ద్రావయంతీందుమండలమ్॥
తదుద్భూతామృతస్యంది పరమానందనందితా ।
కులయోషిత్కులంత్యక్త్వా, వరం వర్షణమేత్యసౌ ॥

బిందుస్థానమే పాలసముద్రం పంచయోనులే కల్ప వృక్షాలు అక్కడ కదంబ వనంలో, రత్నమంటపం మధ్యన చింతామణులతో నిర్మించిన గృహంలో, శక్తి రూపమైన మంచంమీద పరమేశ్వరుడు తలగడ, బ్రహ్మాదులు సేవకులు, ఇంద్రుడు తమ్మపడిగగా ఆదేవి సేవించబడుతూ ఉంటుంది.

---

## పాద ద్వంద్వము

35. క్రమణం పదవిక్షేపః క్రమోదయస్తేన కథ్యతే ద్వేధా
ఆవరణం గురుపంక్తిః ద్వయ మిద మంబాపదాంబుజప్రసరం॥

క్రమము పాద విక్షేపమని, క్రమోదయ మని రెండు రకాలుగా చెప్పబడుతోంది. చక్రంలో ఉన్న శక్తులే గురుమండలము. ఈ రెండూ త్రిపురసుందరి పాదయుగళముగ ఉన్నవి.

ఇక్కడ పదవిక్షేపము అంటే అగణిత గుణాత్మికానంతశక్తి జననసామర్థ్యము అనగా లెక్కపెట్టటానికి వీలులేనంత శక్తిని ఉద్భవింపచేసే సామర్థ్యము. గురుమండలము దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘ అని మూడు భాగాలుగా ఉన్నది. శ్రీచక్రంలోని ఆవరణ దేవతలు, గురుమండలము రెండూ కూడా ఆ పరాశక్తి అయిన త్రిపురసుందరీదేవి పాదములయొక్క కాంతియే.

---

# ఆవరణ దేవతలు

**36. సేయం పరా మహేశీ చక్రాకారేణ పరిణమేత యదా**

**తద్దేహావయవానాం పరిణతి రావరణదేవతా స్సర్వాః॥**

ఇంతవరకు వర్ణించబడిన సర్వేశ్వరి అక్క న ఆ ఆదిపరాశక్తి ఏ కాలమందు చక్రాకారంగా పరిణమించిందో, ఆకాలమందే ఆమె యొ శరీరంలోని అవయవాలు ఆవరణ దేవతలు అయినాయి.

నిత్యనిరవధిక తేజోమయి, చతుష్షష్టికోటియోగినీ గణసేవిత అయిన అపరాభట్టారిక ఎప్పుడైతే చక్రాకారందాల్చిందో అంటే పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపాలు, త్రికోణము మొదలైన నవచక్రాల ఆకారం పొందిందో, అప్పుడే ఆమె యొక్క కాంతి కిరణాలు శ్రీచక్రంలోని నవావరణ దేవతా స్వరూపాలయినాయి. అంటే ఆత్మ వలననే అనంతకోటి శక్తులు ఉద్భవించినాయి.

---

## ప్రథమావరణము
## సర్వానందమయ చక్రము
### (కామేశ్వరీ ద్వంద్వస్వరూపము)

**37. ఆసీనా బిందుమయే చక్రే సా త్రిపురసుందరీ దేవీ**

**కామేశ్వరాంకనిలయా కలయా చంద్రస్య కల్పితోత్తంసా॥**

**38. పాశాంకుశేక్షుచాపప్రసూనశరపంచకాంచితస్వకరా**

**బాలారుణారుణాంగీ శశిభానుకృశానులోచనత్రితయా॥**

సం

సర్వానందమయమైన బిందు పీఠః దు సకల ంత్స్వరూపిణి అయిన దేవి కామేశ్వరుని వామాంకము నివాస స్థానంగా, చంద్రకళ శిరోభూష గా, ఇచ్ఛాశక్తి రూపమైన పాశము, జ్ఞానశక్తి పమైన అంకుశము మనస్సు అను పుండ్రేక్షుచాపము, తన్మాత్రలు అనబడు బాణ పంచకమ ు నాలుగు చేతులయందు ధరించి, బాలభానునిపలె ని శరీరచ్ఛాయ కలిగి చంద్ర సూర్యాగ్నులు నేత్రత్రయముగా కలిగి శ్రీ రాజరాజేశ్వరీ పరాభట్టారిక ఆసీనురాలై ఉన్నది.

శ్రీచక్రంలో బిందువు నుంచి భూపురం వరకు తొమ్మిది ఆవరణలున్నాయి. శ్రీచక్రపూజ, నవావరణార్చన చేసేప్పుడు భూపురం దగ్గర నుంచి మొదలుపెట్టి బిందువు వరకు పూజిస్తారు. కాని సృష్టిక్రమానుసారంగా శ్రీచక్రలేఖనం చేసేప్పుడు బిందువుతో మొదలు పెట్టి భూపురంవరకు గీయాలి అని చెప్పటం జరిగింది. అందుచేతనే ఇక్కడ బిందువునుంచి ప్రారంభించటం జరిగింది.

శ్రీచక్రంలో మొత్తం తొమ్మిది ఆవరణలున్నాయి. వాటన్నింటికీ విడివిడిగా పేర్లున్నాయి. తొమ్మిది ఆవరణలను, వాటి పేర్లను ఈ దిగువ ఇవ్వటం జరిగింది.

1. బిందువు - సర్వానందమయ చక్రము
2. త్రికోణము - సర్వరోగహర చక్రము
3. అష్టకోణము - సర్వసిద్ధిప్రద చక్రము
4. అంతర్దశారము - సర్వరక్షాకర చక్రము
5. బహిర్దశారము - సర్వార్థసాధక చక్రము
6. చతుర్దశారము - సర్వసౌభాగ్యదాయక చక్రము
7. అష్టదళము - సర్వసంక్షోభిణీ చక్రము
8. షోడశదళము - సర్వాశాపరిపూరక చక్రము
9. భూపురము - త్రైలోక్యమోహన చక్రము

ఈ తొమ్మిది చక్రాలలోను విడివిడిగా దేవతలు ఉన్నారు. రత్నాయమహర్షి వ్రాసిన 'ఆవరణ దేవతాస్తుతిలో'ను, 'వామకేశ్వరతంత్రం'లోని ఖడ్గమాల, 'యోగినీ హృదయం' ఇంకా అనేక తంత్ర శాస్త్రాలలో శ్రీచక్ర వివరణ ఇవ్వటం జరిగింది.

**ఆవరణ దేవతాస్తుతి :**

**ఓం-పంచబ్రహ్మమహామంచ తిరస్కరణ కారిణీమ్।**
**పంచకృత్యప్రపంచైకసమ్రాజ్ఞీం పంవిదం నుమః ॥ 1**

**బ్రాహ్మే ముహూర్తే శయనా దుత్థితో ऽహం విచింతయే, ।**
**అమీలమా బ్రహ్మరంధ్రం జ్వలంతీం వరసంవిదమ్.॥ 2**

**తదీయ తేజః పుంజేన పింజరీకృతవిగ్రహామ్,।**
**స్నాస్యే మూర్ధస్థగుర్వంఘ్రి గళితైరమృతద్రవైః॥ 3**

తాపత్రయనిహన్తారం దీప్తమార్తాండభైరవమ్।
ఇంధానమోహబంధాంధకారం ధ్వాన్వంత మంశుభిః॥ 4

ప్రకాశశక్తిమరుణా మేతన్మండలమధ్యగామ్,
సంభావయామి నాదాంఘ్రి సుధాంభో ర్ఘ్యసమర్పణైః॥ 5

పరిష్వక్తతనుం వందే రక్తద్వాదశశక్తిభిః,।
ద్వీపనాథసమారూఢం ద్వీపనాథం ధృతాంశుకమ్॥ 6

అంతర్నిరంజనజ్యోతి రర్చనోచితసాధనమ్,।
పరాహంతామయం యాగమందిరం ప్రవిశామ్యహమ్॥ 7

ప్రవిశ్య చ హృదా చక్రరాజం ధ్యాయామి సర్వతః ।
అనేక చితిశక్తీనా మాలంబం నిలయం శ్రియమ్ ॥ 8

భూగృహస్వరపత్రాబ్జ సస్వరాన్వువనాశ్రయమ్।
దశారయుగ్మనాగాస్రత్ర్య స్రబిందూనహం శ్రయే॥ 9

త్రైలోక్యమోహనం వందే సర్వాశాపరిపూరకమ్ ।
సర్వసంక్షోభణం చక్రం సర్వసౌభాగ్యదాయకమ్ ॥ 10

సర్వార్థసాధకం చక్రం సర్వరక్షాకరం పరమ్ ।
సర్వరోగహరం చక్రం సర్వసిద్ధిప్రదాయకమ్ ॥ 11

సర్వానందమయం చక్రమితి చక్రక్రమం భజే ।
ఇమం మహాచక్రరాజ మింధానం స్వేన తేజసా ॥ 12

విమృశ్య పుష్పాంజలినా వ్యాకీర్ణేనార్చయామిచ ।
అమృతాబ్ధ్యవతారాబ్జ దేవ్యాత్మాసన మేవచ ॥ 13

శ్రీచక్రాసనమంత్రాఖ్య సాధ్యసిద్ధాసనం భజే ।
షడంగవాఙ్మయీన్యాస సన్నద్ధానిజవిగ్రహః ॥ 14

మూలమంత్రాక్షరన్యాసషోఢాచక్రాదిలక్షితః ।
వేత్తృవేదన వేద్యాత్మా వహ్న్యార్కాచ్ఛకదాత్మకమ్ ॥ 15

స్మరామ్యాధారపాత్రార్ఘ్య మర్చాయై మూలసంవిధి ।
మహాపద్మాసనాంతస్థే కారణానంతవిగ్రహే ॥ 16

సర్వభూతహితే మాతరేహ్యేహి పరమేశ్వరి, ।

ఇతి మంత్రేణ పరమా మిచ్ఛాకలితవిగ్రహామ్ ॥ 17

నివేశయామి హృచ్చక్రస్థితాం హృచ్చక్రమధ్యతః ।

అథ మధ్యే మహాబిందుచక్రబింబనిభాలయే ॥ 18

అకృత్రిమా మహం జ్ఞప్తిరూపాం త్రిపురసుందరీమ్ ।

అరుణా మరుణాకల్పాం శరచాపగుణాంశుకైః ॥ 19

అలంకృత చతుర్బాహు మంబా మానందకందలీమ్ ।

తతఃపద్మనిభేత్యాది జ్ఞానసూక్తేన చిన్మయీమ్ ॥ 20

యజనాయ చిరం ధ్యాయామ్యైక్యాత్మజ్యోతిరాశ్రయామ్ ।

అథ రేఖాత్రయాంతస్థ విసర్గానందభాసకమ్ ॥ 21

మహాత్రికోణం నిధ్యాయాదితి నిత్యం సదార్చయేత్ ।

వందేం కామేశ్వరీం నిత్యాం వరాం చ భగమాలినీమ్ ॥ 22

నిత్యక్లిన్నామపి భజే భేరుండాం వహ్నివాసినీమ్ ।

మహాచక్రేశ్వరీం దుర్గాం మహావీరాసనస్థితామ్ ॥ 23

నిత్యాం నీలపతాకాం చ విజయాం సర్వమంగళామ్ ।

జ్వాలామాలినికాం చిత్రా మధ్వరే షోడశీం భజే ॥ 24

పరేశీ పరమేశ్యంబా శ్రీచర్యామిత్రనాయికా ।

షష్ఠీహ్యారుంధతీ లోపాముద్రాగస్త్యాదిపత్నయః ॥ 25

కాలతాపనధర్మార్య ముక్తకేశీశ్వరానపి ।

తథా దీపకళానాథం సిద్ధౌఘ మిమ ముత్తమమ్ ॥ 26

విష్ణుం ప్రభాకరం తేజో మనోజం చ విచింతయే ।

కళ్యాణరత్న దేవం చ వాసుదేవం తథాష్టమమ్ ॥ 27

శ్రీరామానందనాథ శ్రీదాయినేభ్యో నిరంతరమ్ ।

శ్రీరామానందనాథ శ్రీపాదుకాభ్యాం నమోనమః ॥ 28

గరిమాణం లఘిమానం వశిత్వమీశత్వ మణిమమహిమానౌ ।

ప్రాకామ్యం భక్త్యాహం వందే ప్రాప్తిం చ సర్వకామార్థమ్ ॥ 29

ఏతాసాం సంతతగృహ ప్రదక్షిణానిల మహం వందే ।

బ్రాహ్మీమాహేశ్వర్యౌ కౌమారీ వైష్ణవీ చ వారాహీ ॥ 30
ఇంద్రాణీ చాముండా లక్ష్మీః పాండూ ద్వితీయ భూగృహగాః ।
సంక్షోభద్రావణకా కర్షణకావేశకోన్మదాదీంశ్చ ॥ 31
ఖేచరీబీజయోన్యాఖ్యాః స్మృతయశ్చ గృహేభజే ।
ఏతాః ప్రకటయోగిన్య స్త్రిపురా చక్రనాయికా ॥ 32
సర్వసంక్షోభిణీ ముద్రా పాయాదేతత్త్రికంమయి ।
కామాకర్షిణికా నిత్యా బుద్ధ్యాకర్షణికా కళా ॥ 33
అహంకారాకర్షణీ చ శబ్దాకర్షణికా తథా ।
స్పర్శాకర్షిణికా నిత్యా రూపాకర్షిణికా కళా ॥ 34
రసాకర్షిణికా నిత్యా గంధాకర్షిణికా కళా ।
చిత్తాకర్షిణికా నిత్యా ధైర్యాకర్షిణికా కళా ॥ 35
స్మృత్యాకర్షిణీ నిత్యా శరీరాకర్షణీ కళా ।
బీజాకర్షిణికా నిత్యా చాత్మాకర్షిణికా కళా ॥ 36
అమృతాకర్షిణికా నిత్యా నామాకర్షణికా కళా ।
ఏతాస్తు గుప్తయోగిన్య స్త్రిపురేశీపదాంతికే ॥ 37
సర్వవిద్రావణీముద్రా త్రయం మాం పాతు సర్వదా ।
అనంగకుసుమాఽనంగ మేఖలా చ ద్వితీయకా ॥ 38
అనంగమదనాఽనంగమదనాతురయా సహ ।
అనంగ రేఖా చానంగ వేగానంగాంకుశాపిచ ॥ 39
అనంగమాలినీ పాండునాగపత్రస్థితా ఇమాః ।
ఏతాగుప్తతరాభిఖ్యా స్త్రిపురేశీపదాంతికే ॥ 40
సర్వాకర్షణికా ముద్రా సంఘాతోఽవతు మాం సదా।
సర్వసంక్షోభిణీ శక్తి స్సర్వవిద్రావిణీ తథా ॥ 41
సర్వభంజనశక్తిశ్చ తథా సర్వవశంకరీ ।
సర్వరంజనశక్తిశ్చ సర్వోన్మాదనశక్తికా ॥ 42
ఏవం సంమోహినీశక్తిస్సర్వ స్తంభనకారిణీ ।
సర్వార్థసాధనీ శక్తిస్సర్వసంపత్స్వరూపిణీ ॥ 43

సర్వమంత్రమయీ శక్తిస్సర్వద్వంద్వక్షయంకరీ ।
ఏతాస్తు సంప్రదాయాఖ్యా స్త్రిపురేశీపదాంతికే ॥ 44
ముద్రాశక్తిస్వరూపాఢ్యాస్తత్రన్నామాంకితాస్తు తాః ।
తద్దేవీనాం మహాముద్రాబృందమేతత్సదావతు ॥ 45
సర్వసిద్ధిప్రదా దేవీ సర్వసంపత్ప్రదా తథా ।
సర్వప్రియంకరీ దేవీ సర్వమంగళ కారిణీ ॥ 46
సర్వకామప్రదా దేవీ సర్వదుఃఖ విమోచనీ ।
సర్వమృత్యుప్రశమనీ సర్వవిఘ్న నివారిణీ ॥ 47
సర్వాంగసుందరీ దేవీ సర్వసౌభాగ్యదాయినీ ।
ఏతా దేవ్యః కులోత్తీర్ణా స్త్రిపురాచక్ర నాయికాః ॥ 48
సర్వోన్మాదకముద్రాశ్చ సర్వాస్తాః పాతు మాం సదా ।
సర్వజ్ఞా సర్వశక్తిశ్చ సర్వైశ్వర్య ప్రదాయినీ ॥ 49
సర్వజ్ఞానమయీ దేవీ సర్వవ్యాధివినాశినీ ।
సర్వాధారస్వరూపా చ సర్వపాపహరా తథా ॥ 50
సర్వానందమయీ దేవీ సర్వరక్షాస్వరూపిణీ ।
సర్వేప్సిత ప్రదా హ్యేతా యోగిన్యో గర్భసంజ్ఞికాః ॥ 51
త్రిపురా మాలినీ చైవ ముద్రాచైవ మహాంకుశమ్ ।
అంతర్దశారసంచార్య స్సర్వా మాంపాంతు వైభృశమ్ ॥ 52
వశినీ కామేశ్వర్యో మోదిన్యమలారుణాజయిన్యశ్చ ।
సర్వేశీ కౌళిన్య శ్చేతాస్తు రహస్య యోగినీ దేవ్యః ॥ 53
మాం పాతు లోకవంద్యా త్రిపురా సిద్ధా చ ఖేచరీ దేవీ ।
సర్వజనజంభ నేఘాన్వందే ఽఖిల జనవిమోహనం ధనుః ॥ 54
పాశం వశీకృతికరం స్తంభనమంకుశమపీహ లలితాయాః ।
కామేశ్వరీ వజ్రేశ్వరీ భగమాలిన్యోఽపి పాయాసుః ॥ 55
కోణత్రయవాస్తవ్యా ఏతాః పరమతి రహస్య యోగిన్యః ।
త్రిపురాంబా చక్రేశీ సబీజముద్రా సదా పాతు ॥ 56
యా బిందుచక్రనిలయా విశుద్ధసంవిద్విలాసకల్లోలా ।
సా పాతు మాం సమంతా త్సాంద్రానందార్ణవైక చంద్రకళా ॥ 57
సర్వానందమయస్థా పరాపరరహస్యయోగినీ శోణా ।

శ్రీమన్మహాత్రిపురసుందర్యభిధా యోనిముద్రయా సహితా ॥ 58

సర్వాగమప్రబోధ్యా సర్వమయీ సర్వపీఠమంత్రమయీ ।

సర్వారుణా సమింధాం సత్యం మన్మనసి సంవిదారంభే ॥ 59

కువలయసదృగక్షీ కుంకుమక్షోదతామ్రా

ధృతగుణసృణిపాణీ దీప్తపంచేషుచాపా ।

పరచితిమయపంచప్రేతమంచాధిరూఢా

భవతు పరమసంవిద్భావనా భాగ్యభాజామ్ ॥ 60

వస్తువిచారే గూఢే నిస్తులనిరఖండసంవిదా కారే ।

నిత్యానందే జ్యోతిషి సత్యాధారే మృషా సర్వమ్ ॥ 61

చేదపి తు ప్రాతిభాసిక బోధానందానుభూతి సామ్రాజ్యే ।

మాయాయాశ్రీదేవ్యాః పాయాదాభరణ దేవతాస్తోత్రమ్ ॥ 62

అనేక కోటి బ్రహ్మాండజననీ దివ్యవిగ్రహా।

శ్రీచక్రవాసినీ శ్రీదా సచ్చిదానంద లక్షణా॥ 63

గాయత్రీ త్రిపురా దేవీ ధియో యోనః ప్రచోదయాత్।

రాజరాజేశ్వరీ సైవ గతిర్మమ నిరంతరమ్.॥ 64

ఖడ్గమాల:-

హ్రీంకారాసనగర్భితానలశిఖాం సౌః క్లీం కళాం బిభ్రతీం

సౌవర్ణాంబరధారిణీం వరసుధా ధౌతాం త్రినేత్రోజ్జ్వలామ్

వందేపుస్తకపాశమంకుశధరాం స్రగ్భూషితాముజ్జ్వలాం

త్వాంగౌరీం త్రిపురాం పరాత్పరకళాం శ్రీచక్రసంచారిణీమ్.

అస్య శ్రీశుద్ధశక్తిమాలామహామంత్రస్య, ఉపస్థేంద్రియాధిష్ఠాయీ వరుణాదిత్య ఋషిః దైవీ గాయత్రీచ్ఛంద్రః సాత్విక కకార భట్టారక పీఠస్థిత కామేశ్వరాంక నిలయా మహాకామేశ్వరీ శ్రీ లలితా పరాభట్టారికా దేవతా, ఐం బీజం క్లీం శక్తిః సౌః కీలకం, మమఖడ్గ సిద్ధ్యర్థే జపేవినియోగః మూలమంత్రేణ షడంగన్యాసం కుర్యాత్,

ధ్యానమ్: తాదృశం ఖడ్గమాప్నోతి యేనహస్త స్థితేన వై అష్టాదశ మహాద్వీప సమ్రాడ్భోక్తా భవిష్యతి, ఆరక్తాభాం త్రినేత్రా మరుణిమ వదనాం రత్నతాటంకరమ్యాం హస్తాంభోజైస్సపాశాంకుశ మదన ధనుస్సాయ కైర్విస్ఫురంతీమ్, ఆపీనోత్తుంగ వక్షోరుహ కలశలుఠత్తార హారోజ్జ్వలాంగీం, ధ్యాయేదంభోరుహస్థా మరుణిమవసనా మీశ్వరీ మీశ్వరాణామ్,

లమిత్యాది పంచపూజాం కుర్యాత్, యథాశక్తి మూలమన్త్రం జపేత్.

ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఓం నమస్త్రిపురసుందరి హృదయదేవి, శిరోదేవి, శిఖాదేవి, కవచదేవి, నేత్రదేవి, అస్త్రదేవి, కామేశ్వరి, భగమాలిని, నిత్యక్లిన్నే, భేరుండే, వహ్నివాసిని, మహావజ్రేశ్వరి శివదూతి, త్వరితే, కులసుందరి, నిత్యే, నీలపతాకే, విజయే, సర్వమంగళే, జ్వాలామాలిని, చిత్రే మహానిత్యే పరమేశ్వరపరమేశ్వరి, మిత్రేశమయి, షష్ఠీశమయి, ఉడ్డీశమయి, చర్యానాథమయి, లోపాముద్రామయి, అగస్త్యమయి, కాలతాపనమయి, ధర్మాచార్యమయి, ముక్తకేశీశ్వరమయి, దీపకళా నాథమయి, విష్ణుదేవమయి, ప్రభాకర దేవమయి, తేజో దేవమయి, మనోజదేవమయి, కళ్యాణదేవమయి, వాసుదేవమయి, రత్నదేవమయి, శ్రీరామానందమయి,

1. అణిమాసిద్ధే, లఘిమాసిద్ధే, గరిమాసిద్ధే, మహిమాసిద్ధే, ఈశిత్వసిద్ధే, వశిత్వసిద్ధే, ప్రాకామ్యసిద్ధే, భుక్తిసిద్ధే, ఇచ్ఛాసిద్ధే, ప్రాప్తిసిద్ధే, సర్వకామసిద్ధే, బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, మాహేంద్రి, చాముండే, మహాలక్ష్మి, సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని సర్వమహాంకుశే, సర్వఖేచరి, సర్వబీజే, సర్వయోనే, సర్వత్రిఖండే, త్రైలోక్య మోహనచక్రస్వామిని, ప్రకటయోగిని,

2. కామాకర్షిణి, బుద్ధ్యాకర్షిణి, అహంకారాకర్షిణి, శబ్దాకర్షిణి, స్పర్శాకర్షిణి, రూపాకర్షిణి, రసాకర్షిణి, గంధాకర్షిణి, చిత్తాకర్షిణి, ధైర్యాకర్షిణి, స్మృత్యాకర్షిణి నామాకర్షిణి, బీజాకర్షిణి, ఆత్మాకర్షిణి, అమృతాకర్షిణి, శరీరాకర్షిణి, సర్వాశాపరిపూరక చక్రస్వామిని, గుప్తయోగిని,

3. అనంగకుసుమే, అనంగమేఖలే, అనంగమదనే, అనంగమదనాతురే, అనంగరేఖే, అనంగవేగిని, అనంగాంకుశే, అనంగమాలిని, సర్వసంక్షోభణచక్రస్వామిని, గుప్తతరయోగిని,

4. సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వాహ్లాదిని, సర్వసమ్మోహిని, సర్వస్తంభిని, సర్వజృంభిణి, సర్వవశంకరి, సర్వరంజని, సర్వోన్మాదిని, సర్వార్థసాధికే, సర్వసంపత్తిపూరణి, సర్వమంత్రమయి, సర్వద్వంద్వ క్షయంకరి, సర్వసౌభాగ్యదాయకచక్రస్వామిని, సంప్రదాయయోగిని,

5. సర్వసిద్ధిప్రదే, సర్వసంపత్ప్రదే సర్వప్రియంకరి, సర్వమంగళకారిణి, సర్వకామప్రదే, సర్వదుఃఖవిమోచని, సర్వమృత్యుప్రశమని, సర్వవిఘ్ననివారిణి, సర్వాంగసుందరి,

సర్వసౌభాగ్యదాయిని, సర్వార్థ సాధక చక్రస్వామిని, కుళోత్తీర్ణయోగిని,

6. సర్వజ్ఞే సర్వశక్తే సర్వైశ్వర్యప్రదాయిని సర్వజ్ఞానమయి సర్వవ్యాధివినాశిని, సర్వాధారస్వరూపే, సర్వపాపహరే, సర్వానందమయి, సర్వరక్షాస్వరూపిణి, సర్వేప్సితఫలప్రదే, సర్వరక్షాకరచక్ర స్వామిని, నిగర్భయోగిని,

7. వశిని, కామేశ్వరి, మోదిని, విమలే, అరుణి, జయిని, సర్వేశ్వరి, కౌళిని, సర్వరోగహరచక్రస్వామిని, రహస్యయోగిని,

8. బాణిని, చాపిని, పాశిని, అంకుశిని, మహాకామేశ్వరి, మహావజ్రేశ్వరి, మహాభగమాలిని, సర్వసిద్ధిప్రదచక్రస్వామిని, అతిరహస్యయోగిని,

9. శ్రీ శ్రీ మహాభట్టారికే, సర్వానందమయ చక్రస్వామిని పరాపర రహస్యయోగిని,

10. త్రిపురే, త్రిపురేశి, త్రిపురసుందరి, త్రిపురవాసిని త్రిపురాశ్రీః త్రిపురమాలిని, త్రిపురాసిద్ధే, త్రిపురాంబ, మహాత్రిపురసుందరి,

మహామహేశ్వరి, మహామహారాజ్ఞి, మహామహాశక్తే, మహామహా గుప్తే, మహామహాజ్ఞప్తే, మహామహానందే, మహామహాస్కంధే, మహామహాశయే మహామహా శ్రీచక్రనగర సామ్రాజ్ఞి! నమస్తే నమస్తే నమస్తే నమః

నవావరణల గురించి తెలుసుకునేందుకు ముందుగా ఈ క్రింది విషయాలు గ్రహించాలి.

1. ఆవరణ సంఖ్య
2. చక్రాకారము
3. చక్రము పేరు
4. ప్రకృతి
5. తత్త్వము
6. పూజాక్రమము
7. దేవత పేరు
8. యోగిని పేరు
9. చక్రేశ్వరి
10. ముద్ర
11. ముద్రా బీజము
12. స్థాయీ బావము
13. ప్రధాన రసము.

ఇది బిందువు. సర్వానందమయ చక్రం. బింద్వాభిన్నపరబ్రహ్మాత్మకబిందుచక్రే

పంచబ్రహ్మాత్మకమైనది ఈ బిందు స్వరూపము. ఇది పరబ్రహ్మ స్వరూపము. ఈ వరణలో శివశక్తులు రాజరాజేశ్వరీ, రాజరాజేశ్వరుని రూపంలో ఉంటారు. అన్ని భావాలతోనూ కూడిన, నవరస భరితమైనది ఈ చక్రం. ఇక్కడ ఉండే యోగిని పేరు పరాపర రహస్యయోగిని. ఆవరణ అధిదేవత మహాత్రిపురసుందరి. సర్వయోని ముద్ర. ఇక్కడ ప్రధానమైనది శాంతరసము.

ఈ గ్రంథంలో శ్రీవిద్య బ్రహ్మవిద్యగా వివరించటం జరిగింది. శ్రీచక్రము, పిండాండము,

బ్రహ్మాండముల ధర్మాలన్నీ ఒక్కటే. పరమాత్మ పంచభూతాలు, తన్మాత్రలతో జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు ఏర్పరచాడు. ఈ రకంగా నవరంధ్రమయమైన దేహము ఉత్పన్నమైన తరువాత తాను బ్రహ్మరంధ్రంగుండా దానిలోకి ఆత్మ రూపంలో ప్రవేశించి, సహస్ర కమలంలో ఉన్న బిందు మండలంలో నివాసముంటున్నాడు. అతనికే సాక్షి, ఆత్మ ధ్రువకళ, షోడశీకళ అని పేర్లు. ఇదే మహానిత్యాకళ. దీనివలననే పదిహేను కళలు పుట్టి మళ్ళీ అందులోనే కలసిపోతున్నాయి. ఈ బిందు మండలానికే ఆత్మ అని పేరు. ఈ స్థానానికి మనోన్మనీ స్థానమని పేరు. ఇక్కడ దేశ, కాల వస్తు, భేదములు లేవు. ఇది కోట్లకొలది సూర్యుల కాంతులతో, చంద్రుల చల్లదనముతో, విద్యుల్లతలాగా ప్రకాశిస్తుంది. అన్ని రకాల ఆనందాలు ఇక్కడ కలుగుతాయి కాబట్టి దీన్ని సర్వానందమయ చక్రం అంటారు.

---

## ద్వితీయావరణము

### (సర్వసిద్ధిప్రద చక్రము)

౩౯. తన్మిథునం గుణభేదాదాస్తే బిందు త్రయాత్మకే త్ర్యస్రే
కామేశీ మిత్రేశ ప్రముఖద్వంద్వత్రయాత్మనా వితతమ్॥

గతంలో చెప్పిన కామేశ్వరీ కామేశ్వర ద్వంద్వము గుణత్రయము చేత త్రికోణంలోని మూడు బిందువులందు కూడా ద్వంద్వముగా వ్యాప్తి చెందినది.

శ్రీచక్రంలోని ద్వితీయావరణ త్రికోణము. దీనినే సర్వరోగహర చక్రము అంటారు. త్రికోణంలోని మూడు కోణాలలోను మూడు, మధ్యన ఒక బిందువు వెరసి నాలుగు బిందువులుంటాయి. మధ్యబిందువే 'సంవిద్బిందువు. దానిలో సర్వానందమయ మయిన ఓడ్యాణపీఠమందు కామేశ్వరీ కామేశ్వరులున్నారని చెప్పటం జరిగింది. వారు అనుత్తరానందం కోసం అంటే సృష్టి ఏవిధంగా జరిగిందో చూడాలనే ఉద్దేశ్యంతో సత్వరజస్తమోగుణ భేదాలతో మూడు ద్వంద్వములుగా ప్రకాశిస్తున్నారు.

1. త్రికోణంలోని ఉత్తర కోణంలో ఉన్న బిందువు జాలంధర పీఠము. దీనిలో శక్తి బీజాధిపతులైన ఊర్ధ్వదేవనాథ కామేశ్వర్యంబా, ఉంటారు.

2. దక్షిణకోణము పూర్ణగిరిపీఠము. దీనిలో కామరాజ బీజాధిపతులైన వజ్రేశ్వర్యంబా, షష్ఠీశ దేవనాథద్వంద్వము ఉంటారు.

3. అగ్రకోణము కామగిరిపీఠము. దీనిలో వాగ్భవ బీజాధి పతులైన భగమాలిన్యంబా మిత్రేశదేవనాథులు ఉంటారు.

వీరే వరుసగా ఉమామహేశ్వరులు, లక్ష్మీనారాయణులు, వాణీహిరణ్యగర్భులు.

దీనినే సర్వసిద్ధి ప్రదాచక్రము అంటారు. ఇదినాద ప్రకృతికము. ఇక్కడ కామేశ్వరీ వజ్రేశ్వరీ, భగమాలినీ దేవతలు ఆయుధ బీజసంయుతులై ఉంటారు. చక్రేశ్వరి త్రిపురాంబా, యోగిని పేరు త్రిరహస్య యోగినీ.

పూజాక్రమము ప్రాదక్షిణ్యేన--------

ఓం ఐం హ్రీం శ్రీం యం రం లం వం సం ద్రాం ద్రీం క్లీం బ్లూం సః సర్వ జంభనేభ్యః కామేశ్వరీ కామేశ్వర బాణేభ్యోనమః । బాణశక్తి శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః పూజానంతరము యోనిముద్రాం ప్రణమేతు.

---

# తృతీయావరణము.
# సర్వరోగహర చక్రము

40. వసుకోణనివాసిన్యో యాస్తా స్సంధ్యారుణావశిన్యాద్యాః
పుర్యష్టకమే వేదం చక్రతనో స్సంవిదాత్మనో దేవ్యాః

ఈ చక్రంలో సంధ్యాకాలపు కాంతులతో వశిన్యాది దేవతలున్నారు. సంవిద్రూపమైన దేవత ఈ వసుకోణమందున్నది.

తృతీయావరణము వసుకోణము. సర్వరోగహరచక్రము. కకార ప్రకృతికము. ఇక్కడ ఉండే యోగిని పేరు రహస్యయోగిని. చక్రేశ్వరి త్రిపురాసిద్ధాంబా. ఈ చక్రంలో ప్రధాన మైనది హాస్యరసము. పరాత్పరికి ఈ చక్రంలోని ఎనిమిది కోణాలు ఎనిమిది పట్టణాలుగా ఉన్నాయి. ఎనిమిది కోణాలలోను వాగ్దేవతలుంటారు. అష్టవసువులు వాగ్దేవతల వివరాలు దిగువ ఇవ్వబడినాయి.

| అష్టవసువులు | వాగ్దేవతలు |
|---|---|
| 1. ఆపుడు | వశిని |
| 2. ధ్రువుడు | కామేశ్వరి |
| 3. సోముడు | మోదిని |
| 4. ధరుడు | విమల |
| 5. అనిలుడు | అరుణ |
| 6. అనలుడు | జయిని |
| 7. ప్రత్యూషుడు | సర్వేశ్వరి |
| 8. ప్రభాసుడు | కౌళిని |

**చితిశ్చిత్తం చ చైతన్యం చేతనాద్వయ మేవ చ**
**జీవః కలా శరీరం చ సూక్ష్మ పుర్యష్టకం భవేత్॥**

పరదేవతయొక్క మనస్సు, బుద్ధి, అహంకారము, పంచభూతములు, మొత్తం ఎనిమిది ఈ అష్టకోణ రూపంలో ఉన్నాయి.

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం శ్రీ సౌః సర్వరోగహర చక్రాయనమః. ఇది పుష్పాంజలిం దద్యాతు.

కకారపకృతిక, అష్టమూర్త్యాత్మక, కామేశ్వరస్వరూపే, పద్మరాగరుచిరే, అష్టారే, దేవ్యగ్రకోణ మారభ్య వామావర్తేన---

ఓం ఐం హ్రీం శ్రీం. అం ఆం ఇం ఈం --- అంఅః బ్లేం వశనీ వాగ్దేవతా శ్రీపాదుకాం పూః జయామి తర్పయామినమః కం ఖం -..... ఙం క్లీం - కామేశ్వరీ వాగ్దేవతా శ్రీపాదుకాం పూజయామి తర్పయామినమః

పూజానంతరము యోనిముద్ర ప్రదర్శించాలి.

## చతుర్థావరణము
## సర్వరక్షాకర చక్రము

41\. తద్విషయ వృత్తయస్తా స్సర్వజ్ఞాది స్వరూప మాపన్నాః
అంతర్దశారనిలయా లసంతి శరదిందుసుందరాకారాః

ఆ పరాశక్తియొక్క శబ్దస్పర్శాది విషయవృత్తులూ, సర్వజ్ఞాది పదిశక్తులుగా రూపొంది శరత్కాల చంద్రునివలె అంతర్దశారమందు ప్రకాశించుచున్నాయి.

చతుర్థావరణము, రేఫా ప్రకృతికము. వైశ్యా నరతత్త్వము, సర్వరక్షాకర చక్రము, అంతర్దశారము పూజ వామావర్తము. ఇక్కడ ఉండే దేవతలు

1. సర్వజ్ఞాదేవీ
2. సర్వశక్తీ దేవీ
3. సర్వైశ్వర్య ప్రదాయినీ
4. సర్వజ్ఞానమయీ
5. సర్వవ్యాధినివారిణీ
6. సర్వాధార స్వరూపా
7. సర్వపాపహరా
8. సర్వానందమయీ
9. సర్వరక్షాస్వరూపిణీ
10. సర్వేప్సితఫలప్రదా

ఇక్కడ ఉండే యోగిని పేరు నిగర్భయోగిని, చక్రేశ్వరి త్రిపురమాలినీ.

ఓం ఐం హ్రీం శ్రీం మం సర్వజ్ఞాదేవీ శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః

ఓం ఐం హ్రీం శ్రీం యం సర్వశక్తిదేవీ శ్రీపాదుకాం పూజయామి తర్పయామినమః

పూజానంతరము యోనిముద్రను ప్రదర్శించాలి.

# పంచమావరణము
# సర్వార్థ సాధక చక్రము

42. తద్బాహ్యపంక్తికోణే యోగిన్య స్సర్వసిద్ధిదాః పూర్వాః
దేవీ ధీకర్మేంద్రియ విషయమయా విశదవేషభూషాఢ్యాః

సర్వసిద్ధిప్రదా మొదలయిన పదిమంది యోగినులు పరదేవతయొక్క జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ స్వరూపములు కలవై బహిర్దశారమందు ప్రకాశించుచున్నారు. ారు

పంచమావరణ బహిర్దశారము. సర్వార్థసాధక చక్రము. ఏ క ప్రకృతికము. దశావతారాత్మకము ఇక్కడ ఉండే యోగిని పేరు కులోత్తీర్ణయోగిని. చక్రనాయిక త్రిపురాశ్రీ, పూజ ప్రదక్షణము. ఇక్కడి దేవతలు వరుసగా

| | |
|---|---|
| 1. సర్వసిద్ధిప్రదా | 6. సర్వదుఃఖ విమోచనీ |
| 2. సర్వసంత్ప్రదా | 7. సర్వమృత్యు ప్రశమనీ |
| 3. సర్వప్రియంకరీ | 8. సర్వవిఘ్న నివారిణీ |
| 4. సర్వమంగళ కారిణీ | 9. సర్వాంగ సుందరీ |
| 5. సర్వ కామప్రదా | 10 సర్వ సౌభాగ్యదాయినీ |

ఇక్కడ ప్రధాన రసము భీభత్సము. కర్త

ఓం ఐం హ్రీం శ్రీం ణం సర్వ సిద్ధి ప్రదా దేవీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః

ఓం ఐం హ్రీం శ్రీం తం సర్వసంపత్ప్రదా దేవీ శ్రీ పాదుకాం పూజయామి యామినమః

పూజానంతరము యోనిముద్ర ప్రదర్శించాలి.

---

# షష్ఠమావరణము
# సర్వసౌభాగ్యదాయిక చక్రము

43 . భువనారచక్రభవనా దేవీ మనుకరణ వివరణస్ఫురణాః
సంధ్యాసవర్ణ వసనాస్సంచింత్యా స్సంప్రదాయ యోగిన్య బ

పరదేవతయొక్క జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనబడు అంతః కరణ చతుష్టయము మొత్తం పద్నాలుగు యో నీ రూపములు కలవై ఎర్రని కాంతులతో ప్రకాశించుచున్నవి.

షష్ఠమావరణము చతుర్దశారము. సర్వసౌభాగ్యదాయక చక్రము. చతుర్దశ భువనాత్మక

మహామాయా స్వరూపే, చతుర్దశారే దేవ్యగ్రకోణమారభ్య, వామావర్తేన...... ఇక్కడ ఉండే దేవతలు వరుసగా

| | |
|---|---|
| 1. సర్వ సంక్షోభిణీ | 8. సర్వవశంకరీ |
| 2. సర్వవిద్రావిణీ | 9. సర్వరంజని |
| 3. సర్వాకర్షిణీ | 10. సర్వోన్మాదినీ |
| 4. సర్వాహ్లాదినీ | 11. సర్వార్థసాధినీ |
| 5. సర్వ సమ్మోహినీ | 12. సర్వసంపత్తి పూరిణి |
| 6. సర్వ స్తంభినీ | 13. సర్వమంత్రమయీ |
| 7. సర్వ జృంభిణీ | 14. సర్వద్వంద్వక్షయంకరీ |

ఈ దేవతలు బిందు సంయుతములైౖ క నుండి ధ వరకు ఉంటారు. ఇక్కడ యోగిని పేరు సంప్రదాయ యోగిని. ఆవరణ దేవత త్రిపురవాసిని.

ఓం ఐం హ్రీం శ్రీం కం సర్వ సంక్షోభిణీ శక్తి శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః

ఓం ఐం హ్రీం శ్రీం ఖం సర్వ విద్రావిణీ శక్తి శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః

అభీష్టసిద్ధిమే దేహి శరణాగతవత్సలే, భక్త్యాసమర్పయేతుభ్యం షష్ఠావరణార్చనమ్.

## సప్తమావరణము
## సర్వసంక్షోభిణీ చక్రము

44. అవ్యక్త మహదహంకృతి తన్మాత్రా స్త్రీకృశాంగనాకారాః
ద్విరదచ్ఛదనసరోజే జయంతి గుప్తతరయోగిన్యః

అవ్యక్త మహ తత్త్వఅహంకారములు, తన్మాత్ర పంచకము స్త్రీరూపము పొంది అష్టదళమందు గుప్తతరయోగినులుగా ప్రకాసిస్తున్నాయి. స్తమావరణము అష్టద పద్మము. సప్త సంక్షోభిణీ చక్రము. హకార ప్రకృతికము అష్టమూర్త్యాత్మకము పూజ సవ్యము. అష్టమూర్తులు అంటే

| | |
|---|---|
| 1. భవుడు | 5. రుద్రుడు |
| 2. శర్వుడు | 6. ఉగ్రుడు |
| 3. ఈశానుడు | 7. భీముడు |
| 4. పశుపతి | 8. మహాదేవుడు |

ఈ ఆవరణలో ఉండే దేవతలు వరుసగా

| | |
|---|---|
| 1. అనంగకుసుమా | 5. అనంగ రేఖ |
| 2. అనంగమేఖలా | 6. అనంగ వేగినీ |
| 3. అనంగ మదనా | 7. అనంగాంకుశ |
| 4. అనంగ మదనాతురా | 8. అనంగ మాలిని. |

వీరు కవర్గనుండి క్షవర్గ వరకు బీజసంయుతులై ఉంటారు. ఇక్కడ ప్రధాన రసము కరుణ రసము. ఆవరణకు అధి దేవత త్రిపురసుందరి. యోగిని పేరు గుప్తతరయోగిని.

ఇక్కడ దేవతలు జపాకుసుమచ్ఛాయలో ఉంటారు.

---

# అష్టమావరణము
# సర్వాశాపరిపూరక చక్రము

**45. భూతానీంద్రియదశకం మనశ్చ దేవ్యా వికారషోడశకం**
**కామాకర్షిణ్యాదిస్వరూపత షోడశార మత్రోక్తే॥**

పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు. అకారాది స్వరములు పదహారు కలిసి కామాకర్షిణి మొదలైన దేవతలుగా షోడశదళ పద్మంలో ఉన్నారు.

అష్టమావరణ షోడశదళము. సర్వాశా పరిపూరక చక్రము. సకార ప్రకృతికము, చంద్రకళా స్వరూపము.

సర్వాశాపరిపూరక చక్రాయనమః శ్వేతవర్ణే సకారప్రకృతిక షోడశకళాత్మకే, చంద్రస్వరూపే, స్రవదమృతరూపే, షోడశదళకమలే దేవ్యగ్ర కోణమారభ్య వామావర్తేన.......

ఈ ఆవరణలో ఉండే దేవతలు

| | |
|---|---|
| 1. కామాకర్షిణీ నిత్యాకళా | 9. చిత్తాకర్షిణీ నిత్యాకళా |
| 2. బుధ్యాకర్షిణీ నిత్యాకళా | 10. ధైర్యాకర్షిణీ నిత్యాకళా |
| 3. అహంకారాకర్షిణీ నిత్యాకళా | 11. స్మృత్యాకర్షిణీ నిత్యాకళా |
| 4. శబ్దాకర్షిణీ నిత్యాకళా | 12. నామాకర్షిణీ నిత్యాకళా |
| 5. స్పర్శాకర్షిణీ నిత్యాకళా | 13. బీజాకర్షిణీ నిత్యాకళా |
| 6. రూపాకర్షిణీ నిత్యాకళా | 14. ఆత్మాకర్షిణీ నిత్యాకళా |
| 7. రసాకర్షిణీ నిత్యాకళా | 15. అమృతాకర్షిణీ నిత్యాకళా |
| 8. గంధాకర్షిణీ నిత్యాకళా | 16. శరీరాకర్షిణీ నిత్యాకళా |

వీరందరూ అకారాది స్వరములతో బీజసంయుతములై ఉంటారు. ఈ చక్రానికి

అధిదేవత త్రిపురసుందరి. యోగిని పేరు గుప్తయోగిని ప్రధాన రసము వీరరసము.

1. పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు కలిపి పదహారు.

2. అకారాది స్వరములు పదహారు.

3. షోడశనిత్యలు పదహారు.

ఈరకంగా ఈ మూడుతత్వాలు కలిసి ఈ దళమందు దేవతలుగా ఉన్నారు.

---

# నవమావరణము
# త్రైలోక్య మోహన చక్రము

## తృతీయ భూపురము

46 ముద్రాస్త్రిఖండయా సహ సంవిన్మయ్యస్సముచ్ఛ్రితాస్సర్వాః
ఆదిమహీగృహవాసా భాసా బాలార్కకాంతిభిస్సదృశాః॥

47. ఆధారనవక మస్యా నవచక్ర త్వేన పరిణతం యేన
నవనాథశక్తయో ऽపిచముద్రాకారేణ పరిణతం తేన॥

త్రిఖండముద్రతో కలిపి పది ముద్రలు అకార పరిణామము పొంది బాలభానుని కాంతులతో సమానంగా ప్రకాశిస్తూ ప్రథమ భూపురంలో ఉన్నాయి. అధారాది సహస్రార పర్యంతము ఉన్న చక్రాలు ఏకారణంచేత నవచక్రాకారము పొందినాయో, ఆకారణం చేత వామాది శక్తులు కూడా ముద్రాకారము పొందినాయి.

పరదేవతయొక్క షట్చక్రాలే శ్రీచక్రంలోని తొమ్మిది చక్రాలుగా మారినాయి. అందుచేతనే వామాది శక్తులు ముద్రలుగా మారినాయి. త్రిఖండాముద్ర శ్రీచక్రముయొక్క సమిష్టి రూపము. ఈత్రిఖండముద్రకు దేవత పరాశక్తి. ఇందులో ఉండే దేవతలు.

| | |
|---|---|
| 1. సర్వ సంక్షోభిణి | 5. సర్వోన్మాదినీ |
| 2. సర్వ విద్రావిణి | 6. సర్వ మహాంకుశ |
| 3. సర్వాకర్షిణి | 7. సర్వఖేచరీ |
| 4. సర్వవశంకరి | 8 సర్వత్రిఖండ |

ఈ భూపురానికి అధిదేవత త్రిపురా. యోగిని పేరు ప్రకటయోగిని.

---

# నవమావరణము
# త్రైలోక్యమోహన చక్రము
## ద్వితీయ భూపురము

48. అస్యాస్త్వగాదిసప్తక మాకారశ్చైవ మష్టకం స్పష్టం
బ్రాహ్మ్యాదిమాతృరూపం మధ్యమభూబింబ మేతదధ్యాస్తే

పరమేశ్వరి యొక్క త్వగాది సప్తధాతువులు, సమిష్టి పూర్ణ స్వరూపము బ్రాహ్మీ మొదలయిన మాతృకా స్వరూపమై మధ్య భూపురమందున్నవి.

పరాత్పరియొక్క సప్త ధాతువులు, శరీరము మొత్తం ఎనిమిది, మాతృకల రూపంలో భూపురంలో ఉన్నారు. త్వగ్సృగ్ మాంస మేధో అస్థి ధాతవశక్తి మూలకా:' అని ధాతువులు మొత్తం తొమ్మిది. వీటిలో ప్రాణము, జీవము తీసివెయ్యాలి. అప్పుడు ధాతువులు ఏడు అవుతాయి. శ్రీచక్రంలో తత్త్వాలను వివరించేప్పుడు ఈ విషయం చెప్పటం జరిగింది.

తత్త్వములు :

పృథివ్యాపస్తేజః పవనగగనే తత్రప్రకృతయః
స్థితా స్తన్మాత్రాస్తా విషయదశకం మానసమితి ।
తతో మాయావిద్యా తదనుచ మహేశః శివ ఇతః
పరం తత్త్వాతీతం మిలిత వపురిందోః పరకళా ॥ 5

ఏవం పిండాండ ముత్పన్నం తద్వద్బ్రహ్మాండ ముద్భవౌ।
పంచ భూతాని శాక్తాని మాయాదీని శివస్యతు॥
మాయాచ శుద్ధవిద్యా చ మహేశ్వరసదాశివౌ।
పంచవింశతి తత్త్వాని తత్రైవాంతర్భవంతి తే॥

పంచభూతాలు శక్తిసంబంధాలు మాయాదులు శివసంబంధాలు. ఇవన్ని కలిసి 25 తత్త్వాలయి నవయోనులందు అంతర్భావం పొందుతున్నాయి. అయితే ఈ తత్త్వాలు 25 కాదు 51 అని కొందరంటారు.

పంచభూతాని తన్మాత్ర పంచకం చేంద్రియాణిచ।
జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణిచ॥
త్వగాది ధాతవ సప్త పంచ ప్రాణాది వాయవః ।
మనశ్చాహంకృతిః ఖ్యాతి ర్గుణాః ప్రకృతి పూరుషౌ॥

రాగో విద్యా కలాచైవ నియతిః కాల ఏవచ ।

మాయాచ శుద్ధవిద్యాచ మహేశ్వర సదాశివౌ ॥

శక్తిశ్చ శివతత్త్వంచ తత్త్వాని క్రమశో విదుః ।

51 తత్త్వాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

| | | |
|---|---|---|
| పంచభూతాలు | - | 5 |
| తన్మాత్రలు | - | 5 |
| జ్ఞానేంద్రియాలు | - | 5 |
| కర్మేంద్రియాలు | - | 5 |
| త్వగాది ధాతువులు | - | 7 |
| (చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముకలు, మజ్జ, శుక్లము) | | |
| ప్రాణములు | - | 5 |
| మనస్సు | - | 1 |
| అహంకారము | - | 1 |
| ఖ్యాతి | - | 1 |
| గుణములు | - | 3 |
| ప్రకృతి (మూలప్రకృతి) | - | 1 |
| పురుషుడు(జీవుడు) | - | 1 |
| రాగము (ఇచ్ఛ) | - | 1 |
| విద్య | - | 1 |
| కళలు | - | 1 |
| నియతి(నియామక శక్తి ) | - | 1 |
| కాలము (సంహరణ కాలము) | - | 1 |
| మాయ | - | 1 |
| శుద్ధవిద్య(మోక్షజ్ఞానము) | - | 1 |
| మహేశ్వరుడు (రజోగుణుడైనసృష్టికర్త) | - | 1 |
| సదాశివుడు (సృష్టికర్త) | - | 1 |
| శక్తి(సృష్టిస్థితి లయకారిణి) | - | 1 |
| శివతత్త్వము (శుద్ధ, బుద్ధ ముక్తి స్వరూపము) | - | 1 |
| | | --- |
| మొత్తం తత్త్వాలు | - | 51 |

కాశ్మీర దేశ శాక్తేయుల ప్రకారం తత్త్వాలు 36. అవి

| | |
|---|---|
| పంచభూతాలు | - 5 |
| తన్మాత్రలు | - 5 |
| జ్ఞానేంద్రియాలు | - 5 |
| కర్మేంద్రియాలు | - 5 |
| త్వగాది ధాతువులు | - 7 |
| ప్రాక్, పశ్చిమ దక్షిణ ఉత్తర వాయువులు | - 4 |
| మనస్సు | - 1 |
| మాయ, శుద్ధవిద్య, మహేశ్వరదు, సదాశివుదు | - 4 |
| మొత్తం తత్త్వాలు | - 36 |

కాని గౌడపాదులవారు వీటిని కాదన్నారు. ఒకవేళ తత్త్వాలు పైన చెప్పినట్లుగానే ఉన్నప్పటికీ కొన్ని తత్త్వాలు కొన్నిటియందు కలిసి ఉంటాయి.
అవి ముందుగా 51 వ తత్త్వాలలో

| | | |
|---|---|---|
| 1. | త్వగాది ధాతువులు | - పంచభూతములందు |
| 2. | పంచప్రాణములు | - వాయువునందు |
| 3. | అహంకారము | - మనస్సునందు |
| 4. | ఖ్యాతి | - విద్యయందు |
| 5. | గుణములు | - ప్రకృతియందు |
| 6. | ప్రకృతి | - శక్తియందు |
| 7. | పురుషుడు | - మహేశ్వరునియందు |
| 8. | కళ | - శుద్ధవిద్యయందు |
| 9. | కాలము | - మహేశ్వరునియందు |
| 10. | నియతి | - శక్తియందు |
| 11. | శక్తి | - శుద్ధవిద్యయందు |
| 12. | శివతత్త్వము | - సదాశివ తత్త్వమునందు |

ఈ విధంగానే కాశ్మీర శాక్తేయులు చెప్పిన 36 తత్త్వాలలోను కొన్ని తత్త్వాలకు అంతర్భావం ఉంది.

1. త్వగాదిధాతువులు - పంచభూతాలయందు

2. ప్రాక్ పశ్చిమదక్షిణ ఉత్తర వాయువులు - వాయువునందు

ఈ రకంగా తత్త్వాలు కలసిపోగా మిగిలేవి 25 మాత్రమే అవి

| | | |
|---|---|---|
| 1. పంచభూతాలు | - | 5 |
| 2. తన్మాత్రలు | - | 5 |
| 3. జ్ఞానేంద్రియాలు | - | 5 |
| 4. కర్మేంద్రియాలు | - | 5 |
| 5. మనస్సు | - | 1 |
| 6. మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు | - | 4 |
| మొత్తం తత్త్వాలు | | 25 |

శబ్ద స్పర్శ రూప రస గంధాలు 5 మనస్సుతో కలిసి 6 ఇవి షట్చక్రాలలో ఉన్నాయి.

షట్చక్రాలకు పైన మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు ఉన్నారు. హిరణ్యగర్భుడనే సదాశివుడితో కలిసిన శుద్ధవిద్యయే సాదాఖ్యకళ. 25 వ తత్త్వముతో కలిసిన భగవతి 26వ తత్త్వము అవుతోంది. దీనినే పరా, చిద్రూప, కుండలిని అంటారు.

ఈ విషయాన్ని సౌందర్యలహరిలోని మహీంమూలాధారే అనే 9 వ శ్లోకంలో శంకర భగవత్పాదులు వివరించారు. ఈ 26 తత్త్వాలు, దేవికి సూక్ష్మరూపమైన శ్రీచక్రంలో నిక్షిప్తం చేయబడిఉన్నాయి.

త్వగాది సప్త ధాతువులు అంటే

1. చర్మము
2. రక్తము
3. మాంసము
4. మెదడు
5. ఎముకలు
6. మజ్జ
7. శుక్లము.

ఈ ఏడు దాతువులు, శరీరము మొత్తం ఎనిమిది. వీరే ద్వితీయ భూపురంలోని బ్రాహ్మి. మొదలయిన మాతృకలు. వారు వరుసగా

1. బ్రాహ్మి 5. వారాహి
2. మాహేశ్వరీ 6. మాహేంద్రీ
3. కౌమారీ 7. చాముండీ
4. వైష్ణవీ 8. మహాలక్ష్మి

వీరందరూ దీర్ఘములైన స్వరములతో బిందు సంయుతములై ఉన్నారు.

ఓం ఐం హ్రీం శ్రీం. ఆం బ్రాహ్మి మాతృశ్రీ పాదుకాంపూజయామి తర్పయామినమః

ఓం ఐం హ్రీం శ్రీం ఈం మహేశ్వరీ మాతృశ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః

---

# నవమావరణము
# త్రైలోక్య మోహన చక్రము
## ప్రథమ భూపురము

**49. అణిమాది సిద్ధయోzస్యాః స్వీకృతకమనీయకామినీరూపాః**
**విద్యాంతర ఫలభూతా గుణభావేనాంత్యభూనికేతనగాః॥**

పరమేశ్వరి యొక్క అణిమాది సిద్ధులు శ్రీవిద్య కన్న వేరైన మంత్రాలకు, హటయోగము మొదలైన వాటికి ఫలప్రదాయకాలు. ఆ అష్టసిద్ధులు స్త్రీరూపం ధరించి భూపురమునందలి ప్రథమ రేఖను ఆశ్రయించి ఉన్నాయి.

ఓం ఐం హ్రీం శ్రీం అం ఆం సౌః త్రైలోక్యమోహనచక్రాయ నమః క్రమేణ-శుక్లపీతారుణ వర్ణరేఖాత్రయస్య లకార ప్రకృతిక పృథివ్యాత్మకస్య చతురశ్ర్య ప్రవేశ రీత్యా ప్రథమ రేఖాయా పశ్చిమాది ద్వారచతుష్టయ దక్షిణ భాగేషు వాయువ్యాది కోణేషుచ పశ్చిమ నైఋతయోః పూర్వేశాన యోనశ్చ మధ్యేక్రమేణ.

ఓం ఐం హ్రీం శ్రీం అం అణిమాసిద్ధి శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః

ఓం ఐం హ్రీం శ్రీం లంలఘిమా సిద్ధి శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః

ప్రథమ భూపురంలో ఉండే దేవతలు అష్ట సిద్ధులు

1. అణిమాసిద్ధి 5. వశిత్వ సిద్ధి
2. లఘిమా సిద్ధి 6. ప్రాకామ్యసిద్ధి
3. మహిమాసిద్ధి 7. గరిమాసిద్ధి
4. ఈశిత్వసిద్ధి 8 ప్రాప్తిసిద్ధి

వీరందరూ అంకుశము, పాశము, పద్మద్వయములను చేతులందు ధరించి ఉన్నారు. ఇక్కడ ఉండే యోగిని పేరు ప్రకట యోగిని. ఈ చక్రానికి అదిష్టాన దేవత త్రిపుర. ఇక్కడ ప్రధానమైన రసము శృంగార రసము.

శ్రీవిద్య అనేది బ్రహ్మవిద్య. పరాత్పరియొక్క సాయుజ్యమే శ్రీవిద్యోపాసనా పరుల ఏకైక లక్ష్యము. అటువంటివారు అణిమాది అష్టసిద్ధులు తుచ్ఛమైనవిగా భావిస్తారు. ఇది సకలాగమసిద్ధాంతము. కౌళాచారులు మాత్రమే ఈ సిద్ధులను సాధించటానికి ఇష్టపడతారు.

నవావరణ పూజలో భూపురము ప్రథమ ఆవరణ అని ఇదివరకే చెప్పటం జరిగింది.

దేవీ పూజా పరులను, సాధకులను మూడు రకాలుగా విభజించారు.

1. ఉత్తమాధికారులు 2. మధ్యమాధికారులు 3. అధములు.

1. ఉత్తమాధికారులు చతుర్విధైక్య, షడ్విధైక్య సంధానం చేసి పరదేవతను సహస్రార మండలంలో దర్శిస్తారు. వీరికి బాహ్యపూజ లేదు. భావనోపనిషత్తులో చెప్పినప్రకారము అంతఃపూ జ చేస్తారు. (దీని మీద వివరాలకు నాచే వ్రాయబడిన 'శ్రీవిద్యా రహస్యము' చూడండి.)

2.మధ్యమాధికారులు. వీరు చక్రసంకేత, మంత్ర సంకేత, పూజా సంకేత జ్ఞానము కోసం సుభాగమ పంచకంలో చెప్పినవిధంగా, వేదవిహితంగా శ్రీచక్రార్చన చేస్తారు.

3. అధములు కౌళాచారులు. వీరు కేవలము ప్రాపంచిక పరమైన ఐహిక సుఖాలకోసం ఆరాట పడతారు. ఏదో కొన్ని శక్తులు సాధించి అంతకంతకు ఊబిలో కూరుకు పోతుంటారు. వీరి పూజలు అవైదికము, నీతి బాహ్యము. కాబట్టి నిషేధింపబడినవి.

## శ్రీవిద్యా గురుపరంపర

**50. పరమానందానుభవః పరమగురు ర్నిర్విశేషబిన్ద్వాత్మా**

**స పునః క్రమేణ భిన్నః కామేశత్వం యయౌ విమర్శాంశాత్॥**

పరబ్రహ్మ ఉత్కృష్టమైన పూర్ణాహంభావరూప జ్ఞానంకల ప్రకాశ, విమర్శ బిందువుల సమిష్టి రూపమైన సకల గురుమండల స్వరూపుడైనాడు. ఆ పరమాత్మయే దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘములను వేరువేరుగాపొంది కామేశ్వరీ కామేశ్వర భావం పొందినాడు.

ఈ శ్లోకంలో ఓఘత్రయము నిరూపించబడుచున్నది. పూర్ణబిందు స్వరూపుడైన పరమాత్మ తనయందు ఇమిడి ఉన్న బిందు త్రయాన్ని క్రమంగా విభజించి ప్రకాశ విమర్శాంశలచే కామేశ్వరీ, కామేశ్వరులుగా మారి తరువాత ఓఘత్రయ రూపాన్ని పొందినాడు.

51. ఆసీన శ్రీపీఠే కృతయుగకాలే గురుశ్శివో విద్యామ్
తస్యై దదౌ స్వశక్త్యై కామేశ్వర్యై విమర్శరూపిణ్యై.

పరమానందమయమైన ఓడ్యాణ పీఠమందు ఉన్నట్టి ప్రకాశాత్మక రూపుడైన కామేశ్వరుడు విమర్శ రూపిణి అయిన కామేశ్వరికి శ్రీవిద్యనుపదేశించాడు.

సృష్టి ఆవిర్భావకాలములో, కృతయుగారంభాన సర్వానందమయమైన ఓడ్యాణ పీఠమనే బిందు పీఠమందున్న పరమాత్మ అయిన కామేశ్వరుడు ఊర్ధ్వానందనాధ అనే పేరుతో అనుత్తరానందంకోసం స్వాత్మరూప అయిన కామేశ్వరికి శ్రీవిద్యను ఉపదేశించాడు. ఇక్కడ కామేశ్వరీ కామేశ్వరులిద్దరూ సమానులే. ఇద్దరిలోనూ ఎవరూ ఎక్కువ కాదు. అయినప్పటికీ శ్రీవిద్యను లోకమందు వ్యాప్తిచెయ్యాలనే ఉద్దేశ్యంతో పరమాత్మ స్వయంగా తనే గురుశిష్య భావంపొంది ఈ విద్యను ఉపదేశించాడు.

52. సేయాయ మిత్రసంజ్ఞాం స్థానేశాన్ జ్యేష్ఠ మధ్య బాల ఖ్యాన్
చిత్ప్రాణవిషయభూతాన్ త్రేతాయుగాదికారణత్రిగురూన్॥

53. బీజత్రితయాధిపతీ స్సరీక్ష్య విద్యాం ప్రకాశయామాస
ఏత్రైరోఘత్రితయం సమనుగృహీతం గురుక్రమో విదితః॥

కామేశ్వరీ రూపమైన ఆ పరాశక్తి తాను మిత్రేశదేవనాధ అను పేరుతో, త్రికోణంలోని మూడు కోణాలకు అధిపతులయిన ఊర్ధ్వదేవనాధ, షష్టీశదేవనాధ, మిత్రేశదేవనాధులను త్రేతాయుగాది కారణగురువులుగా నియమించి వారికి శ్రీవిద్యనుపదేశించింది. వీరివలననే ఓఘత్రయము వచ్చినది. ఈరకంగా బ్రహ్మవిద్యా గురుపరంపర ఏర్పడినది.

పరమాత్మ స్వరూపుడైన పరమేశ్వరుడు శ్రీవిద్యను లోకమందు ప్రచారముచేయ తలచినవాడై తాను ఊర్ధ్వదేవనాధ అనే పేరు ధరించి, శ్రీవిద్యను కామేశ్వరికి ఉపదేశించి, ఆమెకు 'మిత్రేశదేవాధ' అని పేరుపెట్టాడు. ఈరకంగా ఊర్ధ్వదేవనాధ, మిత్రేశదేవనాధ అను పేర్లుకలిగిన కామేశ్వరీ కామేశ్వరులు సర్వానందమయ ఓడ్యాణ పీఠమందు పురాణ దంపతులుగా ఉన్నారు. ఇది శ్రీవిద్యకు ప్రథమ స్థానము.

ఆ తరువాత పరమేశ్వరుని అనుజ్ఞతో ఆ పరాభట్టారిక తాను షష్టీశనాధ అనే పేరుతో శ్రీవిద్యను యోనిచక్రానికి ఉత్తర కోణమైన, జాలంధర పీఠంలో ఉన్న శక్తి బీజాధిపతులైన ఉమామహేశ్వరులకు ఉపదేశించి, వారికి ఊర్ధ్వదేవనాధ, కామేశ్వర్యంబా అని పేరు పెట్టింది.

ఆ తరువాత ఊర్ధ్వదేవనాథ ద్వంద్వము యోనిచక్రం దక్షిణకోణ బిందువులోని పూర్ణగిరి పీఠంలో ఉన్న కామరాజ బీజాధి పతులైన లక్ష్మీనారాయణులకు ఈ విద్యనుపదేశించి, వారికి షష్ఠీశ దేవనాథ, వజ్రేశ్వర్యంబా అని నామకరణం చేశారు. తరువాత షష్ఠీశ దేవనాథ ద్వంద్వము యోని చక్రం అగ్రకోణంలోని కామగిరి పీఠంలో ఉన్న వాగ్భవబీజాధి పతులైన వాణీహిరణ్యగర్భులకు ఈ విద్యనుపదేశించి వారికి మిత్రేశదేవనాథ, భగమాలిన్యంబా అని పేరు పెట్టారు. ఈ మిత్రేశ దేవనాథ, ద్వంద్వము ఇంద్రాది దేవతలకు, వారు సనక సనందనాది మునులకు, వారు మానవులకు ఉపదేశించారు. ఇక్కడ

ఇంద్రాది దేవతలు -- దివ్యౌఘులు

సనకసనందనాది ఋషులు -- సిద్ధౌఘులు

విద్యారణ్యుడు, గౌడపాదుడు, శంకరుడు మొదలైన వారు --- మానవౌఘులు.

ఈ రకంగా సాధకుని యొక్క గురువు వరకు ఉపదేశ పారంపర్యంగా కాది విద్యాపరంపర ఈ లోకమునందు ప్రచారమైనది.

---

## గ్రంథోత్పత్తి

54. ఉదితః పుణ్యానందాదితి కామకలాంగనావిలాసోऽయం
పరశివభుజంగభావాకర్షణహర్షాయ కల్పితాం నిత్యం॥

పుణ్యానంద మునీంద్రునిచేత రచింపబడిన కామకళావిలాసమను ఈ గ్రంథము సర్వదా పఠింపబడుగాక.

'పుణ్యానంద' అనే పేరుకల మునీంద్రుడు కామకళావిలాసమనే ఈ గ్రంథం వ్రాశాడని చెప్పబడుతోంది. ఈ శ్లోకం వల్లనే ఈ గ్రంథం పేరు కామకలావిళాసమనీ, దీని గ్రంథకర్త పుణ్యానందముని అని తెలుస్తున్నది. ఈ గ్రంథము, నవరసములు, నవభావము (శ్రీచక్రంలోని అవరణలలో చెప్పబడ్డాయి) లతో పురాణదంపతులు, సర్వానందమయ బిందుమండల వాసులు అయిన కామేశ్వరీ, కామేశ్వరుల వలనే కలిగి లోకంలో ప్రచారమైనది. కాబట్టి పరమ శివుని ఆనందంకోసం ఈ గ్రంథము పఠింపతగినది. అంటే ఈ సృష్టి మొత్తం ఆ పరబ్రహ్మవలననే జరుగుతోంది. అలాగే ఈ గ్రంథం కూడా ఆయన యొక్క అనుగ్రహంవల్లనే వ్రాయబడింది. కాబట్టి దీన్ని పఠించిన వారికి ఆపరమేశ్వరుని అనుగ్రహం కలుగుతుంది. దీనిని సదా వినవారు స్వస్వరూప జ్ఞానంకలిగి సంపూర్ణానందము పొందుతారు.

# గ్రంథపూర్తి, మంగళము

55.చింతాతరంగతరళ స్తృష్ణాసలిలః ప్రపంచవారాశిః
యదనుగ్రహేణ తీర్ణ స్తస్మై శ్రీనాథ నావికాయ నవ ౨౫॥

సంకల్పమనే తరంగాలచేత చంచలమైనది, తృష్ణ అనే ఉదకముగల సంసారమనే సముద్రము ఎవరి అనుగ్రహముచేత దాటబడుచున్నదో, ఆ పరమేశ్వరునికి నమస్కరించుచున్నాను.

పుణ్యానందమునీంద్రులు కామకళావిలాసము అనే ఈ గ్రంథంలోని మొదటి సూత్రంలో నిరూపించిన బిందుస్వరూపుడైన పరమాత్మకు చివరి శ్లోకంలో నమస్కరిస్తున్నారు. ఈ ప్రపంచంలోని జ్ఞానులు, పుణ్యపురుషులు తరించటానికి శ్రీవిద్యాతంత్రాన్ని శ్రీచక్రరూపంలో ఒకనౌకగా తయారుచేసి దానికి తానే నావికుడుగా ఉన్నాడు, అంటే శ్రీవిద్యను లోకంలో తానే ప్రచారం చేసి, సాధకులు తరించటానికి తానే సాయపడుతున్నాడు అని అర్థము.

**1. వేదాలు:-**

ఇష్టప్రాప్తినీ, అనిష్టపరిహారాన్నీ సాధించటాన్ని అలౌకికమైన ఉపాయాన్ని చెప్పే గ్రథమే వేదము. సకల దేవతలను, ధర్మాన్నీ, పరబ్రహ్మతత్త్వాన్నీ ప్రతిపాదిస్తుంది కనుక వేదప్రామాణ్యం ప్రత్యక్ష అనుమానప్రమాణాలపరిధికి మించి ఉన్నది.

మానవుడు పరిపూర్ణుడుకాదు. అతను చెప్పిన సూక్తులు పరమార్థమని, భ్రాంతి రహితమని, ఒప్పుకోలేము. అందుచేత అతీంద్రియసత్యాలకు సంబంధించినంతవరకు స్వతఃసిద్ధమూ, స్వతః ప్రమాణము, నిత్యసిద్ధమూ, బ్రహ్మవాక్కూ అయిన వేదాన్ని మాత్రమే నిర్దుష్టమైనక అంత్య ప్రమాణంగా స్వీకరించగలం. భారతీయ సంస్కృతి ధార్మికంగానూ, ఆధ్యా ంగానూ ఇంతకాలంగా వికసిస్తూ ఉండటానికి వేదమే కారణము.

**వేదాలు అపౌరుషేయాలు. వేదాలలో చెప్పిన అలౌకిక, అధ్యాత్మిక సిద్ధాంతాలు శాశ్వతా మ పురుషసూక్తంలో దివ్యప్రజాపతులు, ఋషులు కలిసి ప బ్ర పురుషుడే హవిస్సుగా చేసిన నవ యజ్ఞం నుండి వేదాలు ఉద్భవించాయి. పరమాత్మ హ్మను సృజించి అతనికి వేదాలు అనుగ్రహించాడు.**

**వేదం అనే మాటకు సాధారణ అర్థం జ్ఞానం వేదంలో పరా, అపరా అనే రెండు రకా విద్యః ద్య ము. వేదంలో రెండు కాండలున వి. 1. జ్ఞాన ండ 2. కర్మకాండ. జ్ఞానకాండ పరావి ు, కర్మకక్రియలు, నియమాలు, విధులు ఆచారాలు వివరిం జ్ఞానకాండ ఆత్మ పరమాత్మ ప్రపంచాది స్వరూపాలను వివరిస్తుంది. మొత్తంమీద నువ్వులలో నూనెలాగా వేదమ టా వేదాంతం సుప్రతిష్ఠితమై ఉన్నది.**

వేదానికి నిగమము, శ్రుతి, ఆమ్నాయము అనికూడా పేర్లున్నాయి. వాటి అర్థము

1. నిగమము - అనాదిగా వస్తున్న నిర్ధారితమైన మూలగ్రంథం
2. శ్రుతి - గురువునుంచి శిష్యుడు వినే దివ్యవాణి.
3. ఆమ్నాయము - ఆవృత్తి లేదా మననం ద్వారా నేర్చుకోబడే విద్య.

మొదట వేదం అంతా ఒకటిగానే ఉండేది. కాని ద్వాపరయుగంలో కృష్ణద్వైపాయనుడు వేదాన్ని నాలుగు భాగాలుగా విభజించాడు. అవే 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణ వేదము.

స్తుత్యర్థకమైన మంత్రానికి 'ఋక్' అని పేరు. యజ్ఞపరాలైన మంత్రాలకు 'యజస్సు'లని పేరు. నియమపూర్వకంగా గానం చేసే మంత్రాలకు 'సామద' ములని పేరు.

**1. ఋగ్వేదం :-** వేదాలలో ముఖ్యమైనది ఋగ్వేదం. అన్ని వేదాలలోను ఎక్కువ భాగం దీనికి పునరుక్తిగానో, అనుసరణగానో ఉంటాయి. ఇందు 10 28 దేవతాస్తుతులున్నాయి. వీటిలో అతిపెద్దది 52 శ్లోకాలు గలది. ఈ స్తోత్రాలు పదిమండలాలుగా ఉన్నాయి. తత్త్వ, అలౌకికవిషయాలను వివరించటంవలన 10వ మండలం విశేష ఆసక్తికరమైనది. ఐతరేయ, కౌశీతకీ, పైకగి, సాంఖ్యాయన బ్రాహ్మణాలు ఋగ్వేదానికి చెందినవి. రైతరేయ, కౌశీతకీ అరణ్యకాలు అబ్రాహ్మణాలకు పరిశిష్టాలుగాను, ఐతరేయ, కౌశీతకీ ఉపనిషత్తులు ఈ అరణ్యకాలకు అంతిమాంశాలుగానూ స్వీకరింపబడుతున్నాయి.

**2. యజుర్వేదం:-** ఇది రెండు భాగాలుగా ఉంది

1. కృష్ణ యజుర్వేదము 2. శుక్ల యజుర్వేదము

**కృష్ణ యజుర్వేదము :-** ఇది చాలా వరకు గద్యరూపంలో ఉంటుంది. దీనిలో క్రియావిధులు, వివరణ ఉంటాయి. తైత్తరీయ, భాల్లవ, శాత్యాయన, మైత్రాయణ, కరు, బ్రాహ్మణాలు ఈ వేదంలోనివి. వీటిలో తైత్తిరీయ బ్రాహ్మణము ప్రసిద్ధమైనది.

**శుక్లయజుర్వేదం:-** ఇది 406 అధ్యాయాలుగల గ్రంథం. యజ్ఞాలకు సంబంధించిన విషయాలు ఇందులో క్రమబద్ధంగా అమర్చబడ్డాయి. ఈవేదం ముఖ్యంగా మాధ్యందిన, కాణ్వసంప్రదాయాలలో నిలిచి ఉన్నది. ప్రఖ్యాతమైన శతపథబ్రాహ్మణము ఈవేదానికి సంబంధించినదే. అత్యంతముఖ్యమైన ఆరణ్యకము, ఉపనిషత్తుఅయిన బృహదారణ్యకముతో శతపథబ్రాహ్మణము పూర్తవుతుంది.

**3. సామవేదం :-** దీనిలో 75 మంత్రాలు తప్ప మిగిలినవన్నీ ఋగ్వేదంలోని 8,9 మండలాలనుండి సాక్షాత్తూ గ్రహించబడ్డాయి. ద్వా కవిధులను వివరించే సామవిధాన, మంత్ర, ఆర్షేయ, వంశ, దైవతాధ్యాయ, తలవకార, తాండ్య, సహితోపనిషత్ నబ దే 8 బ్రాహ్మణాలు ఈ వేదానివే. ఛాందోగ్య, కేనోపనిషత్తులు ఈవేదానికి సంబంధి వే. నికి

అరణ్యకాలు లెవు.

**4. అధర్వణ వేదం :-** ఈ వేదంలో ముఖ్యంగా ప్రాపంచిక అభ్యుదయాన్ని తేగల మంత్రాలు, తంత్రాలు ఉన్నాయి. దీనికి ఏ అరణ్యకమూ లేదు. గోపథబ్రాహ్మణము ముండక, మాండూక్య, ప్రశ్నోపనిషత్తులు ఈవేదానికి సంబంధించినవే.

కృష్ణద్వైపాయనుడు వేదవిభజనచేసిన తరువాత అతని నలుగురుశిష్యులు

1. పైలుడు　　2. వైశంపాయనుడు

3. జైమినీ　　4. సుమంతుడు

అదేక్రమంలో వేదాలను బోధించారు. గురుశిష్యుల సంఖ్యపెరిగి కాలక్రమంలో ప్రత్యేకసంఘాలుగా ఏర్పడి అనేక శాఖలు ఉత్పత్తి అయినాయి. ఈరకంగా

| | | |
|---|---|---|
| ఋగ్వేదానికి | - | 21 శాఖలు |
| కృష్ణయజుర్వేదానికి | - | 94 శాఖలు |
| శుక్లయజుర్వేదానికి | - | 15 శాఖలు |
| సామవేదానికి | - | 100 శాఖలు |
| అధర్వణవేదానికి | - | 50 శాఖలు వచ్చియి. |

వీటిలో చాలావరకు ఇప్పుడు కనిపించటం లేదు.

ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని, ఐహికసంపత్తిని, మోక్షాన్ని సంపాదించిపెట్టేవి యజ్ఞాలు. యజ్ఞ నిర్వహణ చాలాకష్టమైనది. దీనిని జాగ్రత్తగా పూర్తిచేయించటమే వేదాల ప్రయోజనం. యజ్ఞనిర్వహణకు నలుగురు పురోహితులుంటారు. వారు

| | | |
|---|---|---|
| 1. హోత | - | ఋగ్వేదంలోని స్తోత్రాలను క్రమంగా పఠించేవాడు |
| 2. అధ్వర్యుడు | - | యజుర్వేదంలో చెప్పిన ప్రకారం యజ్ఞ కర్మలను యధావిధిగా నిర్వహించేవాడు. |
| 3.ఉద్గాత | - | సామగీతాలను గానంచేసేవాడు |
| 4. బ్రహ్మ | - | అధర్వ వేదపండితుడు. యజ్ఞాన్ని మొదటినుంచీ చివరిదాకా |

పర్యవేక్షించేవాడు. యజ్ఞకళకూ, వేదసహిత్యానికీ ఇతడు ప్రతీక. ప్రతివేదాన్నీ నాలుగు భాగాలుగా విభజించారు.

1. సంహితలు　　3. అరణ్యకాలు

2. బ్రాహ్మణాలు　　4. ఉపనిషత్తులు

**1. సంహితలు:-** ఇవి మంత్రభాగం. ఇందులో స్తోత్రాలు, ఆవాహనలు, ఉంటాయి.

ఋుగ్యజుస్సామసంహితలు సూక్తాలుగా ఉంటాయి.

**2. బ్రాహ్మణాలు:-** సంహితలలలోని విషయాన్ని వివరించేవి బ్రాహ్మణాలు. వీటిలో యజ్ఞయాగాదులెలా చెయ్యాలి? వాటిఉత్పత్తి, వాటి వెనుక రహస్యము, యజ్ఞాల విలువ, వాటి మహిమ చెప్పబడ్డాయి.

**3. అరణ్యకాలు :-** ఇవి బ్రాహ్మణాలకు, ఉపనిషత్తులకు మధ్యస్థాయిలో ఉంటాయి. ఇవికూడా బ్రాహ్మణాలలాగా కర్మవిధుల ప్రతిపాదితాలే. కానీ వీటిలో కర్మలయొక్క భౌతిక భాగం అణచివేయబడింది. కర్మలవెనుక ఉన్ననిఘూఢమైన తత్వాలమీద ధ్యానానికి ప్రాముఖ్యత ఇవ్వబడింది. ఏకాంతవాసంస్వీకరించినవారు, అరణ్యాల నివసించేవారికోసం ఇవి ఉద్దేశింపబడినాయి. విషయంలో ఉపనిషత్తులకు అరణ్యకాలకు తేడాలేదు.

**4. ఉపనిషత్తులు:-** ఉపనిషత్తు అంటే బ్రహ్మవిద్య. జీవాత్మ, పరమాత్మ, జ్ఞానము, ముక్తి గురించి వివరించేవి. నాలుగువేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులున్నాయి. కాని ఇందులో 200 మాత్రమే ముద్రించబడగా వాటిలో 108 మాత్రమే చదవ తగ్గవి అని తేల్చారు. ఉపనిషద్బ్రహ్మేంద్ర అను మహనీయుడు ఈ108 ఉపనిషత్తులకూ వాఖ్య వ్రాశాడు.

**2. వేదభాష్యాలు:-**

వేదాల అర్థం తేలుసుకోటానికి కనీసం 5000 సం॥ నుంచే ప్రయత్నం జరుగుతోంది. చరిత్రకందినంతవరకు 25 మంది వేదాలకు భాష్యం వ్రాశారు. వారు వరుసగా

1. యాస్కుడు
2. స్కందస్వామి
3. ఉద్గీథాచార్యుడు
4. నారాయణాచార్యుడు
5. హస్తామలకుడు
6. లక్ష్మణాచార్యుడు
7. ఆనందతీర్థుడు
8. ఆత్మానందతీర్థుడు
9. ముద్గలాచార్యుడు
10. చతుర్వేదస్వామి
11. భట్టస్వామి
12. భట్టభాస్కరుడు
13. దుర్గాచార్యుడు
14. ఉవటుడు
15. మహీధరుడు
16. భవస్వామి
17. సహదేవుడు
18. మాధవుడు
19. సాయనాచార్యుడు
20. గుణవిష్ణువు
21. భరతస్వామి
22. ధానుష్యయజ్వ
23. హలాయుధుడు
24. అనంతాచార్యుడు
25. రావణుడు

వీరేకాకుండా

1. కాత్యాయనుడు - వేదరుక్కులకు అనుక్రమణిక
2. విద్యారణ్యుడు - ఉపర్ధదీపిక
3. రామానుజాచార్యుడు- వేదవర్ధసంగ్రామం
4. శౌణకుడు - బృహద్దీపిక
5. ఆశ్వలాయనుడు - అధర్వసంహితకు అనుక్రమణిక
6. కాత్యాయనుడు - శుక్లయజుః సర్వానుక్రమ సూత్రగ్రంథం
7. యాశ్వాచార్యుడు - యాదిశసర్వానుక్రమణిక

విజయనగర రాజ్యస్థాపనచేసిన విద్యారణ్యులవారు వేదాలకు భాష్యం వ్రాశారు. వీరు 125 సం॥ జీవించి వేదసాహిత్యానికి విశేషమైన సేవచేశారు.

### 3. ఉపనిషత్తులు:

ఉపనిషత్తు అంటే బ్రహ్మవిద్య బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మ, జన్మ మరణాలను లేకుండా చేసేది. అజన్మమరణాదికమైన దానిని నశింపచేసేది. బ్రహ్మపదార్థలాభాన్ని కలుగచేసేది. అందుకే దీనిని ఉపనిషత్తు అన్నారు. వేదాలు మూడు కాండఀ యుగా భజింపబడ్డాయి. అవి 1. కర్మ 2. ఉపాసన అజ్ఞాన కాండలు. వీటిలో ఉపాసన, జ్ఞాన భాగా లకు ఉపనిషత్తు' అని పేరు ఉపనిషత్తులు మొత్తం 108 వాటిలో ప్రసిద్ధమైనవి పది.

ఈశ, కేవ, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య తిత్తిరి
ఐతరేయంచ, ఛాందోగ్యం, బృహదారణ్యకందశ॥

| | |
|---|---|
| 1. ఈశోపనిషత్తు | 6. మాండూక్యోపనిషత్తు |
| 2.కేనోపనిషత్తు | 7. తైత్తిరీయోపనిషత్తు |
| 3. కఠోపనిషత్తు | 8. ఐతరేయోపనిషత్తు |
| 4.ప్రశ్నోపనిషత్తు | 9. ఛాందోగ్యోపనిషత్తు |
| 5. ముండకోపనిషత్తు | 10. బృహదారణ్యకోపనిషత్తు |

మిగిలినవాటిలో

| | |
|---|---|
| 1. యోగోపనిషత్తులు ఇరవై | 20 |
| 2. వేదాంతోపనిషత్తులు ఇరవైనాలుగు | 24 |
| 3. సన్యాసోపనిషత్తులు పదిహేడు | 17 |
| 4.శైవోపనిషత్తులు పదిహేను | 15 |
| 5.వైష్ణవోపనిషత్తులు పధ్నాలుగు | 14 |
| 6. దేవ్యుపనిషత్తులు ఎనిమిది | 8 |
| | ---- |
| మొత్తం తొంబైఎనిమిది | 98 |
| | ---- |

108 ఉపనిషత్తులకూ ఉపనిషద్బ్రహ్మేంద్ర అనే మహనీయుడు వ్యాఖ్య వ్రాశాడు. ప్రస్తుతము గర్రె సత్యనారాయణ గుప్తగారి ఆర్థి  లో ప్రార్థనాగాన ప్రచారసంఘం, సత్యనారాయణపురం, విజయవాడవారు ఉపనిషత్కల్పతరువు' అనే పేరుతో వ్యాఖ్య ప్రచురించారు.

**4. దర్శనాలు:**

వేదములలో చెప్పబడిన విషయాలను నిర్ణయించి, నిర్ధారించి చెప్పటానికి ఉత్పన్నమైనదే దర్శన శాస్త్రము. దీన్ని యాస్కుడు నిరుక్తం లో చెప్పాడు. నిరుక్తం అంటే వేదశబ్దాలకు నిఘంటువు లాంటిది. దృశ్యతేజ్ఞాయతే అనేనీతి దర్శనమ్ వస్తుతత్వమును తెలియచేసేది దర్శనము అంటారు.

అంటారు. దర్శనాల్లో వాదము, ప్రతివాదము, సిద్ధాంతము ఖండన, స్థాపన అనేవి ముఖ్యాంశాలు. అయితే దర్శనాలు ప్రతిపాదించే విషయాలన్నింటికీ మూలము వేదమే. అసలు దర్శన శాస్త్రము అంటే వేదాంతమే. వేదాలు, బ్రాహ్మణాలు, అరణ్యకాలు, ఉపనిషత్తులు, స్మృతులు, పురాణాలు మొదలైనవి ఆధారంగా దర్శనాలు వ్రాయబడినాయి.

స్థూలంగాగనక చూచినట్లైతే దర్శనాలు రెండురకాలు.

1. ఆస్తిక దర్శనాలు. 2. నాస్తిక దర్శనాలు.

**1. ఆస్తికదర్శనాలు :-** వేదప్రమాణాన్ని అంగీకరించినవారిని ఆస్తికులు అంటారు. ంలోని విషయాలు అంగీకరించి, వాటిని ఖండించిన వారితో వాగ్వివాదానికిదిగి, వారి వాదాలను ఖండిస్తూపోయేవారిని ఆస్తికులనీ, వారురూపొందించిన దర్శనాలను ఆస్తికదర్శనాలనీ అంటారు. న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస దర్శనాలు ఈకోవకు చెందినవి.

**2. నాస్తికదర్శనాలు :-** వేదప్రమాణాన్ని నిరాకరిస్తూ, వేదంలో పునరుక్తి దోషాలున్నాయనీ, వేదం అంతా స్వార్ధపరులు కల్పించినదనీ చెప్పేవారు నాస్తికులు. వారు రూపొందించిన దర్శనాలను నాస్తికదర్శనాలు అంటారు. చార్వాకులు, లోకాయతులు, జైనులు, స్థూల ం. ఈరకమైన దర్శనాలు రూపొందించారు.

> పాణినే ర్జైమినే శ్చైవ వ్యాసస్య కపిలస్య చ.
> కణాదస్యాక్షపాదస్యదర్శనాని షడైవహి.

ఈ శ్లోకంబ ట్టి దర్శనాలు ఎన్ని ఉన్నప్పటికీ ప్రాచీనులు పాణిని, జైమిని వ్యాస, కపిల, కణాద, అక్షపాదమహర్షులు రాసిన ఆరింటినిమాత్రమే దర్శనాలు అన్నారు. వీటిలో

| | |
|---|---|
| 1. పాణిని వ్యాకరణము | 4. కపిలుడు సాంఖ్యము |
| 2. జైమిని పూర్వమీమాంస | 5. కణాదుడు వైశేషికము |
| 3. వ్యాసుడు ఉత్తరమీమాంస | 6. అక్షపాదుడు తర్కము |

వ్రాశారు. వీటిని గురించి సూక్ష్మంగా పరిశీలిద్దాం.

**1. వ్యాకరణము :-** పాణినిమహర్షిచే వ్రాయబడిన సూత్రగ్రంథమే వ్యాకరణము.

నృత్తావసానేనటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారమ్
ఉద్ధర్తుకామస్సనకాదిసిద్ధా నేతద్విమర్శే శివసూత్రజాలమ్.

శివుడు తన నాట్యము పరిసమాప్తి అగునప్పుడు సనకాది సిద్ధులనుద్ధరింపగోరిన వాడై, తన ఢక్కను 14 సార్లు వాయించెను. దానినుండి 14 సూత్రములు జనించి భాషావలంబనమయ్యెను. ఈమహేశ్వరసూత్రములు ప్రాతిపదికగా, పాణిని మహర్షి అష్టాధ్యాయి' అను సూత్రగ్రంథాన్ని రచించాడు. దీనికి కాత్యాయనుడు వార్తికములు, పతంజలి భాష్యము వ్రాశారు.

వయ్యాకరుణులు శబ్దనిత్యవాదులు. నిత్యమైన శబ్దాన్నిస్ఫోటము అంటారు. ఆస్ఫోటమే పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరులను చతుర్విధములగు వాక్కులు అంటారు. వీటికి నాభి, హృదయము, కంఠము, ముఖములు స్థానములు. శబ్దము యొక్క అర్థము విషయమై స్ఫోటవాదమను పేర ఒక విశేష మార్గాన్ని తెలుపుతుంది. శంకర భగవత్పాదులు స్ఫోటవాదాన్ని ఖండించారు.

**2. జైమిని దర్శనము :-** ఇది జైమినిమహర్షివ్రాసిన 'పూర్వమీమాంస'. అను గ్రంథము. 12 అధ్యాయములు, వేయిన్యాయములు, యజ్ఞయాగాది సర్వకర్మల స్వరూపానుష్ఠానములు, ఫలములను నిర్వహించు 'ద్వాదశలక్షిణి' అను పేరుగల గొప్ప శాస్త్రము. దీనికి కుమారిల భట్టు వార్తికములు, శబరస్వామి భాష్యము వ్రాశారు. దీనిలో యాగాది కర్మలు నెరవేర్చినట్లైతే, వాటి అదృష్టఫలము యజమానియందు ప్రవేశించి వానికి స్వర్గఫలమొసగును అని చెప్పారు. వీరు ఈశ్వరుని పూర్తిగా ఒప్పుకోరు. దేవతలకు రూపంలేదు. మంత్రస్వరూపమే దేవత. వేదమంతా కర్మను బోధించేదేకాని బ్రహ్మనుకూర్చికాదు. అనివీరి అభిప్రాయం. యాగాదుల ఫలమైన స్వర్గమే వీరికి సుఖమయదామము. మోక్షము.

**3. వ్యాసదర్శనము :-** ఇది వేదముయొక్క ఉత్తరభాగమైన ఉపనిషత్తులను సమన్వయించే బ్రహ్మసూత్రములు. దీన్నే ఉత్తరమీమాంస' వేదాంత దర్శనము' బ్రహ్మమీమాంస' అనికూడా అంటారు. దీనిలో బ్రహ్మమొక్కటే పరమార్థసత్యము. పరబ్రహ్మస్వరూపము మాయతోచేరి సగుణుడైన ఈశ్వరుడై ఈ ప్రపంచమున సృష్టికార్యక్రమముకావించుచున్నాడు. దీనిలో ఉపాదాన, నిమిత్తకారణము ఒక్కబ్రహ్మమే. ఘటనమునకు మృత్తుఉపాదానకారణము. బ్రహ్మమొక్కటే సర్వోత్తుకూ మూలము. మాయబ్రహ్మము ననుసరించును. కాని వేరుగా ఉండదు. నిత్య శుద్ధ, ముక్త, బుద్ధమగునది బ్రహ్మము. మాయాప్రతిబింబితుడు ఈశ్వరుడు. అవిద్యా ప్రతిబింబితుడు జీవుడు. అవిద్య తొలగిపోగానే జీవుడు బ్రహ్మమగును. బ్రహ్మసాయుజ్యము అనగా మోక్షము. ఇందులో బ్రహ్మము సత్యము. జగత్తు మిథ్య.

**4. సాంఖ్యదర్శనము :-** దీనిని వ్రాసినవాడు కపిలమహర్షి. ప్రకృతి, మహత్తత్వము, అహంకారము, పంచతన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రూపరస, గంధములు) జ్ఞానేంద్రియములు (కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము )కర్మేంద్రియములు (కాలు, చేయి, నోరు, పాము, ఉపస్థ) పంచభూతములు ( పృధివి, వ్యాపస్, తేజో, వాయు, అకాశము ) మనస్సు, పురుషుడు. అను పంచవింశతి (25) తత్వములచే జగత్తు పరిణామముచెంది ఉన్నది. పాలు పెరుగుగా మారినట్లే ప్రకృతి పురుషునిచేరి ఈ జగత్తును సృష్టించుచున్నది. ఈమతములో ఈశ్వరుడు లేడు. దీన్ని నిరీశ్వరసాంఖ్యము' అంటారు. ఇది పరిణామవాదము. ప్రకృతి పురుషులవలన జగత్తు పరిణామముచెందుచున్నది. పురుషుడు తనను తాను ఎరుగకపోవుటయే సంసారబంధము. పురుషుని భోగమునకే ప్రకృతి. పురుషుడు కర్తకాదు కేవలము భోక్తయే. దుఃఖనివృత్తియే ఇందులో మోక్షమని చెప్పబడినది.

**5. వైశేషికము :-** దీనిని రచించినవాడు కణాద మహర్షి. దీనిలో పరమాణువు' ఈజగత్తునకు మూలకారణము అని చెప్పబడింది. మొత్తం ఏడు పదార్థాలు ఈజగత్తుకు మూలము. వీరి లెక్కప్రకారము కొన్ని పరమాణువులు కలిసి ఈ జగత్తు ఏర్పడింది. వీరికి అనుమాన ప్రమాణము మీద మక్కువ ఎక్కువ. ఇంతపెద్ద జగత్తను కార్యమునకు కర్త ఒకడుండవలెనని ఈశ్వరుని అనుమాన ప్రమాణంతో సాదిస్తారు. వీరిమతంలో అత్యంతిక దుఃఖధ్వంసమే మోక్షము. వీరు కర్మోపాసనలను ఒప్పుకుంటారు.

**6. న్యాయదర్శనము :-** ఇది అక్షపాదుడు లేక గౌతమునిచే వ్రాయబడింది. గౌతముడు కణాదుని లాగానే పరమాణువాదం అంగీకరిస్తాడు. కాని కణాదునిలాగా 7 పదార్థాలుగాక 16 పదార్థాలు ఉన్నాయి అంటాడు. ఈ 16 పదార్థాల తత్వము తెలుసుకోటం ద్వారానే మోక్షం కలుగుతుంది. కణాదుడు, గౌతముడు ఇద్దరూ కూడా పరమాణువులవల్లనే ఈజగత్తు సృష్టించబడిందనీ ఇవే జగత్తునకు మూలకారణమనీ అంటారు. వీరు ఈశ్వరుణ్ణి నిమిత్త కారణముగ అంగీకరిస్తారు. ఈ రకంగా ఆస్తిక దర్శనాలు జీవాత్మ పరమాత్మను ఎలా చేరుతుంది? జన్మరాహిత్యం ఎలా జరుగుతుంది? మోక్షం ఏవిధంగా ప్రాప్తిస్తుంది? అనే విషయాలను వివరిస్తున్నాయి.

**7. యోగశాస్త్రము :-** పైన పేర్కొన్న షడ్దర్శనాల్లో లేకపోయినప్పటికీ ఇదికూడా ఆస్తిక దర్శనమే కాబట్టి ఇక్కడ ప్రస్తావించటం జరుగుతోంది. యోగశాస్త్రాన్ని పతంజలిమహర్షి రచించాడు. ఇదినాలుగు పాదములు లేక భాగములుగా ఉంది. అవి

1. సమాధిపాదము, 2. సాధన పాదము 3. విభూతిపాదము 4. కైవల్య పాదము. దీనిలో అష్టాంగాలను అభ్యసించటంద్వారా కైవల్యప్రాప్తి కలుగుతుందంటాడు పతంజలి మహర్షి. అష్టాంగములు అనగా

1. యమ　　　　5. ప్రత్యాహార

2. నియమ　　　6. ధారణ

3. ఆసన　　　　7. ధ్యాన

4. ప్రాణాయామ　　8. సమాధులు.

ఈ అష్టాంగ మార్గాల ద్వారానే జీవాత్మపరమాత్మను చేరుతుంది. అదే కైవల్యము లేక మోక్షము.

**8. రామానుజదర్శనము:-** దీనిని రామానుజా చార్యులవారు వ్రాసినారు. దీని ప్రకారము చరాచరజగత్తుకు సృష్టిస్థితిలయములకు మూలకారణము శ్రీమన్నారాయణుడే. వాసుదేవుడు తనభక్తులందరి వాత్సల్యమున 5 మూర్తులు గలవాడయ్యెను. అవి అర్చా, విభవ, వ్యూహ, సూక్ష్మ, అంతర్యామి అనునవి.

అర్చ అనగా దేవాలయమునందలి ప్రతిమలు

విభవ అనగా　-　రామకృష్ణుడు మొదలైన అవతారమూర్తులు

వ్యూహ అనగా　-　వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు.

సూక్ష్మ అనగా　-　సంపూర్ణము, షడ్గుణ సంపన్నము అయిన యశో, వీర్య, జ్ఞాన, వైరాగ్య మహిమలు గల వాసుదేవాఖ్యమైన పరబ్రహ్మము. అంతర్యామి సకల జీవనాయకుడు. భగవదనుగ్రహముకావాలి అంటే భక్తిప్రపత్తులు ముఖ్యము. భక్తుడు 1. అభిగమనము 2. ఉపాదానము, 3. ఇజ్య, 4. సాధ్యాయము, 5. యోగము అను 5 విధముల భగవంతుని ఉపాసించినట్లైతే మోక్షము కలుగుతుంది.

**9. పూర్వప్రజ్ఞా దర్శనము :-** ఇది ద్వైతదర్శనము. దదీనిప్రకారము తత్వములు రెండువిధములు. 1. స్వతంత్రము 2. అస్వతంత్రము. భగవంతుడు శ్రీమహావిష్ణువు. స్వతంత్రుడు. చతుర్విధపురుషార్థముల నిచ్చువాడు. జీవుడు అస్వతంత్రుడు. సంసారబంధమందు చిక్కకొనినవాడు. తనకర్మఫలాన్నిబట్టి సుఖ దుఃఖాలు అనుభవిస్తూ ఉంటాడు. (జీవులందరూ పరస్పర బేధముగలవారు. ఇక్కడ ఈశ్వరుడు, జీవుడు, జడములు విభిన్న మగుటవలన దీన్ని ద్వైతదర్శనమన్నారు.) భగవంతుని అయుధములైన శంఖ చక్రచిహ్నములను తమ శరీరము పైన వేసుకొని తమ సంతానమునకు భగవంతుని పేరుపెట్టుకొనువారు, భగవంతుని సంకీర్తనము చేయువారు భగవద్సన్నిధిని చేరుదురు. ఇదేముక్తి. ముక్తిపొందినవారికి లక్ష్మీనారాయణుడే ప్రభువు. లక్ష్మీనారాయణులే నిత్యులు. మిగిలినవారు అనిత్యులు.

పైన చెప్పినవన్నీ ఆస్తికదర్శనాలు. భారతదేశంలో కొంతకాలానికి వేదాలు ఎవరోకొందరు స్వార్థపరులు కల్పించినవనీ, వాటిలో దోషాలనేకం ఉన్నాయనీ కొన్ని వాదనలు బయలుదేరినాయి.

వారినే వాస్తికులు' అన్నారు. నాస్తికులు' అంటే ప్రస్తుతార్థం భగవంతుడు లేదు' అనేవారు. కాని ఇక్కడ వేదాలను ప్రమాణంగా నమ్మనివారు' అని అర్థం. వారుకూడా దర్శనాలు వ్రాశారు. వాటిలో ముఖ్యమైనవి

**1. చార్వాకదర్శనము :-** చార్వాకులనే నాస్తికులు అని పిలుస్తారు. వీరికి దేవుడు లేదు. పంచభూతములలో పృథ్వి, జలము, అగ్ని, వాయువు అనే నాలుగు భూతాలనే అంగీకరిస్తారు. వీరి సిద్ధాంతంలో దేహము, ఆత్మ రెండూ వేరుకాదు. ఒక్కటే. ఆకులు, వక్కలు, సున్నములయందు ప్రత్యేకముగా లేని ఎరుపు, తాంబూలమువేసుకొన్నప్పుడు ఎలావస్తుందో అలాగే పృథివి, జలము, అగ్ని, వాయువుల చేరికతో దేహమందు చైతన్యము కలుగుతుంది అంటారు. వీరి దృష్టిలో స్వర్గ నరకాలు ప్రత్యేకంగా లేవు. ఈలోకంలో ఉన్న సుఖమే స్వర్గము, దు:ఖమే నరకము. మోక్షమనగా మరణము అని నమ్ముతారు. ఏదైనాసరే ప్రత్యక్ష ప్రమాణాన్ని అంగీకరిస్తారు. కర్మలు చేసే వారిని, జ్ఞానులను చులకనగ చూస్తారు.

**2. బౌద్ధదర్శనము :-** బుద్ధభగవానుడు తనశిష్యులకు బోధించిన బోధనలనే బౌద్ధదర్శనము అంటారు. బుద్ధుడు ముఖ్యంగా నాలుగు వాక్యాలను శిష్యులకు బోధించాడు. అవి

1. సర్వం శూన్యం శూన్యం 3. సర్వం దుఃఖం దుఃఖం

2. సర్వం స్వలక్షణం స్వలక్షణం 4. సర్వ క్షణికం క్షణికం

1. దీనిలో మొదటి సూత్రము అవలంబించువారిని మాధ్యమికులు' అంటారు. వీరు సర్వశూన్యతావాదులు. వీరి దృష్టిలో ప్రత్యక్ష ప్రమాణాలుగాని, వస్తువులు, ప్రపంచము అంతా శూన్యము. దీనివలన వాసనాక్షయముకాగా పరమయగు నిర్వాణము, మోక్షము, కలుగుతాయని వారినమ్మకం.

2. రెండవసూత్రమవలంభించువారిని యోగాచారులు' అంటారు. వీరి దృష్టిలో బాహ్యవస్తువులు, ప్రపంచము అంతాశూన్యము. జ్ఞానము .

**3.**మూడవ సూత్రమవలంభించినవారు. వీరిదృష్టిలో జగత్తు అనుమానసిద్ధము. దీనిని కూడిన జ్ఞానమే మోక్షము. ఆత్మలేదు. జగత్తంతా క్షణికం అనే నిశ్చయమే మోక్షము.

**4.** నాల్గవ సూత్రమును అవలంభించువారిని వైభాషికులు' అంటారు. వీరు ప్రత్యక్ష వాదులు. రాగద్వేషములను వదలి ప్రశాంతముగ జీవించటమే నిర్వాణము అంటారు.

**3.అర్హత దర్శనము :-** ఇది జైనమతస్థాపకులైన తీర్థంకరులచే వ్రాయబడింది వీరిదృష్టిలో శరీర పరిమాణము జీవుడు. వీరు శ్వేతాంబరులు దిగంబరులు అని రెండు శాఖలుగా ఉన్నారు. శ్వేతాంబరుల దృష్టిలో స్త్రీకి మోక్షమున్నది. సర్వమతసామరశ్యమే వీరి ఆశయము. వీరు రాగద్వేషాలకు అతీతులు. రాగద్వేషనిరసనే వీరి అభీష్టము.

ఈ దర్శనాలన్నింటినీ శకరభగవత్పాదులవారు ఖండించి అద్వైతసిద్ధాంతప్రతిపాదన

చేశారు. దీనిప్రకారము హకారసంజ్ఞకలిగిన పరమాత్మ సకారసంజ్ఞక లిగిన ప్రకృతితో కలసి శబళబ్రహ్మము అవుతాడు. ఈశబళ బ్రహ్మ తొమ్మిది ద్వారాలు గల మానవ శరీరంలో బ్రహ్మరంధ్రంద్వారా ప్రవేశించి ఇంద్రియాలు, ప్రాణములు, మనస్సుతోకూడిన వాడై, పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకువచ్చే ఉపాయం తెలియక ప్రాపంచిక బంధనాలతో కొట్టుమిట్టాడుతున్నాడు. ఈరకంగా ఉన్న హంస అనే జీవుడు పాలలోఉన్న నెయ్యిలాగా సమస్త ప్రాణికోటినీ ఆశ్రయించి ఉన్నాడు. సాధకుడి సాధన ననుసరించి ఆజీవుడు మళ్ళీ బ్రహ్మరంధ్రంద్వారానే బయటకువచ్చి పరబ్రహ్మలో లీనమవుతున్నాడు. అంటే జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటేకాని వేరుకాదు.

**5. ఆత్మస్వరూపం :** - ముడిపదార్థం గురించి మనకు తెలిసినట్లైతే ఆపదార్థంతో తయారయిన వస్తువులను గురించి తేలికగా తెలుస్తుంది. ఉదాహరణకు మట్టిని గురించి తెలిస్తే, దానితో తయారుచేసే కుండలు, బానలు మొదలైన వస్తువులను గురించి తెలుస్తుంది. అలాగే బంగారం గురించి తెలిస్తే దానితో తయారుచేసే నగలపేర్లు వేరుగా ఉన్నా, వాటన్నింటిలో ఉన్నది బంగారమే అని తెలుస్తుంది. అదేవిధంగా ఏవిషయం తెలుసుకోవటంవల్ల అన్ని విషయాలూ తెలుస్తాయో, దాన్ని తెలుసుకోవాలి. ప్రతివిషయంలోను అంతర్గర్భితంగా ఉండే తత్త్వం గనక తెలుసుకుంటే మిగిలిన విషయాలన్నీ తెలుస్తాయి.

నదులు తూర్పునుంచి పడమరకు ప్రవహించినా, పడమరనుంచి తూర్పుకు ప్రవహించినా చివరకు అవి సముద్రంలోనే కలుస్తాయి. సూర్యరశ్మికి నీరు ఆవిరిగా మారి మేఘాల రూపం పొందుతుంది. ఆ మేఘాలు మళ్ళీ వర్షించి నదులుగా ప్రవహిస్తాయి. ఆనదులన్నీ మళ్ళీ సముద్రంలో కలుస్తాయి. సముద్రంలో కలిసేవరకూ నదులకు గంగ, కృష్ణ, కావేరి అని వివిధ రకాలపేర్లుంటాయి. కాని సముద్రంలో కలిసిన తరువాత ఆనదీజలాన్ని విడదియ్యలేము. అలాగే అన్ని జీవాత్మలూ పరమాత్మలోని అంతర్భాగాలే.

సృష్ట్యారంభం కాకముందు, కృతయుగారంభంలో పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయి, ఇతరములతో సంబంధంలేకుండా, తనకు సమానమైన వారుగాని, అధికులుగాని లేకుండా, ఏకాకిగా ఉండేవాడు. ఈరకంగా ఉన్న పరబ్రహ్మపూర్ణ బిందు స్వరూపుడు. ఆఏకైకత్వం అనేకం కావాలని సంకల్పించింది. రకరకాల వస్తువులుగా చిత్రవిచిత్ర సమ్మేళనాలతో రూపుదాల్చింది. ఘన, ద్రవ, వాయు పదార్థాలుగా ఎన్నో రూపాలుగా మార్పుచెంది, భిన్న రూపాలతో ఈసృష్టి ఆకారం పొందింది. జీవరాసులు ఉత్పన్నమయ్యాయి. సృష్టిలో భాగంగానే హకార సంజ్ఞ కలిగిన పరమాత్మ సకార సంజ్ఞకలిగిన ప్రకృతితో కలిసి శబళబ్రహ్మమై,

బ్రహ్మరంధ్రం ద్వారా నవరంధ్రములతో నిర్మించబడిన మానవ దేహంలో ప్రవేశించి, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు అనబడే పదకొండు ఇంద్రియాలద్వారా ప్రాపంచిక సుఖాల ననుభవిస్తూ, పంజరంలోని పక్షిలాగా ఈదేహంలో బంధించబడి బయటకుపోయే మార్గం తెలియక కొట్టుమిట్టాడుతున్నాడు. జీవాత్మ అనబడే ఈహంసకు అగ్ని, చంద్ర మండలాలే - రెక్కలు, ఓంకారము - శిరస్సు, జ్ఞాననేత్రము-ముఖము, హకార సకారములే-పాదాలు. ఈరకంగా పరమాత్మ అన్ని ప్రాణులలోనూ పాలలో ఉన్న నెయ్యిలాగా ఆవరించి ఉన్నాడు. అన్ని జీవాత్మలూ పరమాత్మలోని భాగాలే. మర్రిచెట్టు చాలా పెద్దవృక్షం. కాని దానికి కారణమైన విత్తనంలో చూస్తే ఏమీ కనిపించదు. అంటే విత్తనంలో అంతపెద్ద వృక్షానికి కారణమైనది, మనకంటికి కనిపించనంత సూక్ష్మమైనది దాగి ఉన్నది. అదే విధంగా ఆత్మబయటకు కనిపించకుండా, సూక్ష్మరూపంలో సర్వత్రా వ్యాపించి ఉంటుంది. ఆత్మకు నాశనంలేదు. ముసలితనంలేదు. ఆత్మకు పాపం అంటదు. శోకం తాకదు. ఆకలి దప్పికలు ఉండవు. స్వప్నప్రపంచంలో ప్రభువులాగా విహరించే చైతన్యమే ఆత్మ. గాఢసుషుప్తిలో తృప్తిగా ఆనందాన్ని అనుభవించేదే ఆత్మ.

ప్రకాశబిందువు పరబ్రహ్మస్వరూపమైన చంద్రమండలం అకారబీజం. విమర్శబిందువు శక్తిస్వరూపం. అగ్నిమండలం. హకారబీజం. ఈరెండింటి సామరస్యమే 'అహం'. ఇదే పరబ్రహ్మస్వరూపం. పరమేశ్వరుని ప్రతిబింబమే శక్తి. అదే మాయ. అందుచేతనే శివసంబంధంలేకుండా శక్తిగాని, శక్తిసంబంధంలేకుండా శివుడుగాని ఈజగత్తును సృష్టించలేరు. ఇక్కడ శివశక్తులు అంటే త్రిమూర్తిద్వంద్వములోని వారుకాదు. పరమేశ్వరీ పరమేశ్వరులని గుర్తించాలి. వీరిద్దరికలయిక లేనిదే స్వరూపజ్ఞానం కలగదు. అహమనేది ఆత్మస్వరూపం. ఇదే ఆత్మమంత్రం. ఆత్మమంత్రము, హంసమంత్రము రెండూ సమాన ధర్మాలు కలిగి ఉన్నాయి.

శరీరం అశాశ్వతమైనది. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరము అవాసంగా ఉంటుంది. శరీరము ఉన్నంతకాలము ఆత్మకు గుణదోషాలు, సుఖదుఃఖాలు అంటినట్లు, వాటితో సతమతమవుతున్నట్లు అనిపిస్తుంది. ఆత్మశరీరంతో సంబంధం ఏర్పరచుకోవటంవల్ల, జీవులకు సుఖదుఃఖాలతో సంబంధం ఏర్పడుతుంది. మానవుడు మాసిన వస్త్రాన్ని వదలి నూతన వస్త్రాన్ని ధరించినట్లుగానే, ఆత్మ జీర్ణమైన దేహాన్ని వదలి వేరే దేహాన్ని ఆశ్రయిస్తుంది. ఆత్మశరీరంనుంచి విడిపోతే భౌతికబంధాలనుండి విముక్తి కలుగుతుంది.

**ఆత్మజ్ఞానం:**

ఒక మనిషికళ్ళకు గంతలు కట్టి అపరిచితమైన అరణ్యం మధ్యలో వదిలేశామనుకోండి. అప్పుడతడు దారితెన్నూ తెలియక అన్ని దిక్కులూ తిరుగుతాడు. తననెవర్ణో [illegible]ంధించినట్లు బాధపడతాడు. తన ఇంటికి దారిచూపమని ఏడుస్తాడు. అప్పుడు ఎవరోవ[illegible] కళ్ళకు కట్టిన గంతలు తీస్తారు. అతడికి కళ్ళు కనిపిస్తాయి. కనిపించిన వాళ్లని దారిఅడుగుతూ ఇల్లుచేరతాడు. ఇదేవిధంగా మానవుడి మనస్సుకు అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్న సాధకుడు జ్ఞానసముపార్జన చెయ్యాలి. జిజ్ఞాసతో ప్రతి అడుగుయొక్క గమ్యం ఆత్మే కావాలి. నీవే ఆత్మ[illegible]త్మే నీవు.

ఈ విషయాలను పూర్తిగా తెలుసుకొని పరమేశ్వరీ ధ్యానం చెయ్యా[illegible] హ్రీంకారంలో మూడు అక్షరాలున్నాయి. వాటి అర్థం పూర్తిగా తెలుసుకోవాలి. దీనిలో

| | | |
|---|---|---|
| హ కారము | - | స్థూలదేహము |
| ర కారము | - | సూక్ష్మదేహము |
| ఈ కారము | - | కారణదేహము |

ఈ రకంగా బీజత్రయంతో కలసి ఉన్నరూపము హ్రీం పరమేశ్వరీ నాదము. ఆ నాదోపాసనే ఆమెను చేరే మార్గము.

6. పరమేశ్వరి - పరబ్రహ్మ స్వరూపం : -పరమేశ్వరుడు నిరాకారుడు [illegible]ణస్వరూపుడు అతడు ఈ రకంగా ఉంటాడని ఎక్కడా చెప్పబడలేదు. కాని, అనుభవజ్ఞులైన బ్రహ్మవేత్తలు చెప్పినదానిని బట్టి పరబ్రహ్మస్వరూపం ఈ విధంగా ఉంటుంది.

వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి. అతడు విద్యాభ్యాసం పూర్తిచేసి తండ్రివద్దకు వెళ్ళి బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించమని అడుగుతాడు. దానికి వరుణమహర్షి "బ్రహ్మజ్ఞానం చెబితే తెలిసేదికాదు. కొంతకాలం తపస్సు చేస్తే అది నీకు బోధపడుతుంది. వెళ్ళి తపస్సుచెయ్యి." అన్నాడు. తండ్రి సలహామేరకు భృగువు తపస్సు చేశాడు. ఈలోకంలో జీవించటానికి ఆధారమైనది అన్నము. అన్నమువల్లనే అన్ని ప్రాణులు వృద్ధిచెందుతాయి. మరణించిన త[illegible]ాత కూడా అన్న రూపమైన ఈ పృథివిలోనే అన్ని జీవరాసులు కలిసిపోతాయి. అన్నానికి [illegible]ంచిన ఆధారం మరొకటి లేదు. అన్నమే పరబ్రహ్మస్వరూపం. అని భృగువుకు తెలిసింది. ఆశ్రమానికి వచ్చి అదేమాట తండ్రికి చెప్పాడు. త్రండి ఒప్పుకోలేదు. అన్నం జీవించటానికి ఆ[illegible]రమే కాని అదే పరబ్రహ్మస్వరూపం కాదు. కాబట్టి ఇంకొంతకాలం తపస్సు చెయ్యి అన్నాడు. భృగువు మళ్ళీ తపస్సు చేశాడు. ఈసారి సమస్త ప్రాణులు ప్రాణమువల్లనే జీవిస్తున్నాయి. జన్మ[illegible]ంచిన ప్రాణులు ప్రాణము వల్లనే రక్షించబడుతున్నాయి. శరీరంలోంచి ప్రాణము గ[illegible] పోతే శరీరం నాశనమయిపోతుంది. కాబట్టి ప్రాణమే బ్రహ్మస్వరూపం అని తెలిసింది. [illegible]మాట తండ్రికి

చెప్పాడు భృగువు కాదు ఇంకొంతకాలం తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి అయిన వరుణమహర్షి. ఈసారి భృగువుకు మనస్సే పరబ్రహ్మమని తెలిసింది. మనస్సు వల్లనే ప్రాణులు ఉత్పన్నమౌతున్నాయి. స్త్రీపురుషుల మానసికమయిన ప్రేమపూరిత సంబంధ బాంధవ్యాలవల్ల ప్రాణి బీజరూపంలో మాతృగర్భంలో ప్రవేశిస్తుంది. వృద్ధిపొందుతుంది. బయటపడుతుంది. పుట్టినతరువాత కూడా మనసును అధారంగా చేసుకునే ప్రాణి ఇంద్రియాల సాయంతో సర్వ జీవనోపయోగ వస్తువులను తనకనువుగా మలచుకుని జీవపరిరక్షణ చేసుకుంటుంది. అలాగే చనిపోయిన తరువాత శరీరంలో నుంచి ప్రాణము ఎగిరిపోతుంది. ఇంద్రియాలకు జ్ఞానం ప్రసాదించే శక్తి శూన్యమైపోతుంది. ఇంద్రియాలన్నీ మనసునాశ్రయిస్తాయి. ఈ భావనలన్నీ మనస్సే బ్రహ్మమనే నిర్ణయానికి దారితీశాయి. అదేమాట తండ్రికి చెప్పాడు భృగువు. ఇంకొంత కాలంతపస్సుచేయమన్నాడు తండ్రి. ఈసారి విజ్ఞానమే పరబ్రహ్మస్వరూపం అనుకున్నాడు భృగువు.కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు తెలిసింది ఆనందమే పరబ్రహ్మస్వరూపము. సర్వమూ ఆనందాన్నుంచే జనిస్తూ, ఆనందాన్ని అనుభవిస్తూ మళ్ళీ ఆనందంలోనే లీనమౌతున్నది. ఆనందం అన్నింటికన్నా ఉత్తమంగా పరమాత్మరూపాన్ని స్పష్టంచేసే తత్త్వం. ఇదేమాట తండ్రికి చెప్పాడు భృగువు. అప్పుడు వరుణమహర్షి పరబ్రహ్మరూపాన్ని వివరిస్తూ ఆనందమే పరబ్రహ్మస్వరూపం. అయినా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలుకూడా బ్రహ్మస్వరూపాలే. ఇవి ఒకదానికన్న ఒకటి సూక్ష్మమైనవి. అన్నింటికన్నా మించినది ఆనందమయమైన బ్రహ్మానుభూతి. అన్నబ్రహ్మోపాసనద్వారా క్రమంగా ఆనందబ్రహ్మ సాక్షాత్కారం కలుగుతుంది. కాబట్టి అన్నాన్ని ఎప్పుడూ నిందించరాదు. ప్రాణము, మనస్సు సర్వస్వమూ అన్నంమీదనే ఆధారపడి ఉన్నాయి. అందుచేత అన్నాన్ని నిర్లక్ష్యం చేయ్యరాదు. అన్నాన్ని పూజిస్తే ఆతరువాతవన్నీ లభిస్తాయి. అందుకే అన్నం పరబ్రహ్మస్వరూపం అంటారు. అహారాన్ని విసర్జించకుండా ప్రాణం నిలుపుకుంటూ, మనసును వికసింపచేసుకుంటూ, విజ్ఞానమయానుభవాన్నుంచి బ్రహ్మానందం పొందాలి.

గౌతముని శిష్యుడు సత్యకామజాబాలి. బ్రహ్మజ్ఞాన జిజ్ఞాసి. గురువుగారి అజ్ఞమేరకు అడవిలో పశువులు మేపుతుంటాడు. అప్పుడు ఒక ముసలిఆబోతు అతనివద్దకు వచ్చి "సత్యకామా నీకు బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశిస్తాను విను. పరబ్రహ్మస్వరూపం నాలుగుపాదాలుగా ఉంటుంది. అందులో మొదటిపాదాన్ని నేను చెబుతాను. చరాచర జగత్తులోని నాలుగు దిక్కులూ పరబ్రహ్మస్వరూపమే". అని చెబుతుంది. రెండవపాదాన్ని అగ్నిదేవుడు చెబుతాడు. భూమి ఆకాశము సప్తసముద్రాలు, నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు అన్నీ బ్రహ్మమయమే. మూడవపాదాన్ని ఒకహంసచెబుతుంది. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మస్వరూపమే. నాల్గవపాదాన్ని ఒక నీటిపక్షి పూర్తిచేస్తుంది. ప్రాణం

బ్రహ్మ దృష్టి, శ్రవణం, మనస్సు, ఇవన్నీ బ్రహ్మమయాలే. ఈరకంగా చరాచరజగత్తు అంతా బ్రహ్మమయమై ఉన్నది.

ఉపకోశలుడికి అగ్నులు బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశిస్తాయి. ఆనందమే బ్రహ్మ, ఆకాశమే బ్రహ్మ. ఆకాశమంటే హృదయాకాశం. అక్కడే పరబ్రహ్మ ఉంటుంది. ఆనందమనేది పరబ్రహ్మయొక్క సహజరూపం. పంచభూతాలు, తన్మాత్రలూ బ్రహ్మస్వరూపాలే. సూర్యునిలోను, అగ్నిలోను ఉండే బ్రహ్మతత్త్వం ఒకటే. తూర్పు, పడమర మొదలైన దిక్కులయందు నక్షత్రాలలో, నీటిలో ఉన్న తత్త్వము, మనలో ఉన్నతత్త్వము ఒకటే. ఆకాశంలోని మెరుపులో ఉన్నతత్త్వం, మనలోని తత్త్వం ఒకటే. అన్ని చోట్లా వ్యాపించిఉన్నది ఆత్మతత్త్వమే. అదే బ్రహ్మతత్త్వం. విశాలమైన విశ్వమంతా వ్యాపించి ఉన్నది అదే. ఆత్మత్త్వం తెలిస్తే సాధకుడికి బాధలు, భారాలు, దూరమవుతాయి. అతడు తామరాకుమీద నీటిబొట్టులాగా మనమును దుష్టప్రభావానికి లోనుకానీయకుండా బ్రహ్మానందం పొందగలుగుతాడు.

ఈ రకంగా ఉపనిషత్తులలో అనేకచోట్ల అనేకసార్లు పరబ్రహ్మతత్త్వాన్ని వివరించటం జరిగింది. వీటిని క్రోడీకరిస్తే బ్రహ్మ సత్యము. అదినిత్యము, శాశ్వతమైనది. అదే ఆది అనాది. పరబ్రహ్మ కంటికి కనిపించేవస్తువులయందు, కనిపించని వస్తువులయందుకూడా ఇమిడి ఉన్నాడు. చరాచర జగత్తులోని నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, సముద్రాలు, నేల, నింగి, సూర్య చంద్రులు, నక్షత్రాలు, పంచభూతాలు, తన్మాత్రలు, చెట్లుచేమలు, క్రిమికీటకాలు,సకల జంతుజాలము, సర్వమానవాళి అన్నీ పరబ్రహ్మస్వరూపమే, మానవుని హృదయాకాశమే పరమాత్మ నివాసస్థానము. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలమధ్యన ఆనందమయకోశంలో పరమాత్మ నివాసముంటాడు. అందుకే ఆనందమే పరబ్రహ్మస్వరూపం అని చెప్పబడింది. అయితే అపరబ్రహ్మ అవిద్య అనబడే అజ్ఞానంతో కప్పబడి ప్రపంచరూపమైన భ్రమ కలిగిస్తుంది. ఇది రజ్జు సర్పభ్రాంతి. స్థాణుపురుషభ్రాంతి. ఆభ్రమయే సంసారము. భగవంతుడు వేరు భక్తుడు వేరు అనుకుంటే ద్వైతభావము. కాని భగవంతుడు వేరు భక్తుడు వేరుకాదు. ఇద్దరూ ఒకటే. ఇదే అద్వైతసిద్ధాంతము. జీవాత్మా పరమాత్మా రెండూ ఒక్కటే. బ్రహ్మసత్యం జగన్ మిధ్య. బ్రహ్మఒక్కటే సత్యము. ఈజగత్తు అంతా మిధ్య.

పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు. ఈ బ్రహ్మాండమంతా తానే అయిఉన్నాడు. నిరాకారుడైన పరబ్రహ్మోపాసన కేవలంయోగులకు, సిద్ధులకు తప్ప ఇతరులెవరికీ సాధ్యంకాదు. సామాన్య మానవులకు అందుబాటులో ఉండటానికే అపరబ్రహ్మ స్వరూపం ఆకారం దాల్చింది. అదేపరమేశ్వరి. ఆమె ఈ ప్రపంచంలో పంచభూతాలు, తన్మాత్రలు సృష్టించింది. సత్వరజస్తమోగుణాలకు ప్రతీకలైన త్రిమూర్తులను సృష్టించింది. వారికి శక్తు

లిచ్చింది. వారు ఏఏ పనులు చెయ్యాలో వివరించింది. వాళ్ళకి ఏవైనా ఆపదలు వచ్చినప్పుడు రక్షిస్తుంది.

దేవకార్యాలు పూర్తి చెయ్యటానికి భూలోకంలో అవతరించి రాక్షస సంహారం చేస్తుంది. ఈజగత్తు అంతా పరమేశ్వరి స్వరూపం. సృష్టించేది, లయం చేసేదికూడా ఆమే. చరాచరజగత్తులో జీవమున్నవి. జీవం లేనివి, చలనమున్నవి, చలనం లేనివి, అన్ని పదార్థాలు ఆమే. ఆమె కానిది ఏదీలేదు. విద్య ఆమె అవిద్యా ఆమే. సంపదలిచ్చే లక్ష్మి ఆమె. దరిద్రదేవతా ఆమే. కాళరాత్రి, ప్రళయరాత్రి, మోహరాత్రి అన్నీ ఆమే దేవతలకు ఆహుతులర్పించే స్వాహా మంత్రము, పితృదేవతలకు తర్పణంలందించే స్వధా మంత్రముకూడా ఆమే.

దేవతలకు ఆహారమైన అమృతము ఆమె. ఓంకారము ఆమే. నాదము శబ్దం ఆమే. జ్ఞానమయి ఆమే.అజ్ఞానమయి ఆమే బుద్ధి, మతి, భ్రాంతి, లజ్జ, పుష్టి, తుష్టి, శాంతి, క్షమ, అన్ని రూపాలు ఆమెవే. కత్తి,డాలు, శూలము, శంఖము, చక్రము, గద, ధరించిన భయంకర స్వరూపిణి ఆమె. అశుభమూ ఆమే. క్షేమంకరి శుభంకరికూడా ఆమె. అత్యంత శుభప్రదమయినది ఆదేవి. వస్తువులకు ప్రాణులకు చలనం కలిగించేది శక్తికూడా ఆమెయే.

ఈ రకంగా అన్ని తానే అయి ఆ పరబ్రహ్మ స్వరూపమై పరమేశ్వరి తన భక్తుల కోరిక తీర్చి వారికి శాశ్వతమైన ఆనందము అంటే ముక్తిని ప్రసాదిస్తున్నది. తనను నమ్మినవారిని తనలో లీనము చేసికుంటున్నది.

## 7. పరా, అపరా విద్యలు:

విద్య రెండు రకాలు. 1. అపరా విద్య 2. పరావిద్య.

1. అపరావిద్య సంసార సుఖాలనుభవించటానికి కావలసిన ధనము, పలుకుబడి లభిస్తాయి. ఈ విద్య ఐహికంగా ఉన్నతస్థితులకు తీసుకునిపోతుంది. ధర్మాధర్మాల, పుణ్యాపుణ్యాల ప్రసంగాలతో సమన్వితమై ఉంటుంది. నాలుగు వేదాలు, వేదాంగాలు, ఉపవేదాలు అన్నీ ఇందులో అంతర్భూతాలు. కర్మకాండ, ఉపాసనాకాండ ఇవన్నీ లౌకిక సుఖాలు సంపాదించటానికి ఏర్పడ్డాయి. వేదశాస్త్రాల పరిచయంవల్ల అజ్ఞానం పోదు. వీటి అధ్యయనం వల్ల సాంసారిక విషయపరిజ్ఞానం కలుగుతుంది. ఈచదువువల్ల జన్మ జరామృత్యుభయం పోదు. ఇదంతా లౌకిక సమున్నతికి సాధన. ప్రపంచంలో చాలామంది ధనము, కీర్తి సంపాదించటానికి, సుఖాలు అనుభవించటానికి ఇష్టపడతారు. అపరావిద్య వాసనకలవారు స్వర్గం కావాలని, సుఖాలు కావాలని యజ్ఞయాగాదులు చేస్తారు. ఇలాటివారు సంసార లంపటంలో పడి, విషయభోగాలు అనుభవించటానికి సతమతమౌతారు. అయితే కర్మలనాచరించటంవల్ల సంసారబంధం నుంచి కొద్దిగా విముక్తిపొంది బ్రహ్మానుభవంపొందటానికి అర్హతకలుగుతుంది. యజ్ఞయాగాది అనుష్ఠానవిధులను వశిష్ఠాది ఋషులు ప్రతిపాదించారు. ఇది లౌకికులను ఉద్ధరించటానికి

ఏర్పాటు చేయ్యాంది. ఈ మార్గమంతా కామ్యకర్మలతోనిం ఉంటుం
ఈఇహపరలోక ఫలతో చాలమంది ఈ కర్మలకు ప్రలోభులౌతారు. ఈ పద్ధతిలో మంత్రాలు నిరర్థకంకాదు. ఎవ్వ ప్రలోభాలకులోను కారో, అంటే నిష్కామ్యకర్మ చేసేవారు స్వర్గాన్నిసాధించి, తద్వారా మోక్షప్ర యత్నిస్తారు. దీనినే కర్మమార్గం అంటారు. ఇది వేదసమ్మతమైన మార్గ కర్మలవల్ల సంసా ధం పూర్తిగా విచ్ఛేదనకాదు. కర్మఫలం పూర్తయిన వెం జీవుడు భూలోకంలో పు . జ్ఞానంలేని ఈకర్మలవల్ల దుఃఖకరమైన ఫలితాలే వస్తాయి. ఈ కర్మల నాచరించేవారి కర్మిష్టులంటారు. కొంతమంది ఈకర్మకాండను చిత్తశుద్ధికి ఉపయోగించు రు. కర్మానుష్ఠానంలో జ్ఞానాన్ని సమ్మిశ్రితం చేసేవాడికి బ్రహ్మదర్శనం జరుగుతుంది. ణానంతరము వీరు అర్చిరాది మార్గాలద్వారా బ్రహ్మలోకం చేరతారు.

2. పరావిద్యవల్ల పరమాత్మానుభవం, బ్రహ్మలోకప్రాప్తి కలుగుతాయి. మోక్షం సిద్ధిస్తుంది. పరావిద్య సాదన లౌకికలంపటలో ఇరుక్కున్న వారికి కష్టసాధ్యము. ఈ విద్యను సాధించాలంటే ముక్తిమార్గంలో అచంచల దీక్షతో ముందుకు సాగుతూపయనించాలి. లక్ష్యం తప్పకుండా ఈ మార్గంలో ముందుకు నడిస్తే బ్రహ్మప్రాప్తి తప్పక కలుగుతుంది. పరావిద్యను వివేకవంతుడు మాత్రమే పొందగల్గుతాడు. ఇది చర్మచక్షువులకు గోచరించదు. ఇంద్రియాలకు అందుబాటులో లేని తత్త్వంఅది. చరణాది శరీరభాగాలు లేనిది. సమస్తవిశ్వము అన్న ముయొక్క అధీనంలోనే ఉంది. ఇది సర్వవ్యాపకమైనది. ఇటువంటి శాశ్వతమైన జ్ఞానా కలగించేదే పరావిద్య. ఇదే పరబ్రహ్మతత్త్వజ్ఞానం. బ్రహ్మాన్ని నిర్దేశిస్తూ, బ్రహ్మజ్ఞానులు 'అక్షరం' అనే శబ్దంతో పిలుస్తారు. ఈ అక్షర బ్రహ్మత కి గుణాలు లేవు.

బ్రహ్మపదార్థం ప్రాపంచిక వస్తువుకాదు. ఇది ఈ రంగులో ఉంటుందనీ, ఈ రకంగా ఉంటుందనీ చెప్పటానికి వీలులేదు. దీనికి రూపంలేదు. నామంలేదు. అశాశ్వతమైన జగత్తుకు శాశ్వతమైన కారణం అది. అది వినాశమానమైనది. నిర్గుణమైనది. అందుకనే దానిలో ఈ గుణంలేదనికాని, ఈగుణం ఉం కాని చెప్పవీలుకాదు. అన్యవస్తువుల అపేక్షలేకుండానే సాలీడునోటిలోని దారంలాగా అక్షరపురుషునినుంచి ఈ జగత్తు సృష్టింపబడుతోంది.

సృష్టి గటానికి పూర్వం అక్షరపురుషుడైన బ్రహ్మతత్త్వంలో సృష్టి సంకల్పం కలిగింది. ఏకంగా ఉన్నతత్త్వానికి అనేకమయితే బాగుండుననే సంకల్పమది. ఇదే సృష్టికి ప్రాతిపదిక. అభివ్యక్త చైత న్యం (మొదటగా అభివ్యక్తమైనదానికి నామం 'హిరణ్యగర్భుడు'. ఈ హిరణ్యగర్భుడు స్థూలరూపం) ధరించాడు. దాన్నే 'విరా ' అంటారు. అన్నింటికన్నా సృష్టిలో ముందుగా ఉ ద్భవించినది అన్నం. అన్నం సృష్టింపబడిన తరువాతనే ప్రాణులు సృష్టింపబడ్డాయి. ప్రాణం నుండి మనః మనస్సునుంచి పంచభూతాలు, వాటినుంచి సమస్తలోకాలు ఉత్పన్నమైనాయి. సర్వజ్ఞుడైన పరబ్రహ్మనుండే ఈ సృష్టి ఉద్భ వించింది. దానినుంచే లోతైన

సముద్రాలు, ఎత్తైన పర్వతాలు వచ్చాయి. ఆబ్రహ్మము ఈజగత్తురూపంలోనే ఉంది. జీవాత్మపరమాత్మకన్న భిన్నంకాదని, ఈజగత్తంతా బ్రహ్మస్వరూపమే అని ఎవరు భావన చేస్తారో వాడు భాగ్యశాలి. సర్వత్రాబ్రహ్మదర్శనం చేసుకున్న వ్యక్తికి సంశయాలన్నీ విడిపోతాయి. అన్ని బంధాలనుండి విముక్తి కలుగుతుంది. ఉత్తమసాధనలో ఉండే సాధకుడికి ఎప్పుడూ బ్రహ్మస్వరూపభావనే మనసులో నిండివుంటుంది. చరాచరజగత్తులో ఉన్న పశుపక్ష్యాదులు, నదీనదాలు, వృక్షాలు, లతలు అన్నీ బ్రహ్మస్వరూపాలే, జగత్తులోని సత్ అసత్తులు, స్థూల సూక్ష్మాలు, మూర్తామూర్తాలు అన్నీ దానిలోనే ఉన్నాయి. ఈసర్వవస్తుసముదాయముయొక్క అస్తిత్వం బ్రహ్మపదార్థపు అస్థిత్వంమీదనే ఆధారపడిఉన్నది. సూర్యచంద్రులు కూడా ఆపరమాత్మవల్లనే ప్రకాశిస్తున్నారు.

ఆత్మ[illegible] [illegible]హతి కేవలం [illegible]ధ్యయనం చెయ్యటంవల్ల, పాండిత్యం సంపాదించటం వల్లరాదు. బుద్ధి సూక్ష్మతకలిగినప్పటికీ కేవలం పండితులు దీన్ని పొందగలేరు. బహిర్ముఖులైన ప్రజలు బ్రహ్మ[illegible] [illegible]రించి చర్చవింటారు. చేస్తారు. కాని బ్రహ్మానుభూతి మాత్రం పొందలేరు. బ్రహ్మచర్చవిని అర్థం చేసుకున్నవాడు అంతర్ముఖుడుకావాలి. అవిద్యమూలాన ఆత్మస్వరూపం మరుగున పడిపోతుంది. అవిద్యా మేణాలను బెదరగొడితే ఆత్మజ్ఞానం కలిగి ముక్తి లభిస్తుంది.

ముక్తి అంటే విడుదల అని అర్థం. అజ్ఞానంవల్ల ఏర్పడ్డ ఈసాంసారికవాసనలన్నీ త్రాళ్ళు. ఆ త్రాళ్ళు జీవులను బందీలుగా చేస్తాయి. అజ్ఞానాన్ని పటాపంచలు చేసి ఈ త్రాళ్ళను తెంచుకుని విడుదలకావటమే ముక్తి.

ఎవడు పరతత్వాధ్యానం చేసి తెలుసుకుంటాడో, వాడు సాక్షాత్తూ పరమపురుషుడౌతాడు. అతడు సర్వరోగాలనుండి, సర్వశోకాలనుండి, సర్వదుఃఖాలనుండి, సర్వమోహాలనుండి విడివడి, హృదయంలోని గ్రంధులన్నీ భేదించుకుని ముక్తుడై అమరత్వాన్ని సాధించుకుంటాడు.

8. శుక, వామదేవ మార్గాలు: -

సాధకుడు ముక్తిపొందటానికి రెండు మార్గాలు చెప్పబడ్డాయి. 1. జ్ఞానమార్గము 2. కర్మమార్గము. వీటినే శుక, వామదేవ మార్గాలు అంటారు. ఈ రెండు మార్గాలలో దేనిని అనుసరించినా ముక్తిని పొందుతారు. కాని వాటిలో శుక మార్గము ద్వారా ముక్తి పొందటం [illegible]లిక. ఇది సద్యోముక్తి ప్రదమని చెప్పబడింది. ఇది జ్ఞాన యోగము. రెండవదయిన వామదేవ మార్గము కర్మయోగము. ఈ మార్గంలో నడిచేవారు యోగము, ప్రాణాయామము మొదలైనవి చేయవలసి ఉంటుంది. వీటి సాధనలో అనేక అడ్డంకులు వస్తాయి. అందుచేత అనేక జన్మలు ఎత్తి జన్మాంతర అభ్యాస పుణ్యము వలన ఈ మార్గంలో సాధకులు కృతకృత్యులవుతారు. ఈ మార్గము క్రమముక్తిప్రదము.

శుకము అంటే పక్షి. ఇది చెట్టు కొమ్మ చివర ఉన్న పండును చూసినప్పుడు వెంటనే వెళ్ళి దాన్ని తినేస్తుంది. అలాగే జ్ఞాన యోగి బ్రహ్మతత్త్వము తెలిసినప్పుడు తాను అందులో లీనమై పోతాడు. అందుకే దీనిని శుక మార్గము అంటారు. వామదేవము అంటే చీమ. ఇదికూడా చెట్టుకొమ్మ చివర ఉన్న పండును తినాలనే కోరికతో చెట్టు ఎక్కుతుంది. కాని ఆ ఎక్కటంలో ఎన్నో అడ్డంకులు. వీటన్నింటినీ దాటుకుని ఆ పండును చేరేసరికి చాలాకాలం పడుతుంది. అలాగే కర్మయోగి తన యోగ సాధనతో ముక్తి సాధించటానికి చాలా జన్మలు ఎత్తవలసి ఉంటుంది. అందుకే దీనిని వామదేవ మార్గము అంటారు. ఈ రెండు మార్గాలలోను శుక మార్గము ఉత్తమము అని చెప్పబడింది. సాధకులు గమనింతురుగాక.

పుణ్యానంద మునీంద్ర విరచిత **కామకళావిలాసము**

అను అద్వైత సిద్ధాంత ప్రతిపాదిత శ్రీవిద్యా గ్రంథానికి

హరితసగోత్రీకుడు, క్రోవి కృష్ణమూర్తి,

సత్య పర్వత వర్ధనమ్మగారల జ్యేష్ఠ పుత్రుడు,

విజయవాడ శాతవాహన కళాశాల అధ్యాపకుడు అయిన

**క్రోవి పార్థసారథి**

సులభశైలిలో, సర్వజనామోదము పొందునట్లుగా వ్రాసిన

**శ్రీవిద్యాసర్వస్వము** అను తెలుగు వ్యాఖ్యానము సమాప్తము.

**ఓంతత్సత్**

--------------------------------------000000000--------------------------------------

# కామకళా విలాసము
## మూలసూత్రములు

1. సకల భువనోదయస్థితిలయమయ లీలావినోదనోద్యుక్త :
   అంతర్లీన విమర్శః పాతు మహేశః ప్రకాశమాత్రతనుః
2. సా జయతి శక్తి రాద్యా నిజసుఖమయనిత్యనిరుపమాకారా
   భావిచరాచరబీజం శివరూప విమర్శ నిర్మలాదర్శః
3. స్ఫుటశివశక్తిసమాగమబీజాంకురరూపిణీ పరాశక్తిః
   అణుతరరూపానుత్తరవిమర్శలిపిలక్ష్యవిగ్రహా భాతి॥
4. పరశివరవికరనికరే ప్రతిఫలతి విమర్శదర్పణే విశదే
   ప్రతిరుచిరుచిరే కుడ్యే చిత్తమయే నివిశతే మహాబిందుః
5. చిత్తమయో హంకార స్సువ్యక్తాహార్ణ సమరసాకారః
   శివశక్తిమిథునపిండః కబళీకృతభువనమండలో జయతి॥
6. సితశోణబిందుయుగళం వివిక్త శివశక్తి సంకుచ ప్రసరమ్
   వాగర్థసృష్టిహేతుః పరస్పరానుప్రవిష్టవిస్పష్టః॥
7. బిందు రహంకారాత్మా రవి రేతన్మిథునసమరసాకారః
   కామః కమనీయతయా కలా చ దహనేందు విగ్రహౌభాతి
8. ఇతి కామకలా విద్యా దేవీచక్ర క్రమాత్మికాసేయం
   విదితా యేన స ముక్తో భవతి మహా త్రిపురసుందరీ రూపః
9. స్ఫుటితాదరుణాద్బిందోర్నాద స్యోం కురో రవో వ్యక్తః
   తస్మా ద్గగనసమీరణదహనోదకభూమి వర్ణసంభూతిః
10. అథ విశదాదపి బిందోర్గగనానిల వహ్ని వారిభూమిజనిః
    ఏతత్పంచక వికృతిర్జగదిద మణ్వాద్యజాండ పర్యంతమ్॥
11. బిందు ద్వితయం యద్వద్వేద స్త్రీహీనం పరస్పరం తద్వత్
    విద్యాదేవతయోరపి నభేదలేశోస్తి వేద్యవేదకయోః
12. వాగర్థా విశ్వయుతౌ పరస్పరం శక్తి శివమయావేతౌ
    సృష్టిస్థితిలయభేదౌ త్రిధా విభక్తౌ త్రిబీజరూపేణ॥

13. మాతా మానం మేయం బిందుత్రయబీజభిన్నరూపాణి
ధామత్రయ పీఠత్రయ శక్తిత్రయ భేద భావితాన్యపిచ॥

14. తేషు క్రమేణ లింగత్రితయం తద్వచ్చమాతృకా త్రితయం
ఇత్థం త్రితయపురీ యా తురీయపీఠా చ భేదినీ విద్యా.

15 శబ్దస్పర్శౌ రూపం రసగంధౌ చేతి భూతసూక్ష్మాణి
వ్యాపకమాద్యం వ్యాప్యం తూత్తరమేవం క్రమేణ పంచదశః

16. పంచదశాక్షరరూపా నిత్యా చైషాహి భౌతికాऽభిమతా
నిత్యాశ్శబ్దాది గుణప్రభేదభిన్నా స్తథాऽనయా వ్యాప్తాః

17. నిత్యా స్తిథ్యాకారా స్తిథయ శ్శివశక్తి సమరసాకారాః
దివసనిశామయ్యస్తా శ్రీవర్ణాస్తేऽపితద్ద్వయీరూపాః

18. అజ్వ్యంజన బిందుత్రయ సమిష్టి భేదైగ్వ్యిభావితాకారా,
షట్త్రింశత్తత్త్వాత్మా తత్త్వాతీతా చ కేవలా [illegible]ద్యా.

19. విద్యాపి తాదృగాత్మా సూక్ష్మా సా త్రిపురసుందరీ దేవీ
విద్యావేద్యాత్మకయో రత్యంతా భేద మామనం త్యార్యాః

20. యాసాంతరోహరూపా పరా మహేశీ త్రిభావితా సైవ
సృష్టా పశ్యంత్యాది త్రిమాతృకాత్మాచ చక్రతాం యాతా॥

21 చక్రస్యాపి మహేశ్యాన భేదలేశోऽపిభావ్యతేవిబుధైః
అనయో స్సూక్ష్మాకారాపరైవ సా స్థూలయోశ్చ కాపి భిదా॥

22. మధ్యం చక్రస్య స్యాత్పరామయం బిందుతత్త్వమేవేదం।
ఉచ్ఛూనం తచ్చ యదా త్రికోణరూపేణ పరిణతం స్పష్టం॥

23. పశ్యంత్యాది త్రితయవిదానం త్రిబీజరూపం చ।
వామా జ్యేష్ఠా రౌద్రీ చాంబికయా నుత్తరాంశ భూతా ప్యః

24. ఇచ్ఛాక్రియా యాశాంతా శ్చైతాశ్చేత్తరావయవాః
వ్యస్తావ్యస్త తద్వర్గద్వయ మిదమేకా[illegible] [illegible]పశ్యంతి॥

25. ఏవం కామకలాత్మా త్రిబిందుతత్త్వస్వయా[illegible]ర్ణమ[illegible]
సేయం త్రికోణరూపం యాతా త్రిగుణస్వరూపిణీ మాతా॥

26. ఏకా పరా తదన్యా వామాదివ్యష్టిమాతృసృష్ట్యాత్మా।
తేన నవాత్మా జాతా మాతా సా మధ్యమాభిధానాఖ్యాం॥

27. ద్వివిధాహి మధ్యమా సా సూక్ష్మా స్థూలాకృతి స్తథా సూక్ష్మా
నవనాదమయీ స్థూలా నవవర్గాత్మా చ భూతలిప్యాఖ్యా॥

28. ఆద్యా కారణ మన్యా కార్యం త్వనయోర్వ్యతస్తతో హేతోః।
సైవేయం నహి భేద స్తాదాత్మ్యం హేతుహేతుమతోరిష్టం॥

29. శషసపవర్గమయం తద్వసుకోణం మధ్యకోణవిస్తారః
నవకోణం మధ్యం చేత్యస్మిన్ చిద్దీపదీపితే దశకే॥

30. తచ్ఛాయాద్వితయ మిదం దశారచక్రద్వయాత్మనా వితతం
తటచకవర్గచతుష్టయవిలసనవిస్పష్టకోణవిస్తారమ్॥

31. ఏతచ్చక్రచతుష్కప్రభాసమేతం దశారపరిణామః
ఆదిస్వరగణగతచతుర్దశవర్ణమయం చతుర్దశార మిదం॥

32. పరయా పశ్యంత్యాపిచ మధ్యమయా స్థూలవర్ణరూపిణ్యా
ఏతాభి రేకపంచాశదక్షరాత్మికా వైఖరీ జాతా॥

33. కాదిభి రష్టబి రుపచిత మష్టదళాబ్జం చ వైఖరీ వర్ణైః
స్వరగణసముదిత మేతద్వ్యష్టదళాంభోరుహంచ సంచింత్యమ్॥

34. బిందుత్రయమయతేజ స్త్రితయవికారస్థితాని వృత్తాని
భూబింబత్రయ మేత త్పశ్యంత్యాదిత్రిమాతృవిశ్రాంతిః॥

35. క్రమణం పదవిక్షేపః క్రమోదయస్తేన కథ్యతే ద్వేధా
ఆవరణం గురుపంక్తిః ద్వయ మిద మంబాపదాంబుజప్రసరం॥

36. సేయం పరా మహేశీ చక్రాకారేణ పరిణమేత యదా
తద్దేహావయవానాం పరిణతి రావరణదేవతా స్సర్వాః॥

37. ఆసీనా బిందుమయే చక్రే సా త్రిపురసుందరీ దేవీ
కామేశ్వరాంకనిలయా కలయా చంద్రస్య కల్పితోత్తంసా॥

38. పాశాంకుశేక్షుచాపప్రసూనశరపంచకాంచితస్వకరా
బాలారుణారుణాంగీ శశిభానుకృశానులోచనత్రితయా॥

39. తస్మిన్భువనం గుణభేదాదాస్తే బిందు త్రయాత్మకే త్ర్యస్రే
కామేశీ మిత్రేశ ప్రముఖద్వంద్వత్రయాత్మనా వితతమ్॥

40. సమకోణనివాసిన్యో యాస్తా స్సంధ్యారుణావశిన్యాద్యాః
పూర్వాష్టకమే వేదం చక్రతనో స్సంవిదాత్మనో దేవ్యాః

41. తద్విషయ వృత్తయస్తా స్సర్వజ్ఞాది స్వరూప మాపన్నాః
అంతర్దశారనిలయా లసంతి శరదిందుసుందరాకారాః

42. తద్బాహ్యపంక్తికోణే యోగిన్య స్సర్వసిద్ధిదాః పూర్వాః
దేవీ ధీకర్మేంద్రియ విషయమయా విశదవేషభూషాఢ్యాః

43. భువనారచక్రభవనా దేవీ మమకరణ వివరణస్ఫురణాః
సంధ్యానవర్ణ వసనాస్సంచింత్యా స్సంప్రదాయ యోగిన్యః

44. అవ్యక్త మహదహంకృతి తన్మాత్రా స్స్వీకృతాంగనాకారాః
ద్విరదచ్ఛదసరోజే జయంతి గుప్తతరయోగిన్యః

45. భూతానీంద్రియదశకం మనశ్చ దేవ్యా వికారషోడశకం
కామాకర్షిణ్యాదిస్వరూపత షోడశార మత్రాస్తే॥

46 ముద్రాస్త్రిఖండయా సహ సంవిన్మయ్యస్సముచ్ఛ్రితాస్సర్వాః
ఆదిమహీగృహవాసా భాసా బాలార్కకాంతిభిస్సదృశాః॥

47. ఆధారనవక మస్యా నవచక్ర త్వేన పరిణతం యేన
నవనాథశక్తయో ఽపిచముద్రాకారేణ పరిణతం తేన॥

48. అస్యాస్త్వగాదిసప్తక మాకారశ్చైవ మష్టకం స్పష్టం
బ్రాహ్మ్యాదిమాతృరూపం మధ్యమభూబింబ మేతదధ్యాస్తే

49. అణిమాది సిద్ధయో ఽస్యాః స్వీకృతకమనీయకామినీరూపాః
విద్యాంతర ఫలభూతా గుణభావేనాంత్యభూనికేతనగాః॥

50. పరమానందానుభవః పరమగురు ర్నిర్విశేషబింద్వాత్మా
స పునః క్రమేణ భిన్నః కామేశత్వం యయౌ విమర్శాంశాత్॥

51. ఆసీన శ్రీపీఠే కృతయుగకాలే గురుశ్శివో విద్యామ్
తస్యై దదౌ స్వశక్త్యై కామేశ్వర్యై విమర్శరూపిణ్యై.

52. సేయాయ మిత్రసంజ్ఞాం స్థానేశాన్ జ్యేష్ఠ మధ్య బాలా॥ ప్
చిత్ప్రాణవిషయభూతాన్ త్రేతాయుగాదికారణత్రిగురూన్

53. బీజత్రితయాధిపతీ న్పరీక్ష్య విద్యాం ప్రకాశయామాస
ఏతైరేఖత్రితయం సమనుగృహీతం గురుక్రమో విదితః॥

54. ఉదితః పుణ్యానందాదితి కామకలాంగనావిలాసో7యం
పరశివభుజంగభావాకర్షణహర్షాయ కల్పితాం నిత్యం॥

55. చింతాతరంగతరళ స్పృష్టాసలిలః ప్రపంచవారాశిః
యదనుగ్రహేణ తీర్ణ స్తస్మై శ్రీనాథ నావికాయ నమః॥

శ్రీ పరాభట్టారికను స్తుతి చేస్తూ పుణ్యానంద మునీంద్రులు వ్రాసిన

55 కామకళాసూత్రములు సంపూర్ణము

శ్రీమహాత్రిపుర సుందరీ దేవతార్పణమస్తు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ